# భారతి—త్రయోదశ సంపుటము—భా. ౧

## వ్యాసముల అకారాది సూచి

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

# విషయానుక్రమణిక



# చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. జనవరి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము మాకు చందాదారులుగ నుందురను నమ్మకముతో ఫిబ్రవరి 8-వ తేదిని రూ|| 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 8, H 26, 28, 64, J 4, 5, K 8, 25, 27, M 14, N 32, 33, 34, 35, P 16, 62, 64, 65, R 17, 18, 21, 51, 58, 60, S 83, 84, 90, 91, 96, 97, 98, 99, 100, 101, 105, 106, 118, 139, 143, 163, 235, 238, 240, 241, 246, 250, 258, 259, V 22, 23, 57, 60, 61,

---

Saraswatha Nirukthanaam

# విషయానుక్రమణిక



త్రివర్ణచిత్రములు: నల్లకలువ, సుందరమూర్తి నాయనారు చరిత్రలోని ఒకరంగము.

సాధారణచిత్రములు: పంచమజార్జి చక్రవర్తి, అష్టమ-ఎడ్వర్డు చక్రవర్తి, కారకోల్ (మయశిల్ప) చిత్రములు, శైశవచిత్రములు, గడలు, ఇతరచిత్రములును.

# సవరణ

ఈ సంచికయందు గల 'రేడియం' చిత్రములలో ఉమ్మిగ్రంథుల విస్ఫ్రణముల చిత్రములు థైరాయిడ్ గ్రంథి విస్ఫ్రణచిత్రములుగను, థైరాయిడ్ గ్రంథుల విస్ఫ్రణచిత్రము, ఉమ్మిగ్రంథుల విస్ఫ్రణచిత్రముగను పొరపాటు పడినవి. పాఠకులు వానిని సవరించుకొన ప్రార్థితులు.

—సం. భా.

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. ఫిబ్రవరి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తియగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో ఫిబ్రవరి 8-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 10, 23. B 5, 17. D 5, 6. E 4. G 5, 6, 8. H 32, 37. K 18, 28. M 15. N 14, 17, 26, 38. P 21, 39, 68. R 22, 23, 26, 61, 62. S 56, 108, 111, 112, 113, 114, 116, 117, 120, 122, 131, 160. V 26, 27. Z 3.

---

# విషయానుక్రమణిక



# చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. మార్చి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో మార్చి 8-వ తేదిని రూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 2 3, B 7, D 2, H 1 2 3 4 5 9 10 11 12 13 14 15 17 18 38 42, J 3 7, K 1 24, L 1, M 1 2 16, N 3 4, P 1 24 49, R 1 2 4 27 43 63, S 8 11 12 14 16 17 19 23 34 59 68 102 117 118 121 123 126 128 132 134 136 201 202 276, V 2 3 4 25 29 32. *Z* 1.

---

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈ నెల (1936 సం. ఏప్రిల్)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో ఏప్రిల్ 8-వ తేదిని రూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 4, 11. B 8, 9. G [illegible] 11. H 6, J 8, K 6, 17, 19, 23. L 2, 5, 10. N 6, 7, 8, 19, 21, 25. P 2, 26. R 8, 9, 34, 58. S 15, 21, 24, 30, 31, 35, 41, 69, 132, 135, 141, 144, 145, 155, 161, 172. V 6, 8, 33, 36, 37, 38, 51.

# విషయానుక్రమణిక



# చిత్రములు

# విషయానుక్రమణిక



# చిత్రములు

త్రివర్ణ చిత్రములు—ముద్దులపావురము; శివభక్తమాహాత్మ్యమున కులలాఖ్యానమున నొక రంగము.

సాధారణ చిత్రములు—'జల్లందూరు' కన్యామహావిద్యాలయము; స్నానము; విహారరంగము; పనకొట్టుడు; మరమ్మతు; పైరునాటుట; కాంగ్రెసుచిత్రములు; నూతన వైస్రాయి దంపతులు; వ్యంగ్యచిత్రములును; వివిధచిత్రములును.

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. మే)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో మే 8-వ తేదిని రూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 6. B 2, 3. C 1, 2. D 1. G 4. H 8. J 2, 10. L 3, 4. N 9, 10. P 5, 6, 7, 8, 9, 34. R 11, 12, 13, 35. S 43, 44, 46, 47, 51, 52,- 56, 159, 162, 165, 223, 252. V 9, 11, 12, 14.

---



# భారతి

సంపు. ౧౩ యువసంవత్సరము, పుష్యమాసము (జనవరి ౧౯౩౬) సంఖ్య ౧

## స్వవిషయము

భారతికి ౧౨ ఏండ్లు నిండి ౧౩ వ ఏడు ప్రారంభమైనది. రుధిరోద్గారిసంవత్సరమున పుష్యమాసమునందు పుట్టిన భారతి బాలారిష్టములు గలుగకను క్రమాభివృద్ధిని పొందుచున్నను గతాభివృద్ధి విషాదమును గలుగ జేయుచున్నది. మొదటి సంచికయందు స్వవిషయావలోకనసంస్మరణము లందు జేసిన సంకల్పమునె పదుమూడవ యేటను యువసంవత్సరమునందును జేయుట విషాదమును గలుగ జేయుచున్నది. గతించిన ౧౨ ఏండ్ల యందును మానవస్వాతంత్ర్యధర్మపరిణామమునకు ప్రపంచమునందు సంభవమగుచున్న * మహా పరివర్తన మాశాజనకముగనున్నను ఆంధ్రాభ్యుదయము విషాదమును గలుగజేయుచున్నది. మానవస్వాతంత్ర్య ధర్మసాధ్యమైన ప్రపంచధర్మాభ్యుదయమునకు విశ్వమంతయును మహాధర్మ పరివర్తనమును పొందుచున్నది. ధర్మశ్రుతిరాగలయబద్ధమైన విశ్వయాత్ర మానవస్వాతంత్ర్య ధర్మసంస్థాపనార్థ మనవరతము జ్ఞానారాధనమును చేయుచున్నది. మతాచార్యులు వేద మతగ్రంథములకు జ్ఞానవ్యాఖ్యానములను వ్రాయుచున్నారు. కవులు జ్ఞానకావ్యములను రచించుచున్నారు. గాయకులు జ్ఞానగీతములను పాడుచున్నారు. శాస్త్రజ్ఞులు విజ్ఞానాన్వేషణమును జేయుచున్నారు. కళాభిజ్ఞులు జ్ఞానశక్తిమూర్తుల నారాధించుచున్నారు. చరాచర ప్రపంచమంతయును మానవ

స్వాతంత్ర్య ధర్మసంస్థాపనార్థము జ్ఞానాంజలులను సమర్పించుచున్నది. ఈమహోదయసమయమునం దాంధ్రావనియును నితర దేశములవలెను స్వయంతరణమునకును మానవస్వాతంత్ర్య ధర్మసంస్థాపనమునకును విజ్ఞానోపార్జనమును జేయుటయును జ్ఞానాంజలులను సమర్పించుటయును పుణ్యము, పురుషార్థము.

ప్రథమసంచికయందు సువ్యక్తము చేయబడిన మహదాశయములు వర్తమానకాలమునందును కార్యరూపమును దాల్చకుండుట సంతాపకరము. మొదటి సంచికయందు గల దైన్యమైన ఆత్మసంస్మరణమునకు ౧౨ ఏండ్ల తరువాతనైనను విమోచనము గలుగకున్నది.

భారతి దీనదశ ననుభవించుచున్నది. అంగములు శుష్కించినవి. కాంతికళలు పోయినవి. విషమస్థితి గలిగినది. ఈ మహోపద్రవమునందు మునిగి తేలుచున్న భారతి నుద్ధరించి శుభస్థితిని గల్పింపవలయునను సంకల్పము భారతహృదయమునందు గలిగినది. సేవాపరాయణులు పలువిధముల నీ దేవి నారాధించుచు దివ్యరూపసందర్శనమును జేయగోరుచున్నారు. ఆరాధనాభిలాష యితర రాష్ట్రములందువలె నాంధ్రరాష్ట్రమునందునుగలదు. ఆ యభిలాషను సఫలము చేయుటకు పత్రికలను ప్రచురించుచున్నారు. గ్రంథములను వ్రాయుచున్నారు. చిత్తరువులను చిత్రించుచున్నారు. పాటలను పాడుచున్నారు. ఈ ప్రయత్నము లన్నియును భారతిని ప్రత్యక్షము చేయుచు నాత్మవికాసమునకు సాధనంబులగుచున్నవి. స్వీయసాంప్రదాయాచారసిద్ధమైన భారతీ స్వరూపమును సంకల్పించి ధ్యానించి పూజించి వర్ణించి చిత్రించి కీర్తించి భారతిని ప్రత్యక్షము చేసికొనుటయె స్వాతంత్ర్య స్థితికి సాధనము. ఆ సాధనసంపత్తిని సఫలముచేయుట కాంధ్రప్రపంచము పూర్వాపర సంస్కారములను సమన్వయమును జేయుటకు బూనుకొనుచున్నది. ఆంధ్ర ప్రవృత్తిని ఆంధ్రభారతియును యథాశక్తిని సువ్యక్తము చేయుట కవతరించినది.

ఈపరమార్గమునే స్వవిషయమునందు మరల సంస్మరణము చేయుట దురదృష్టము. మానవస్వాతంత్ర్య ధర్మసంస్థాపనార్థము సకల దర్శనములందును, వ్యవస్థలందును సంప్రాప్తమగుచున్న మహాపరివర్తనము సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నది. రాజ్యాంగములు మారుచున్నవి; సాంఘిక ధర్మములు తలక్రిందు లగుచున్నవి; మతాచారము లంతర్ధానములగుచున్నవి; సాహిత్యకళానిర్మాణములు నవయుగోదయమునకు సాధనములుగ నున్నవి; ఆర్థికవ్యవస్థ లభిమానపూరితము లగుచున్నవి. వర్తమానపరివర్తనదశయందు మానవస్వాతంత్ర్య ధర్మోపలబ్ధికి సకలవ్యవహారములందును స్వతంత్రాచరణములు సాధనములుగ నున్నవి. గతాగతముల సంస్మరణ సంభావన సందర్శనములు స్వధర్మారాధకులకు స్వధర్మ నిర్వహణావసర సాధనములను విశదము చేయుచున్నవి. భారతియందు పండ్రెండేండ్లకు పూర్వము సంకల్పించిన కల్పమునందు స్వల్పాంశమునైనను సార్థకము చేయజాలనందులకు పత్రికానిర్వాహకులు చింతిలుచున్నారు. గతించిన ౧౨ ఏండ్లయందును భారతీ నిర్వహణమునకు సహాయభూతులైన మహాజనులకు పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు. గతకాలమునందువలెను భావికాలమునందును భారతీ నిర్వహణమును సాధ్యముచేయుటకు యథాశక్తిని సాయపడుటకు గ్రాహకులు లేఖకులు అభిమానులు మొదలగు మహాజనులు ప్రార్థితులు. మానవస్వాతంత్ర్య ధర్మపరాయణు లందరును మానవస్వాతంత్ర్య ధర్మసంస్థాపనార్థము కర్మాంజలులను, ధర్మాంజలులను, జ్ఞానాంజలులను యథాశక్తిని సమర్పించి భారతీదేవి నారాధించి కృతార్థు లగుదురు గాక !




శ్లో. కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్ సంచారయామి నళినీదళతాళవృంతైః;
అంకే నిధాయ కరభోరు యథాసుఖం తే సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ.

—కొత్తపల్లి సుబ్రహ్మణ్యం



అలవోక                                        కమలనాధ్-అగస్త్య

# సంస్కృతసర్వనామములు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి

1. శబ్దములన్నియు ధాతుజములని భాషా శాస్త్రసమయము. నామవాచకజనక ధాతువులకంటె సర్వనామజనకధాతువులు భిన్నములుగా నున్నవి. ఇంతేగాక సుబంతరూపములలోగూడ నామవాచకములకును సర్వనామములకును భేదము గలదు. ఈభేదము మూడువిధములుగా నున్నది.

౧. సర్వనామముల ప్రత్యయము నామవాచకముల ప్రత్యయమునకంటె గొన్నియెడల భిన్నముగా నున్నది. ఉ. సం. తద్, లా. **istud** సం. యుగమ్, లా. **jugum**. మఱియు నామవాచకములకంటె నధికముగా సర్వనామములలో ప్రత్యయరహితశబ్దము విభక్తి రూపముగ వ్యవహరింపబడుచున్నది. ఉ. సం. మా, గ్రీ. **me**, ఇంగ్లీ. **me**. ప్రప్రథమమున నామవాచకములవలెగాక సర్వనామములలో విభక్త్యర్థము లస్పష్టముగా నుండుటయే పై భేదమునకు గారణమువలె దోచుచున్నది. సర్వనామములకు నామవాచకములన్ని సుబంతరూపము లుండినవికావు. నామవాచకార్థమునకు సదృశమగు నర్థమును నామవాచకరూపసదృశసర్వనామ రూపముచే సూచింపవలెనను నుద్దేశముచే సర్వనామ రూపములు నామవాచకరూపములతో సమానముగా జేయబడినట్లు ప్రత్యేకభాషల చరిత్రమువలన మనకు స్పష్టపడుచున్నది.

౨. అనేకవిభక్తులలో సర్వనామ శబ్దములకు విభక్తిప్రత్యయములకు బూర్వము కొన్నియాగమములు చేరుచున్నవి. నామవాచకములకును సర్వనామములకును బ్రత్యయములు సమానముగానుండు విభక్తులలోను, భిన్నముగా నుండు విభక్తులలోనుగూడ నీయాగమము లగపడుచున్నవి. వీనిలో స్మ (-sm-), స్య (-sy-) ఏ (-e-) అనునవి ముఖ్యములైనవి. ఉ. సం. తస్మిన్ (సప్తమి), తస్మాద్ (పంచమి), చూ. వృకాద్ ;— సం. తమ్ (ద్వితీయ), చూ. వృకమ్; సం. తస్మై, గాథి. **thizai**. చూ. వై. సువపత్న్యై;—సం. తామ్ (ద్వితీయ), గాథి. **tho**, చూ. అశ్వామ్. ఈయాగమములు విభక్తిరూపముల నెట్లు ప్రవేశించినవో ముందు తెలియజేయబడును. వీనిని యాగమము లనుటకంటె బ్రత్యయములనుట యుచితముగా నున్నట్లు తోచుచున్నది.

3. నామవాచకముల విభక్తులకంటె సర్వనామ విభక్తులు విశేషముగా ప్రత్యేకపదముల నాకర్షించుచున్నవి. ఇవి విభక్తియంతమున జేరుచుండును. ఉ. అమ్ (-em;-om-), మ్ (-m-): సం. ఇదమ్, ఇమమ్, వయమ్ ; ఉ. (u) : సం. సో, ప్రా. పెర్షి. hauw గ్రీ. outos ; ఇ (i) : లా. qoi, quii ఈపదములు ప్రప్రథమమున నర్థవత్తులుగా నుండినవి. క్రమముగా నివి వానియర్థమును గోలుపోయి సప్రత్యయభాగములుగా దలంపబడ నారంభించినవి. వీని యర్థములను దెలిసికొనుట కాధారములు లేవు.

2. సర్వనామముల విభక్తిప్రత్యయములు నామవాచకములకు గొన్నియెడల సంక్రమించినవి. మాతృ భాషలోనే యీ సాంకర్యము ప్రారంభమైన ట్లగపడుచున్నది. దీనికి విపరీతముగా మఱికొన్నియెడల నామవాచకముల ప్రత్యయములు సర్వనామములకు వ్యాపించినవి. ఇట్లు గ్రీకు కెల్టిక్ భాషలలో ప్రాచీనప్రత్యయములతో నుండు సర్వనామము లతి స్వల్పముగానున్నవి.

కొన్నియెడల సర్వనామములలోనే పరస్పర భేద మగపడుచున్నది. ఒక సర్వనామమునకు సర్వనామముల ప్రత్యయమును, మఱియొక సర్వనామమునకు నామవాచకముల ప్రత్యయమును నగపడుటకలదు. ఉ. సం. స+కః, తస్మాద్ + తాద్, తద్ + కిమ్. ఇట్టి యెడల సర్వనామవిలక్షణ ప్రత్యయఘటిత రూపమే ప్రాచీనమైనదనియు నామవాచకవిలక్షణ ప్రత్యయఘటితరూపము నూతనముగా నేర్పడినదనియు

దలంచుట సరికాదు. తఱచుగా నిట్టి స్థలములలో బూర్వము నామవాచకములకును సర్వనామములకును ప్రత్యయము సమానముగానుండెననియు విలక్షణప్రత్యయ ఘటితరూపము నవీనముగా నేర్పడినదనియు దలంచుట కవకాశములు గలవు. తాత్, రామాత్ అనురూపముల సామ్యము ప్రాచీనమైనదనియు సప్తమి ననుసరించి (తస్మిన్) తస్మాత్ అను రూపము తాత్ అనుదానికి మాఱుగా వ్యవహారములోనికి వచ్చినదనియు జెప్పవచ్చును.

3. సర్వనామములు రెండువిధములుగానున్నవి. కొన్ని మూడు లింగములలోను సమాన రూపములతోను, మఱికొన్ని భిన్నరూపములతోను నున్నవి.

అనేక సర్వనామశబ్దములకు విభక్తులన్నియు నేక ప్రాతిపదికయుక్తములుగా లేవు కొన్నివిభక్తులలో నొక ప్రాతిపదికయును, మఱికొన్ని విభక్తులలో మఱియొక ప్రాతిపదికయును నగపడుచున్నవి. ఉ. సః, తమ్, తేన; వయమ్, అస్మాన్. ప్రత్యేకభాషలలో నిట్టి రూపములకు సాంకర్యము సంభవించి విభక్తులు చాలవఱకు సమానాకారములుగా జేయబడినవి. ఇకారణముచేతను, సర్వనామశబ్దములపరస్పర మేలనముచేతను, సర్వనామశబ్దములకు శబ్దాంతర మేలనముచేతను మాతృభాషలోని సర్వనామములు ప్రత్యేకభాషలలో నత్యధికవిపరిణామములను బొందియున్నవి. కావ ప్రత్యేకభాషలలోని సర్వనామముల చరిత్రమును సమగ్రముగా దెలిసికొనుట సులభసాధ్యముకాదు. కాబట్టి సంస్కృత సర్వనామవిభక్తు లేరీతిగా నుద్భవించినవని తలంపవచ్చునో నదిమాత్ర మీక్రిందను సూచింపబడును.

## తచ్ఛబ్దము

4. ఈశబ్దమునకు తద్ అనునది ప్రాతిపదికయని మన వైయాకరణులు చెప్పుచున్నారు. సమాసములోను, ప్రత్యయము పరమగునప్పుడును దఱచుగా నీ రూపమే యగపడుచుండును. ఉ. తచ్ఛీల, తత్కర, తదన్తర, తత్త్వ, తద్వత్, తన్మయ మొ. పాశ్చాత్యులు త యనునదియే ప్రాతిపదికయని చెప్పుచున్నారు. ఏతత్ప్రాతిపదిక ఘటితశబ్దములుగూడ విశేషముగా గలవు. ఉ. తావత్, తతి, తాదృశ్, తతః, తత్ర, తథా, తదా మొ.

ఈశబ్దమున కనపుంసక ప్రథమైకవచనమున మాత్రము సయను ప్రాతిపదిక యగపడుచున్నది. ఉ. సః (పుంలిం.), సా (స్త్రీలిం.); మిగిలిన విభక్తులలోనెల్ల తకారరూప ప్రాతిపదికయే యగపడుచున్నది. ఈభేదము ఐరేనియన్, గ్రీక్, గాథిక్ భాషలలోగూడ నగపడుచుండుటచే మాతృభాషలోగూడ నిట్లే యుండినదని యూహింపబడినది. ఉ. అవె. hō (పుంలిం) hā (స్త్రీలిం.); గ్రీ. o, ē; గాథి. sa, sō. క్రమముగా ప్రత్యేకభాషలలో ప్రాతిపదికములకు వినిమయము సంభవించి మాతృభాషలోని విభాగము చెడినది. ఉ. వై. సస్మిన్, లిథు. tas, tā (ప్రథమ. పుంలిం. స్త్రీలిం.)

5. వేదమున అకారాకారాంత శబ్దములకు గల రూపాంతరములే యీశబ్దమునకుగూడ నగపడుచున్నవి. అవి యీక్రిందను జూపబడినవి.

పుంలింగము – ఏకవచనము – తృ. తేనా
స. సస్మిన్
ద్వివచనము – ప్ర.ద్వి. తా
బహువచనము– తృ. తేభిః
నపుంసకలింగము–బహువచనము – ప్ర. ద్వి. తా

6. ఇక నీశబ్దముయొక్క విభక్తు లేరీతిగా నుద్భవించినవని యూహింపబడినవో తెలిసికొనవలసియున్నది.

౧. పుంలింగము.

ఏకవచనము:—ప్రథమ: అవెస్తా గ్రీక్ గాథిక్ రూపములనుబట్టి మాతృభాషలో నీవిభక్తి so అను రూపమున (ప్రత్యయరహితముగా) నుండినట్లూహింపవలసియున్నది. అవె. hā, aesa (ఏష), గ్రీ. o. గాథి. sa. సంస్కృతమున వాక్యములో సామాన్యముగా నగపడు రూప మిదియే కావచ్చును. కొన్ని గ్రీక్ లాటిన్ భాషారూపములనుబట్టి మాతృభాషలో ప్రత్యయయుక్తమగు sos అనురూపముగూడ వ్యవహారములో

నుండిన ట్లూహింపవచ్చును. గ్రీ. os, లా. ipsus. అట్లె యైనచో 'సః' అను సంస్కృతరూపముగూడ ప్రాచీనమైనది గావచ్చును. లేనియెడల నిది శబ్దాంతరముల ననుసరించి నూతనముగా నేర్పడినదనియు, 'సో' అనురూపము గ్రీకు (outos), పారసీక (hauw) రూపములవలె సశబ్దమున కుశబ్దమేలనమువలన నేర్పడినదనియు జెప్పవలసియుండును. ఇది సప్తమీబహువచనప్రత్యయమున నగుపడు సు (su) శబ్దమే గావచ్చును.

ద్వితీయ—తశబ్దమునకు నామవాచకముల ద్వితీయైకవచనప్రత్యయము చేరినది. ఉ॥ సం. తమ్, అవె. tem, గ్రీ. ton, గాధి. thana, ప్రా. హై. జ. den. స్త్రీ పుంలింగ ద్వితీయైకవచన బహువచనములలో సర్వనామములకును, నామవాచకములకును ప్రత్యయభేదమెన్నడును లేదు.

తృతీయ—నయమనది సర్వనామశబ్దములకు విలక్షణమగుప్రత్యయమని భాషాంతరరూపములనుబట్టి తెలియుచున్నది. సం. తేన, ప్రా. పెర్షియన్. tyanā, అవె. kana, గ్రీ. ina. ఈప్రత్యయము కొన్నియవ్యయములలోగూడ నగుపడుచున్నది. ఉ. సం. చన, హీన, వినా; లా. pone, గాధి. than, లిథు. ten. నామవాచకములలో 'రామేణ' అను మొదలగు నకారాంతతృతీయైకవచనరూపములు సర్వనామముల రూపములననుసరించి వ్యవహారములోనికి వచ్చినవని చెప్పుచున్నారు. ప్రత్యయమునకు బూర్వము ప్రాతిపదికమికారము నొకదానిని గ్రహించి యేకారాంతమగుచున్నది. ఈ యికారవ్యుత్పత్తి సరిగా తెలియకున్నది. ఇట్టియికారము పుం నపుంసకశబ్దముల బహువచనరూపములలోను (తే, తేభ్యః, తేషామ్, తేషు, రామేభ్యః, రామేషు,) స్త్రీపుం నపుంసకలింగశబ్దముల ద్వివచనరూపములలోను (తే, తయోః; రమే, రమయోః; రామయోః; జ్ఞానే, జ్ఞానయోః) నగపడుచున్నది. ఈస్థలములలో ప్రథమలోని యికారఘటితరూపమే విభక్త్యంతరములకు వ్యాపించినదని తలంచినచో నేకవచనమునగూడ తృతీయలోని యికారఘటితరూపము ప్రథమనుండి సంప్రాప్తమైనదని తలంపవలసియుండును. ప్రథమైకవచనమున గూడ పూర్వ మికారఘటితరూపములు కలవనుటకు ప్రత్యేకభాషలలో నిదర్శనములు కలవు. ఉ. సం. అయమ్, లా. Joi, Hoi. ఈ విపరిణామము ప్రథమమున సర్వనామములలో ప్రారంభమై నామవాచకములకు వ్యాపించినది. కావుననే పుంలింగ నామవాచకముల ప్రథమావిభక్తిలో నికార మగపడకపోయినను విభక్త్యంతరములలో ద్వివచన బహువచనముల నగపడుచున్నది. వయమ్ అను శబ్దమునగూడ నిట్టి యికార మగపడుచున్నది.

చతుర్థి— ఈ విభక్తిప్రత్యయము నామవాచకములకును, సర్వనామములకును సమానముగా నున్నది. ప్రకృతిప్రత్యయముల మధ్యను స్మకారమగపడుచున్నది. ఇది ప్రాచీనమైనదని అవెస్తాగాథిక్ మొదలగు భాషాంతరముల రూపములు సూచించుచున్నవి. చూ. సం. తస్మై, అవె. Tahmai. స్మకారములేని రూపములుగూడ భాషాంతరములలో నగపడుచున్నవి. (చూ. గ్రీ. To లా. Isto.) స్మకారము ప్రథమమున సప్తమిలో ప్రారంభమైనదనియు నందుండి చతుర్థీపంచములకు వ్యాపించినదనియు నూహింపబడినది.

పంచమి— ఈ విభక్తి ప్రత్యయముగూడ నామవాచకములకును సర్వనామములకును సమానముగా నున్నది. చతుర్థివలెనే యిందుగూడ సప్తమి ననుసరించి స్మకారము ప్రవేశించినది. సం. తస్మాత్, అవె. Tahmath, గాధి. Thamma. స్మకారములేని రూపము లనేకభాషలలోగలవు. సం. తాత్ (అత్, యాత్) అవె. ath, గ్రీ. o Opt, లా. Isto, Guo, లిథు. To. ఇట్టి రూపములు స్మకారము చతుర్థీ పంచములకు వ్యాపింపని కాలపువనియు, నివి యవ్యయములుగా దలంపబడుటచే మార్పునుబొందక యున్నవేనియు నూహింపబడినది. పంచమ్యేకవచన రూపమగు తాత్ అనునదియే లోట్ ప్రత్యయముగా వ్యవహరింపబడినదని యూహింపబడినది. సం. భరతాత్, గ్రీ. phereto, లా. ferto

షష్ఠి—స్య, స అనునవి రెండును సర్వనామశబ్దముల ప్రత్యయములు. ప్రాచీనకాలముననే నామవాచ

కము లీరెండు ప్రత్యయములను గ్రహించినవి. సం. తస్య. అవె. tahe, గ్రీ. tois (స ప్రత్యయ యుక్తరూపములు: గాథి. this, ప్రా. హై. జ. des, ప్రా. ఇం. daes.) కొన్ని పాశ్చాత్యభాషలలో షష్ఠియం దేకవచన బహువచన ప్రత్యయములకు రూపసాంకర్యము సంభవించినది. దీని ననుసరించి స్యప్రత్యయమె బహువచనప్రత్యయము (సామ్) ననుసరించి సయనురూపమును బొందియుండునని యూహింపవచ్చును.

సప్తమి—ఈవిభక్తికి సర్వనామములలో ఇన్, ఇ అను రెండుప్రత్యయము లగపడుచున్నవి.(గ్రీ. Ammin, ammi) మొదటిది సర్వనామములకు విలక్షణమైనది. రెండవది సర్వనామ నామవాచక సాధారణము. సం. తస్మిన్, లిథు. Tamin; అవె...Tahmi, గ్రీ Timi. ప్రకృతి ప్రత్యయములకు మధ్యను స్మకార మగుపడుచున్నది. ఇది లేనిరూపములు గూడ భాషాంతరములలో గలవు. గ్రీ. Poi, లా. Heic, Hic, గాథి. Thei. సప్తమియం దే ప్రథమమున వికల్పముగా స్మకారయుక్త రూపములు వ్యవహారములోనికి వచ్చినవనియు, తరువాత కొంతకాలమునకు (ప్రత్యేక భాషలు జన్మించుటకు పూర్వమే) స్మకారము చతుర్థీ పంచమలకు వ్యాపించినదనియు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. స్మకారము స్మశబ్దభవమని చెప్పుచున్నారు. స్మయను నవ్యయమును విభక్తుల తుదను జేర్చు నలవాటు కలదు. ఉ. తస్యస్మ, అస్మ (న + అస్మ: చూ. అస్మచ్ఛబ్దము.) ఈ రీతిగా ప్రథమమున స్మయనునవ్యయము సప్తమికి జేర్చబడినది. 'తస్మ' అనురూపములో 'త' అనునది సప్తమిగా దలంచుటకు భాషాంతరరూపము లవకాశము నిచ్చుచున్నవి. మాతృభాషలో 'తస్మతస్మి' అనురెండు రూపములును వికల్పముగా నుండినవనియు, నందు రెండవదానికి నకారముచేరుటచే 'తస్మిన్' అను రూపమేర్పడినదనియు, నీ నకారము విభక్తికిబరమగు 'అన్' అను నవ్యయభాగమనియు భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు.

ద్వివచనము — ద్వివచనమున సర్వనామములకును నామవాచకములకును ప్రత్యయములు సమానములుగా నున్నవి. అకారాంత పుంలింగనామవాచకముల ద్వివచనమునకును బుంలింగ తచ్ఛబ్ద ద్వివచనమునకును భేదములేదు.

షష్ఠీసప్తములలో ప్రాతిపదిక మికారమును గ్రహించి 'తే' అను రూపమును బొందుచున్నది. ఇది స్త్రీనపుంసకలింగ ప్రథమాద్వితీయా ద్వివచనములనుండి సంక్రమించినదని చెప్పుచున్నారు. తృతీయా చతుర్థీ పంచమీ విభక్తులలో నిట్టిరూపమును ప్రాతిపదికము పొందక పుంలింగ ప్రథమాద్వితీయా రూపము ననుసరించి (వై. తా.) దీర్ఘాంతమైనదని చెప్పుచున్నారు.

బహువచనము—ప్రథమ—ప్రత్యయము(i ఇ) నామవాచకములకంటె భిన్నముగానున్నది. సం. తే, అవె. Te, గ్రీ. Toi, లా. Iste, గాథి. Thai, లిథు. Te. ఈప్రథమారూపమే చతుర్థ్యాదివిభక్తులజూచి ప్రాతిపదికస్థానము నాక్రమించినది (చూ. తేభ్యః, తేషామ్, తేషు.) గ్రీక్ లాటిన్ జర్మానిక్ మొదలగు కొన్నిభాషలలో నీ సర్వనామప్రత్యయము నామవాచకములకు వ్యాపించినవి. మఱికొన్ని భాషలలో నామవాచకముల ప్రత్యయము (అస్) సర్వనామములకు వ్యాపించినది.

ద్వితీయ—సర్వనామముల ప్రత్యయమునకును నామవాచకముల ప్రత్యయమునకును భేదములేదు. నామవాచకముల ననుసరించి ప్రాతిపదికాన్తము దీర్ఘమై యుండవలయును.

తృతీయ—ప్రత్యయములు (భిస్, ఐస్, మిస్) సర్వనామములకును నామవాచకములకును సమానముగానే యున్నవి. సం. తైః, అవె. tais, గ్రీ. tois, లా. his, లిథు. taiss, సం. ఏభిః. వై. తేభిః, అవె. aecbhis, గాథి thaim, ప్రా. హై. జ. dem. పూర్వము భిస్, మిస్ ప్రత్యయములు పరమగునప్పుడు ప్రాతిపదికాన్తయకారము (o, ఏకారములోనికి (o-i) సర్వనామములలో మాఱుచుండెను గాని నామవాచకములలో మాఱుటలేదు. సర్వనామముల ననుసరింప నామవాచకములలో దరువాత మార్పుసంభవించినది.

చతుర్థీ పంచములు—సర్వనామములకును, నామవాచకములకును ప్రత్యయములు సమానముగానె యున్నవి. ప్రత్యయము పరమగునప్పుడు సర్వనామములలోనే ప్రాతిపదికాన్త మేకారములోనికి (o-i) మారుచుండెను. కాని నామవాచకములలో మారుటలేదు. అనగా సర్వనామములలో ప్రథమావిభక్తిరూపమే (తే) చతుర్థ్యాదివిభక్తులందు ప్రవేశించినదని ఫలితార్థము. సం. తేభ్యః, అవె. taeibyo, లా. hebus(=ఏభ్యః), లిథు. tems. సర్వనామ శబ్దముల ననుసరించి నామవాచకములలో గూడ నిట్టి మార్పు సంభవించినది.

షష్ఠి—సర్వనామశబ్దములకు సామ్ (som)అనునది ప్రత్యయము. ప్రత్యయము పరమగునప్పుడు ప్రాతిపదికాన్తయకారము (o) ఏకారములోనికి (o-i) మారుచుండును. అనగా ప్రాతిపదికస్థానమున ప్రథమాబహువచనరూపము ప్రవేశించినదని యర్థము. సం. తేషామ్, అవె.-taesam. గ్రీకులాటిన్ అవెస్తా మొదలగు కొన్ని భాషలలో నామవాచకముల ప్రత్యయము (ఆమ్) సర్వనామములకు వ్యాపించినది. చూ. అవె. kam, గ్రీ. ton, లా. eun.

సప్తమి—ప్రత్యయము (సు) సర్వనామములకును నామవాచకములకును సమానముగానున్నది. ప్రత్యయము పరమగునప్పుడు ప్రాతిపదికాన్తయకార మేకారమగుచుండెను. ప్రథమాబహువచనరూపము సర్వనామములలోనే యేకారాన్తముగా నుండుటచే జతుర్థ్యాది విభక్తులలో ప్రాతిపదికాన్త యకార మేకారమగుట సర్వనామములకే సహజమనియు, వీనినుండి నామవాచకములకు వ్యాపించినదనియు నూహింపబడినది. సం. తేషు.

౨. స్త్రీలింగము.

ఏకవచనము—ప్రథమ--నామవాచకములకువలె ప్రత్యయము లేదు. సం. సా, గ్రీ. e, లా. sa, గాథి. sō.

ద్వితీయ — సర్వనామములకును, నామవాచకములకును భేదములేదు. సం. తామ్.

తృతీయ—'అయా' అనునది సర్వనామములకు విలక్షణమగు ప్రత్యయమని భాషాంతరరూపములనుబట్టి తెలియుచున్నది. సం. తయా, అవె. taya, ప్రా. స్లె. tojam, ప్రా. లిథు. taja. 'తయా' అను రూపములోని యేకారాన్త ప్రాతిపదికము (తే-అ) ప్రథమనుండి గ్రహింపబడినదని చెప్పుచున్నారు. (అవె. thwoi, లా. quad.) చూ. పుంలింగము. నామవాచకములలోని 'రమయా' అనునట్టి రూపములు సర్వనామములరూపము ననుసరించి వ్యవహారములోనికి వచ్చినవని చెప్పుచున్నారు.

చతుర్థి—సర్వనామములకును నామవాచకములకును ప్రత్యయము సమానముగా నున్నది. స్యాగమము షష్ఠీవిభక్తినుండి చతుర్థీ సప్తములకు వ్యాపించినదని చెప్పుచున్నారు. 'తస్యాః' అను రూపము ననుసరించి 'తస్యై' అనునది వ్యవహారములోనికి వచ్చినది. చూ. షష్ఠి.

పంచమి—ప్రప్రథమమునుండియు బంచమీషష్ఠీ విభక్తులకు రూపము సమానముగా నుండెను. ప్రత్యయముగూడ సర్వనామములకును నామవాచకములకును సమానముగానే యుండెను.

షష్ఠి— 'తస్యాః' అను స్త్రీ లింగరూపము 'తస్య' అను పుంలింగరూపము నాధారముగా జేసికొని యుత్పన్నమైనదని భాషాశాస్త్రజ్ఞుల యాశయము. ప్రథమమున నీ విభక్తిలో నాకారాన్తశబ్దములవలె 'తాః' అను రూప ముండియుండవచ్చుననియు, నది 'తస్య' అను పుంలింగరూపమునకు సమానముగా నుండుటన్లు తస్యాః అనురూపములోనికి మారియుండవచ్చుననియు, లేదా తస్య యను రూపమే ప్రథమమున నన్నిలింగములలోను వ్యవహరింపబడుచుండి యుండవచ్చుననియు, కాలక్రమమున నందుండి 'తస్యాః' అను స్త్రీలింగ రూప మేర్పడియుండవచ్చుననియు భాషాశాస్త్రజ్ఞులూహించియున్నారు. 'తస్యాః' అనురూపము వ్యవహారమున స్థిరపడిన తరువాతను దాని ననుసరించి చతుర్థీ సప్తములలో స్యకారము ప్రవేశించినది. తస్యాః, తస్యై, తస్యామ్.

సప్తమి — ప్రత్యయము సర్వనామములకును నామవాచకములకును సమానముగానే యున్నది. చతుర్థీ సప్తమీ రూపములు నామవాచకములవలెనే యుండ వలయును. కాని షష్ఠి ననుసరించి చతుర్థీసప్తములలో స్యకారము ప్రవేశించినది. తదనంతర మాకారాన్తసప్తమీ రూపమువలెనే తస్యామ్ అనున దేర్పడినదనుచున్నారు. (తస్యై-ఆ-అమ్)

ద్వివచనము — ద్వివచనమున సర్వనామములకును' నామ వాచకములకును ప్రత్యయములు సమానముగా నున్నవి. ఆకారాన్త స్త్రీలింగ శబ్దముల రూపములకును స్త్రీలింగ తచ్ఛబ్ద రూపములకును భేదము లేదు.

తృతీయా-చతుర్థీ పంచములలో ప్రాతిపదిక మాకారాన్తముగానే యున్నది. షష్ఠీసప్తములలో మాత్ర మది యేకారాన్తముగ నున్నది. ఇది ప్రథమాద్వితీయా విభక్తులనుండి వచ్చినదని చెప్పుచున్నారు.

బహువచనము — ప్రథమ — ప్రత్యయము సర్వ నామములకును నామవాచకములకును సమానముగా నున్నది. సం. తాః, అవె. ta, గాథి. thos, లిథు. tos.

ద్వితీయ — సర్వనామములకును నామవాచక ములకును భేదము లేదు. సం. తాః.

తృతీయ — సర్వనామములకును నామవాచకము లకును రూపములు సమానములుగా నున్నవి. సం. తాభిః, అవె. abis, లిథు. tomis.

చతుర్థీపంచములు — సర్వనామములకును నామ వాచకములకును రూపములు సమానములుగా నున్నవి. సం. తాభ్యః, అవె. avabrjo, లా. eabyus, లిథు. toms.

షష్ఠి — సర్వనామశబ్దములకు 'సామ్' (som. అనునది ప్రత్యయము. (చూ. పుంలింగము) సం. తాసామ్, అవె. anham. కొన్నిభాషలలో నీప్రత్య యము నామవాచకములకు వ్యాపించినది.

సప్తమి — సర్వనామములకును నామవాచకముల కును రూపము సమానముగా నున్నది. సం. తాసు.

3. నపుంసకలింగము — ప్రథమా ద్వితీయా విభక్తులు.

ఏకవచనము — సర్వనామశబ్దములకు దకార (d) ప్రత్యయము - సం. తత్, అవె. ahtt, లా. -tud, గాథి. that. కొన్ని సర్వనామములకు నామవాచక ముల ప్రత్యయము (m) సంక్రమించినది. సం. కిమ్, పాళీ. తమ్, అవె. kem, yim, లా. ipsum.

ద్వివచనము — ద్వివచనమున సర్వనామములకును నామవాచకములకును ప్రత్యయము (i) సమానముగా నున్నది. అకారాన్త నపుంసకలింగశబ్దముల ద్వివచనమున కును నపుంసకలింగ తచ్ఛబ్దద్వివచనమునకును భేదము లేదు. సం. తే.

బహువచనము — నామవాచకములవలె నాకా రమే (a) కాక యేకారము (-ai) గూడ ప్రత్యయముగా నుండెను. రెండవ దార్యశాఖాభాషలలో గనబడుట లేదు. వై. తా. అవె. ta, గ్రీ. ta, గాథి. tho, ప్రా. స్లై. ta. తాని యనురూపము (నామవాచకము వలె) నకారాన్త నపుంసకలింగశబ్దముల ననుసరించి వ్యవహారములోనికి వచ్చినది.

తా నామా-తా నామాని- తాని నామాని.

7. తచ్ఛబ్దముతో సంబంధించిన రెండుశబ్దాన్త రములుకలవు. తచ్ఛబ్దముతో యచ్ఛబ్దమును జేరి త్యచ్ఛబ్ద మేర్పడినది. ఇదమ్‌శబ్దరూపాన్తరమగు నేశబ్దముతో (చూ. పేరా 9) దచ్ఛబ్దముజేరి యేతచ్ఛబ్ద మేర్పడినది. ఏతచ్ఛ బ్దములోని యేకార మిదంశబ్దముయొక్క రూపాన్తరమగు నశబ్దముయొక్క సప్తమ్యేక వచనరూపకమైనను గావ చ్చును. ఈ రెండుశబ్దములును నన్నివిభక్తులలోను దచ్ఛ బ్దమును బోలియున్నవి. వీనిలోగూడ దచ్ఛబ్దము స్త్రీ పుంలింగప్రథమైకవచనమున 'సా, సః' అనురూపము లను బొందును.

ఏనయను మఱియొక సర్వనామశబ్దము కలదు. ఇది భాషాన్తరములలోని ఏకార్థకశబ్దమున (లా. unus, గాథి. ains) కభిన్నముగా నున్నది. ఇందలి ఏ కారముగూడ నశబ్దముయొక్క సప్తమ్యేకవచనమని

చెప్పబడుచున్నది. దీనికి ద్వితీయైకవచన ద్వివచనబహువచనములయందును, తృతీయైకవచనమునందును షష్ఠీ సప్తమీ ద్వివచనములందును మాత్రము ప్రయోగము కలదు. ఇదిగూడ దచ్ఛబ్దమును బోలియున్నది.

ఏతచ్ఛబ్దము సమాసమునను ప్రత్యయముపరమగు నప్పుడును 'ఏత' అను రూపమునను 'ఏతత్' అను రూపమునను నగపడుచున్నది. ఉ. ఏతాదృశ్, ఏతావన్త్, ఏతద్వా, ఏతదర్థ, ఏతన్మయ, త్వ, ఏనశబ్దములు సమాసములలోగాని ప్రత్యయ విశిష్టముగాగాని యగపడుట లేదు.

8. పైశబ్దములకు వేదమున నీక్రింది విశేషరూపము లగపడుచున్నవి.

(i) పుంలింగము—ద్వివచనము-ప్ర. ద్వి. త్యా.
బహువచనము-తృ- త్యేభిః

స్త్రీలింగము—ఏకవచనము-తృ—త్యా.

నపుంసకలింగము—బహువచనము-ప్ర. ద్వి. త్యా.

(ii) పుంలింగము—ద్వివచనము - ప్ర. ద్వి. ఏతా.
బహువచనము-తృ. ఏతేభిః

నపుంసకలింగము -బహువచనము-ప్ర. ద్వి. ఏతా.

(iii) పుం. స్త్రీ. న. ద్వివచనము-ష. స. ఏనోః.

'త్యాయా' అను రూపమున రెండు యకారములు వరుసగావచ్చుటచే నొకటి లోపించి 'త్యా' అను రూపమేర్పడియుండవచ్చును. (చూ. యోః, పేరా ౧౭). అట్లు కాకపోయినచో త్యా యను రూపము నామవాచకముల రూపము ననుసరించి వ్యవహారములోనికి వచ్చియుండవలయును.

'ఏనయోః'అను రూపమేకాక 'ఏనోః' అను రూపముగూడ ప్రాచీనమైనదానివలె నగపడుచున్నది. ఇట్టిరూపము భాషాన్తరములలోగూడ నగపడుచున్నది.

## ఇదంశబ్దము

9. ఈ శబ్దమునకు ఇదమ్ అనునది ప్రాతిపదిక యని మన వైయాకరణులు చెప్పుచున్నారు. కాని యిది యొక విభక్తియందును (ప్ర. ద్వి. న. పుం.) కొన్ని సమాసములలోను మాత్ర మగపడుచున్నది. ఉ. ఇదమ్మయ, ఇదంరూప మొ. కొన్ని విభక్తులలో నగపడు 'అన' అను ప్రాతిపదికము సమాసములలో గాని ప్రత్యయాన్తర యుక్తముగా గాని యగపడుటలేదు. అకారేకారరూప ప్రాతిపదికములనుండిపుట్టిన శబ్దములు విశేషముగా గలవు. ఉ. అతః, అత్ర, అథ, ఇతః, ఇదా, ఇహ, ఇతర, ఈదృశ మొ.

ఈ శబ్దమున కన్నివిభక్తులలోను ననుగతమగు ప్రాతిపదిక మగపడుట లేదు. మూడు విభిన్నప్రాతి పదికము లగపడుచున్నవి. ఈ భేద మవెస్తాభాషలోగూడ నగపడుచున్నది.

౧. ఏ (ei) లేక దీని దుర్బలరూపము ఇ (i) ఇది ప్రథమా ద్వితీయా విభక్తులలో నగపడుచున్నది.

౨. అన (ono-, eno-) ఇది తృతీయైక వచనమునను షష్ఠీ సప్తమీ ద్వివచనమునను నగపడుచున్నది.

3. అ. (o-,ఇ-)-ఇది మిగిలిన విభక్తులలో నగపడుచున్నది. ఏతచ్ఛబ్దములోని యేకారము దీని సప్తమీ విభక్తిరూపముగా దలంపబడుచున్నది.

పైవానిలో 'అన, అ' అను ప్రాతిపదికములకు గూర్పబడినవిభక్తులు తచ్ఛబ్దవిభక్తులకు సమానముగా నున్నవి. ఏశబ్దఘటిత విభక్తులలోనే విశేషములు గలవు.

10. ఇదంశబ్దమునకు వేదమునందలి రూపవిశేషము లీ క్రిందను జూపబడినవి.

౧. పుంలింగము—ఏకవచనము-తృ. ఏనా.
ద్వివచనము-ప్ర. ద్వి. ఇమా.

౨. నపుంసకలింగము—బహువచనము-ప్ర. ద్వి. ఇమా.

విభక్తులలో ప్రాతిపదిక వినిమయము గూడ గలదు.

౧. పుంలింగము—ఏకవచనము-చ. ఇమస్మై.
ష. ఇమస్య.
ద్వివచనము-ష. స. అయోః
బహువచనము-తృ. ఇమైః
స. ఇమేషు

౨. స్త్రీలింగము—ఏకవచనము-త్యా. అయా.

11. ఇకను సంస్కృతవిభక్తి రూపముల చరిత్రము విచారింపవలసియున్నది.

౧. పుంలింగము

ఏకవచనము—ప్రథమ-ఏ (ei) అను ప్రాతిపదికమునకు అమ్ (em) శబ్దముచేరి 'అయమ్' అను రూపమేర్పడినది. సం. అయమ్, అవె. ayem.

ద్వితీయ—ఇ (i) యను ప్రాతిపదికమునకు ద్వితీయా విభక్తి ప్రత్యయము (m) చేరి 'ఇమ్' అను పదమేర్పడినది. దానికి 'అమ్' (em) అనుశబ్దము చేరి 'ఇమమ్' అనుపద మేర్పడినది. (అవె. imem) తమ్, ఏతమ్ అనురూపముల సామ్యము ననుసరించి ఇమమ్ అనురూపమున 'ఇమ' అనునది ప్రాతిపదికముగా గ్రహింపబడి దానినుండి ప్రథమా ద్వితీయారూపములు మూడు లింగములలోను గల్పింపబడినవి. ఉ. ఇమౌ, ఇమే, ఇమాన్; ఇమామ్, ఇమే, ఇమాః; ఇమాని. ఇట్టిరూపములే యవెస్తాభాషలోఁగూడ గలవు. వేదమున తృతీయాది విభక్తులలోఁగూడ నిట్టిరూపము లగపడుచున్నవి. ఉ. ఇమస్మై, ఇమస్య, ఇమైః, ఇమేషు. ప్రాచీన పారసీకభాషలో నపుంసక లింగమున ima (-imad) అను రూపము కలదు.

తృతీయ—అన యను ప్రాతిపదికమునకు సర్వనామముల తృతీయావిభక్తి ప్రత్యయమును గూర్చుటచే 'అనేన' అను రూప మేర్పడినది. ప్రాతిపదికాన్త మేకారములోనికి మాఱినది. (చూ. పుంలింగతచ్ఛబ్దము.) 'ఏనా' అను వైదికరూపము 'ఏ' అను ప్రాతిపదికము నుండికాని 'అ' అను ప్రాతిపదికమునుండికాని వచ్చియుండవచ్చును. అన్త్యాకారము నామవాచకముల తృతీయా విభక్తి ననుసరించి దీర్ఘముగా జేయబడి యుండవచ్చును. చూ. మరుతా, ఆత్మనా, వై. రామేణ.

చతుర్థ్యాది విభక్తులు—ఇందలి రూపములు 'అ' అను ప్రాతిపదికనుండి యుద్భవించినవి. విభక్తిప్రత్యయాదులనుసరించి పుంలింగ తచ్ఛబ్ద విభక్తులు చూడనగును.

ద్వివచనము—ప్రథమాద్వితీయలు: ఇమయను ప్రాతిపదికనుండి యుద్భవించినవి. చూ. ద్వితీయైకవచనము. ప్రత్యయము నామవాచకములకును సర్వనామములకును సమానము. చూ. పుంలింగతచ్ఛబ్దము.

తృతీయాచతుర్థీ పంచములు—'అ' అను ప్రాతిపదికమునుండి యుత్పన్నమైనవి. అకారము నామవాచకములందువలె ప్రథమావిభక్తి ననుసరించి దీర్ఘమైయుండవలయును. ప్రత్యయములు నామవాచకములకును సర్వనామములకును సమానములు. చూ. పుంలింగతచ్ఛబ్దము.

షష్ఠీసప్తములు—అనయను ప్రాతిపదికమునుండి జనించినవి. ప్రాతిపదికాన్తాకార మేకారములోనికి మాఱినది. చూ. తయోః. ఇది సర్వనామములకు విలక్షణము. ఇందుండి నామవాచకములకు వ్యాపించినది. ప్రత్యయము నామవాచకములకును సర్వనామములకును సమానము. అయోః అను వైదికరూపము 'అ' అను ప్రాతిపదికమునుండి యుద్భవించినది.

బహువచనము—ప్రథమ: ఇమ యను ప్రాతిపదికమునకు సర్వనామములకు విలక్షణమగు ప్రత్యయము (i) చేరి 'ఇమే' అనురూప మేర్పడినది. ఇమ శబ్దమును గుఱించి ద్వితీయైకవచనము చూడనగును.

ద్వితీయ—ఇమ యను ప్రాతిపదికముమీఁద నేర్పడినది. ఇమ శబ్దమును గుఱించి ద్వితీయైకవచనము చూడనగును. ప్రత్యయము నామవాచకములకును సర్వనామములకును సమానము.

తృతీయాదివిభక్తులు — అకారరూప ప్రాతిపదికముమీఁద నీవిభక్తు లేర్పడినవి. అకారమున కికారము చేరి యేకార మేర్పడినది. (చూ. పుంలింగ తచ్ఛబ్దతృతీయైకవచనము. 'ఇమైః' అను వైదికరూపము 'ఇమ' అను ప్రాతిపదికమునుండి వచ్చిన యకారాన్తశబ్దముల వంటి రూపము (చూ. ద్వితీయైకవచనము) 'ఏషాం' అను రూపమున సర్వనామముల షష్ఠీబహువచనప్రత్యయమగపడుచున్నది. (చూ. పుంలింగ తచ్ఛబ్ద షష్ఠీ బహువచనము.)

౨. స్త్రీలింగము.

ఏకవచనము—ప్రథమ: ఈ శబ్ద మిశబ్దమునకు స్త్రీలింగరూపము. దీని కియా దేశమువచ్చి 'అమి'

# జాతీయ మహాసభాధ్యక్షులు

## 1885 — 1934

డబ్లియు. సి. బెనర్జీ
బొంబాయి : 1885—అలహాబాదు : 1892

దాదాభాయి నౌరోజీ
కలకత్తా : 1886, 1906—లాహోరు : 1893

బద్రుద్దీన్ తయ్యాబ్జీ
మద్రాసు : 1887

జార్జి యూల్
అలహాబాదు : 1888



సర్ విలియం వెడ్డర్ బరన్
బొంబాయి : 1889—అలహాబాదు : 1910



సర్ పి. మెహతా
కలకత్తా : 1890



పి. ఆనందాచార్యులు
నాగపూరు : 1891



ఆల్ఫ్రెడ్ వెబ్
మద్రాసు : 1894

శబ్దముచేరి 'ఇయమ్' అనురూప మేర్పడినది. చూ. అవె. iyem.

ద్వితీయ—ఇమా యను స్త్రీలింగ ప్రాతిపదికమునకు ద్వితీయావిభక్తి ప్రత్యయము చేరినది. ప్రత్యయము నామవాచకప్రత్యయమునకు సమానము. చూ. పుంలింగద్వితీయావిభక్తి. అవె. imam.

తృతీయ—అనా అను స్త్రీలింగ ప్రాతిపదికమునకు సర్వనామములకు విలక్షణమగు తృతీయావిభక్తి ప్రత్యయముచేరి 'అనయా' అను రూప మేర్పడినది. చూ. స్త్రీలింగతచ్ఛబ్దతృతీయైకవచనము. 'అయా' అను వైదికరూప మ శబ్దమునీద బుట్టినది.

చతుర్థ్యాదివిభక్తులు— ప్రత్యయములు సర్వనామములకును, నామవాచకములకును సమానములు. స్యాగమమును గుఱించి స్త్రీలింగ తచ్ఛబ్దము చూడ నగును.

ద్వివచనము—ప్రథమాద్వితీయలు- 'ఇమా' అను స్త్రీలింగ ప్రాతిపదికము. ప్రత్యయములు సర్వనామములకును, నామవాచకములకును సమానములు.

తృతీయా చతుర్థీ పంచములు— 'ఆ' అనునది ప్రాతిపదికము. ప్రత్యయములు సర్వనామములకును, నామవాచకములకును సమానములు.

షష్ఠీసప్తములు—అనాయనునది ప్రాతిపదికము. ప్రత్యయములు నామవాచకములవానితో సమానములు.

బహువచనము—ప్రథమాద్వితీయలు: ఇమా యనునది ప్రాతిపదికము. ప్రత్యయములు నామవాచక ప్రత్యయములకు సమానములు.

తృతీయాదివిభక్తులు—ఆ యనునది ప్రాతిపదికము. షష్ఠిలో సర్వనామములకు విలక్షణమగు'సామ్' అను ప్రత్యయ మగపడు. మిగిలిన విభక్తులలో ప్రత్యయములు నామవాచకములవానితో సమానములు.

3. నపుంసకలింగము—ప్రథమా ద్వితీయలు.

ఏకవచనము—సర్వనామములకు విలక్షణమగు ద్ (d) అను ప్రత్యయ మి శబ్దమునకు జేరి 'ఇద్' అను రూప మేర్పడినది. దీనికి 'అమ్' (em) అను శబ్దముచేరి 'ఇదమ్' అను రూప మేర్పడినది. క్రమముగా నిదియే యీ శబ్దమునకు ప్రాతిపదికగా వ్యవహరింపబడ నారంభించినది.

ద్వివచనము—'ఇమ' అనునది ప్రాతిపదికము. ప్రత్యయములు నామవాచకములవానితో సమానమే. సం. ఇమే.

బహువచనము—'ఇమ'అనునది ప్రాతిపదికము. 'ఆ' అనునది ప్రత్యయము. ఉ. ఇమా. నకారాన్త నపుంసకలింగశబ్దముల ననుసరించి 'ఇమాని' అనురూపము వ్యవహారములోనికి వచ్చినది. చూ. నపుంసకలింగతచ్ఛబ్దము - క్రమముగా 'ఇమా' అనురూపము వ్యవహారమునుండి తొలగినది.

## అదశ్శబ్దము

12. ఈ శబ్దమునకు అదస్ అనునది ప్రాతిపదికయని వైయాకరణుల యభిప్రాయము. కాని యిది యతిస్వల్పసంఖ్యాకము లగు పదములలో నగపడుచున్నది. ఉ. అదోమూల, అదోమయ. అనేకపదములలో 'అము' అను ప్రాతిపదిక యగపడుచున్నది. ఉ. అముతః, అముత్ర, అముథా, అముధా, అముర్హి, అమువత్, అముక అదశ్శబ్దము ననేకవిభక్తులలో గూడ నిది యగపడుచున్నది. ఈశబ్దమువిభక్తులలో అసౌ, అదః, అము, అమూ, 'అమీ' అను ప్రాతిపదికము లగపడుచున్నవి.

'అసౌ' అనురూపము అ, సా, ఉ అను మూడు భాగములుగా విభాగముచేయదగియున్నది. మొదటి దిదమ్ శబ్దవిభక్తులలో నగపడునశబ్దమున కభిన్నము కావచ్చును. 'సా' అనునది తచ్ఛబ్ద స్త్రీలింగరూపమనియు, 'ఉ' అనునది యవ్యయమనియు నూహింపబడినది. (ఈ యుకారమే సప్తమీబహువచన ప్రత్యయమున su యగుచున్నది.) స్త్రీలింగరూపము పుంలింగమునగూడ వ్యవహరింపబడినట్లు తోచుచున్నది. దీనికి విపరీతముగా బారసీకభాషలో బుంలింగరూపము స్త్రీలింగమున వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. వేదమున 'సా' అను

నది పుంలింగమునగూడ వ్యవహరింపబడి యుండుటచే 'అసౌ' అనునది పుంలింగరూపము గూడ గావచ్చును.

అదః అనురూపము అ, ద్, అస్ అని మూడు భాగములక్రింద విభాగము చేయదగియున్నది. అద్ అనునది (ఇద్ అనురూపమువలెనే) నపుంసకలింగ సర్వనామప్రత్యయముతో గూడిన అశబ్దము కావచ్చును. దీనికి అస్ చేరినది. వేదమున అమః (వాడు) అను నిట్టి సర్వనామము మఱియొకటి కలదు.

'అము' అను ప్రాతిపదిక యీక్రిందివిధముగా నేర్పడిన ట్లూహింపబడినది. అ అను సర్వనామ శబ్దమునకు ద్వితీయావిభక్తి ప్రత్యయమగు మ్ (m) అనునది చేరి, అమ్ అను రూప మేర్పడినది. దీనికి ఉ అనుపదము చేరి 'అము' అను రూప మేర్పడినది. తము, ఇదముఅను మొదలగు నిట్టి ప్రయోగములు వేదమున గలవు. క్రమముగా అము అనునది ప్రాతిపదికముగా దలంపబడి దాని మీదను విభక్త్యంతరములు నిల్పబడినవి. (చూ. ఇదమ్.)

రూపాన్తర సామ్యముకొఱకు ఉకారము దీర్ఘమై పైశబ్దమే 'అమూ' అను రూపమును పొందినది.

'అమీ' అను రూప మె ట్లుత్పన్నమైనదో తెలియకున్నది.

13. వేదమున నీ శబ్దమునకు రూపాంతరములు విశేషముగా లేవు. నపుంసకలింగప్రథమాద్వితీయా బహువచనమున 'అమూ' అను రూపము మాత్ర మగపడుచున్నది.

14. అదశ్శబ్దము విభక్తులు చాలవఱకు శబ్దాన్తరరూపముల ననుసరించి కల్పింపబడిన ట్లగపడుచున్నవి.

౧. పుంలింగము.

ఏకవచనము—ప్రథమ: 'అసౌ' అను రూపము నుత్పత్తిని గుఱించి పై ౧౨ వ పేరాలో వ్రాయబడినది.

ద్వితీయాది విభక్తులు—'అము'అనుదానిని ప్రాతిపదికముగా గ్రహించి దానికి సర్వనామాన్తరములరీతిని ద్వితీయాది విభక్తులు చేర్చబడినవి. తృతీయావిభక్తిలో 'అమునా' అనురూపము మాత్ర ముకారాన్తనామవాచకముల తృతీయవలె నకారాన్తశబ్దముల ననుసరించి ఉత్పన్నమై యుండవలెను.

ద్వివచనము—ప్రథమా ద్వితీయా విభక్తులలో ద్వివచనమగుటచే అము అను ప్రాతిపదికము నన్త్యాచ్చు (నామవాచకములందువలె) దీర్ఘమైనది. తృతీయా చతుర్థీ పంచములలో సర్వనామాన్తరముల ననుసరించి 'అమూభ్యామ్' అనురూప మేర్పడినది. షష్ఠీసప్తములలో 'అముయోః' అను రూప మితర సర్వనామశబ్దముల రూపము ననుసరించి వచ్చినది.

బహువచనము—ప్రథమ: అమీ యనురూప మెట్లేర్పడినదో యూహించుట కవకాశము గాకున్నది. చూ. పేరా ౧౨. మిగిలిన సర్వనామశబ్దముల ననుసరించి యీరూపము తృతీయాది విభక్తులను ప్రవేశించినది.

ద్వితీయ—'అము' అను ప్రాతిపదికనుండి సర్వనామాన్తరముల ననుసరించి 'అమూన్' అనురూప మేర్పడినది.

తృతీయాది విభక్తులు—ప్రథమా బహువచన రూపము ప్రాతిపదికస్థానము నాక్రమించినది. దానిపైని సర్వనామాన్తరములరీతిని విభక్తు లేర్పడినవి.

౨. స్త్రీలింగము.

ఏకవచనము — ప్రథమ: పుంలింగ రూపము చూచునది.

ద్వితీయ—'అమూ' అను స్త్రీలింగ ప్రాతిపదికకు ద్వితీయావిభక్తి ప్రత్యయముచేరి 'అమూమ్' అను రూప మేర్పడినది.

తృతీయాదివిభక్తులు—'అమూః' అను ప్రాతిపదికమునుండియే సర్వనామాన్తరముల రూపముల ననుసరించి యీ విభక్తు లేర్పడినవి.

ద్వివచనము—పుంలింగరూపము చూడనగును.

బహువచనము—ఇమాః అను రూపము ననుసరించి ప్రథమా ద్వితీయలలో 'అమూః' అను రూప మేర్పడినది. సర్వనామాన్తరముల తీరున దీనినుండి తృతీయాది విభక్తు లేర్పడినవి.

3. నపుంసక లింగము—ప్రథమాద్వితీయలు.

ఏకవచనము—అదః అను రూపమును గుఱించి వెనుక ౧౩ వ పేరాలో వ్రాయబడినది.

ద్వివచనము—పుంలింగరూపము చూడనగును.

బహువచనము—'అము' అను ప్రాతిపదికనుండి మిగిలిన సర్వనామముల రీతిని 'అమూని' అను రూప మేర్పడినది.

15. వేదమున మఱికొన్ని సర్వనామము లగుపడుచున్నవి. ఇవి విరళముగా ప్రయోగింపబడి యున్నవి.

౧. అవ యను సర్వనామము ఋగ్వేదమున గలదు. ఇది షష్ఠీద్వివచనమున మాత్రము ప్రయోగింపబడి యున్నది. ఉ. అవోః. దీనితో సమానమగుశబ్దము పారసీకభాషలోను, స్లావోనిక్ - ఆర్మీనియన్ భాషలలోను నగుపడుచున్నది. ఉ. అవె. avē, avā (ప. బ.) ప్రా. పెర్షి. avaiy, avā. ప్రా. స్లా. ovu, ఆర్మీనియన్ ava.

౨. అమయను మఱియొక సర్వనామ మథర్వవేదమునను, బ్రాహ్మణములలోను నగుపడుచున్నది. ఇది పైశబ్దమునకు రూపాన్తరము గావచ్చును.

3. త్వ యను సర్వనామము ఋగ్వేదమున తఱచుగాను, యజుర్వేదాథర్వవేదములలో చెరి యొకపర్యాయమును ప్రయుక్తమై యగుపడుచున్నది. దీని నపుంసక లింగరూపము (త్వద్) బ్రాహ్మణములలో నగుపడుచున్నది. ఈ సర్వనామము తఱచుగా రెట్టించి ప్రయోగింపబడియుండును. దీని క్రిందిరూపములు ప్రయుక్తములై యున్నవి. త్వః, త్వా, త్వన్ ; త్వమ్, త్వేన, త్వస్మై, త్వస్యై; త్వే.

౪. ఋగ్వేదమున సమ. (గ్రీ. samo, గాథి. suma), సిమ యను మఱిరెండు సర్వనామము లగుపడుచున్నవి. వీనికి క్రిందిరూపము లగుపడుచున్నవి. సమమ్, సమస్మై, సమస్మాద్, సమస్య, సమస్మిన్, సమే; సిమః, సిమస్మై, సిమస్మాద్; సిమే.

## యచ్ఛబ్దము

16. ఈశబ్దమునకు 'యత్' అనునది ప్రాతిపదికయని వైయాకరణులు చెప్పుచున్నారు. సమాసమున నీరూపము వేదకాలమునుండియు నగపడుచున్నది. ఉ. యత్కామ, యత్కారిన్, యద్దేవత్య. 'య' అను ప్రాతిపదికమునుండి అనేకశబ్దము లుత్పన్నములై యున్నవి. ఉ. యతః, యతి, యత్ర, యథా, యదా, యది, యర్హి, యావన్త్, యతర, యతమ, యాదృశ మొ. ఇదియే యీశబ్దమునకు నిజమైన ప్రాతిపదికయని పాశ్చాత్యుల యభిప్రాయము. ఇది భాషాన్తరములలో గూడ నిట్లే యగుపడుచున్నది. ఉ. సం. యః, యన్, యా ; అవె. yō yath, yā, గ్రీ. cs, o, ē o, ఈ శబ్దమే త్యచ్ఛబ్దమున జేరియున్నదని యిదివఱకే చెప్పబడినది. చూ. పేరా ౭.

యచ్ఛబ్దము మూడులింగములలోను దచ్ఛబ్దము వలెనే యున్నది.

౧౭. వేదమునందలి విశేషరూపము లీక్రిందను జూపబడినవి.

పుంలింగము—ఏకవచనము—తృ. యేనా
ద్వివచనము—ప్ర. ద్వి. యా
ష. స. యోః
బహువచనము— తృ. యేభిః

నపుంసకలింగము, బహువచనము ప్ర. ద్వి. యా

'యయోః' అనురూపమున రెండు యకారములు వరుసగా వచ్చుటచే నొకటిలోపించి 'యోః' అనురూప మేర్పడియుండవచ్చును. లేనియెడల 'ఏనోః (ఏనయోః), అవోః' (అవయోః) అను రూపములవలె నిదిగూడ ప్రాచీనరూపము గావలయును.

## కింశబ్దము

17. ఈ శబ్దమునకు 'కిం' అనునది ప్రాతిపదికయని వైయాకరణులు చెప్పుచున్నారు. వేదకాలము నుండియు నేతద్రూప ఘటితశబ్దము లగపడుచున్నవి. ఉ. కిమ్మయ, కింకర, కింకామ్య, కిందేవతా, కింశీల.

సర్వనామాన్తరములవలె సమాసమున 'కదన్' అనురూపముతోఁగూడ నీ శబ్ద మగపడుచున్నది. ఉ. కదర్థ 'క, కి, కు' అను శబ్దములతోఁగూడిన వ్యస్తసమస్తశబ్దములు విశేషముగా గలవు. ఉ. కతి, కథా, కథమ్, కదా, కతర, కర్హి; కియన్త్, కీదృశ్; కుతః, కుత్ర, కుహ, క్వ, కుచర, కుకర్మన్, కుమన్త్రిన్. పాశ్చాత్యులు వీనినే యీ శబ్దమునకు ప్రాతిపదికములుగా నంగీకరించి యున్నారు. వీనినుండి యుత్పన్నములగు శబ్దములు భాషాన్తరములలో గూడ గలవు.

౧. క (qo-qō)-సం. కః, కా, అవె. kō, kā గ్రీ. *teo*, tou; లా. qwod, quā; గాథి. hvas, hvō; లిథు. kas. సముచ్చయార్థకమగు చశబ్దముగూడ నీప్రాతిపదికమునుండి పుట్టినదే. సం. చ, అవె. ca, గ్రీ. te, లా. que (qe)

౨. కి (qi-)-సం. చిద్, అవె. cith (నపుం)cis (పుం.) ప్రా. పెర్షి. ciy (నపుం.) cis-ciy (పుం).సం. కిమ్. నకిః అను శబ్దములలో చకారమునకు మాఱుగా కకారము పై 'క' అను ప్రాతిపదికనుండి జన్మించినశబ్దముల ననుసరించి ప్రవేశించి యుండవలయును. గ్రీ. tis, ti, లా. puis, puid. ప్రా. ఇంగ్లీ. hwilc, ప్రా. స్లా. cito

3. కు (qu) సం. కుత్ర, అవె. kuthra; సం. కుతః

18. నపుంసకలింగ ప్రథమైకవచనము (కిమ్) తప్ప మిగిలిన కింశబ్ద విభక్త్యులన్నియు 'క' అను ప్రాతిపదికమునుండి తచ్ఛబ్దమురీతి నుత్పన్నములైనవి. 'కిమ్' అను రూపము 'కి' అను ప్రాతిపదికకు 'ద్' అను సర్వనామ ప్రత్యయమునకు మాఱుగా 'మ్' అను నకారాన్త నపుంసకలింగ నామవాచకముల ప్రత్యయము చేరుటచే నేర్పడినదని చెప్పుచున్నారు. కిశబ్దమునకు 'పుం' లింగరూపము నకిః, మాకిః అను వైదిక శబ్దములలో నగపడుచున్నది. కద్ కమ్ అను వైదికావ్యయములు కశబ్దమునకు సర్వనామములయు, (ద్) నామవాచకములయు (మ్) నపుంసకలింగ ప్రత్యయము చేరుటచే నేర్పడినట్లు తెలియుచున్నది.

ఈ కింశబ్దమునకు వేదమున కా (కాని), కేభిః (కైః) అనువిశేషరూపములుమాత్ర మగపడుచున్నవి.

### యుష్మచ్ఛబ్దము

19. మిగిలిన సర్వనామశబ్దములవలె యుష్మదస్మచ్ఛబ్దములలో గూడ నన్ని విభక్త్యులలోను ననుగతమగు ప్రాతిపదికయగుపడుటలేదు. ఉ. వయమ్ (ప్ర.) అస్మాన్. (ద్వి.) మిగిలిన సర్వనామములలో కంటె నధికముగా వీనిలో ప్రత్యయరహితరూపములు విభక్త్యర్థములలో వ్యవహరింపబడుచున్నవి. ఉ. మమ, తవ; గ్రీ. eme. (ద్వి.) మఱియు నీశబ్దములలో ననేకవిభక్త్యులకు రూపములు సమానముగా నున్నవి. ఉ. మే, నః; తే, వః. ఇట్లు విభక్తిప్రత్యయ రహితరూపములు విశేషముగా నుండుటచే నేతత్సర్వనామరూపములు చాల ప్రాచీనమైనవని మనము తలంపవచ్చును. కాలక్రమమున నీసర్వనామముల రూపములు ప్రత్యేకభాషలలో నితర సర్వనామరూపములతోడను, నామవాచకముల రూపములతోడను సమానముగా జేయబడినవి. ఈ సర్వనామములకు లింగభేదము లేకపోవుటచే నిట్టి నూతన రూపములు కొన్ని పుంలింగరూపములతోడను, మఱికొన్ని స్త్రీలింగ రూపములతోడను సమానములుగా నున్నవి. కాని యిదిగూడ లింగభేదమును సూచింపవు. ఉ. అస్మాన్ (పుం. అశ్వాన్), గ్రీ. eme-io (to-io, (hippo-io); అస్మాసు (స్త్రీ. తాసు, అశ్వాసు). ప్రాతిపదికములు భిన్నముగా నుండుటచే ననేకవిభక్త్యుల నేకవచనబహువచనములలో బ్రప్రథమమున ప్రత్యయములు సమానములుగా నుండెను. క్రమముగా బదాన్తర సాహచర్యమున బహువచనరూపములు బహువచన ప్రత్యయములను గ్రహించినవి.

20. యుష్మచ్ఛబ్దమునకు 'తద్, యద్' అను మొదలగువానివలె యుష్మద్, త్వద్ అనువానిని ప్రాతిపదికములుగా మనవా రంగీకరించి యున్నారు. ఇట్టివి వేదకాలమునుండియు వ్యవహరింపబడుచున్నవి. ఉ. త్వద్యోని (అ. వే.); త్వత్పితృ, త్వద్వివాచన (య. వే.) త్వత్ప్రసూత, త్వద్దేవత్యా, యుష్మద్దేవత్యా

శ.(బ్రా.); కాని అకారాన్త ప్రాతిపదికములు (యుష్మ, త్వ) గల శబ్దములుగూడ వేదమున విశేషముగా గలవు. ఉ. త్వయత, త్వావన్త్, త్వాదత్త, త్వానిద్, త్వావసు, త్వాహత; యుష్మాదత్త, యుష్మేషిత; యువావన్త్ యువాకు, యువధిత, యువాదత్త, యువానీత. కాని యీశబ్దము నేకవచనరూపములలో 'త్వ' అను ప్రాతిపదికయేకాక దానితో సంబంధించిన 'తవ, త, తు' అను ప్రాతిపదికములును, బహువచన రూపములలో 'యు' అనునదియేకాక 'వ' అనునదియును నగపడుచున్నవి.

౧. త్వ (tve tvō)—సం. త్వామ్. అవె. thwam, ప్రా. పెర్షి. thuvām ప్రా. స్లా. tvoji.

౨. తవ (teve, tevo) సం. తవ, అవె. tava, గ్రీ. teaos లా. tovos, లిథు. tavas.

౩. త (te-to)-సం. తే, అవె. tē, గ్రీ toi, గాథి. theina, ప్రా. లిథు. ti.

౪. తు, తూ (tu-tū-)-సం. తువమ్, గ్రీ. su.

౫. యు (ju)-సం. యూయమ్, అవె. yūs, గాథి. jūs, లిథు. jūs; సం. యువమ్ (ద్వి.) గాథి. jut, లిథు. judu.

౬. వ (ve-vo-) సం. వః, అవె. vō, లా. vos; సం. వామ్ (ద్వి.) ప్రా. స్లా. va యుష్మయను ప్రాతిపదికలోని యకార మీవకారజన్యమని యూహింపబడినది.

21. వేదమున నీశబ్దమున క్రిందివిశేషరూపము లగపడుచున్నవి.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ | ... | యువమ్ | ... |
| ద్వితీయ | ... | ... | యుష్మాః |
| తృతీయ | త్వా | యువభ్యామ్ | ... |
| చతుర్థి | త్వే | ... | యుష్మే, యుష్మభ్య |
| పంచమి | ... | యువత్ | ... |
| షష్ఠి | ... | యువోః | ... |
| సప్తమి | త్వే | యువోః | యుష్మే |

వైదికరూపములను బరిశీలింపగా నేకవచనబహువచనముల ప్రత్యయములవంటి ప్రత్యయములుగల రూపములు ద్వివచనమున బూర్వమెయుండినట్లు తెలియుచున్నది. శబ్దాన్తరములలోనెల్ల ద్వివచనమున విభిన్నప్రత్యయయుక్తరూపములు గూడ నగపడుచున్నవి.

22. ఇకను సంస్కృతరూపము లేరీతిగా నుత్పన్నించినవో విచారింపవలసియున్నది.

ఏకవచనము—ప్రథమ: ప్రత్యేక భాషలలోని రూపములను పరిశీలింపగా బూర్వమీవిభక్తికి tu, tū అను రెండు రూపము లుండినట్లు తెలియుచున్నది. సంస్కృతములోని 'తు తూ' అను నవ్యయము లివియే యని చెప్పుచున్నారు. త్వమ్ తువమ్ అనురూపములు పై రూపములకు (tu-tū) అమ్మను (am) నవ్యయము చేరుటచే నేర్పడినవని కొందరు చెప్పుచున్నారు. అహమ్మను రూపము ననుసరించి 'తు' అనునది తువమ్ అను రూపమును బొందినదని మఱికొందఱు చెప్పుచున్నారు. చూ. యూయమ్.

ద్వితీయ—ప్రత్యేకభాషలలోని రూపములను బరిశీలింపగా బూర్వమీవిభక్తికి tē, te, tvē, tve అను నాలుగురూపము లుండినట్లు తెలియుచున్నది. త్వాయను రూపము వీనిలో మూడవదానికి సరిపడుచున్నది. త్వామ్ అనురూపము పైదానికి మకారము (m) జేరుటచే నేర్పడినది. మకారము ద్వితీయావిభక్తి ప్రత్యయము గావచ్చును. లేదా, అమ్మను నవ్యయభాగము కావచ్చును. త్వయను హ్రస్వప్రాతిపదికము తృతీయా పంచమీ సప్తమీ విభక్తులలో గనబడుచున్నది.

తృతీయ—'త్వయా' అనురూపము నుత్పత్తి సరిగా తెలియుటలేదు. 'త్వామ్' అను ద్వితీయా రూపమునకును నాకారాన్త స్త్రీలింగశబ్దముల ద్వితీయా రూపమునకును గల సామ్యము నాధారముగాజేసికొని యాశబ్దముల తృతీయారూపమువలె 'త్వయా' అనురూపమేర్పడియుండవచ్చును. 'యుష్మాసు' అనురూపము

గూడ నీవిధముగానే యుత్పన్నమైనదని చెప్పుచున్నారు. చూ. సప్తమీబహువచనము.

రమామ్: రమయా - త్వామ్ : త్వయా. లేని యెడల 'త్వయా' అనురూపము 'త్వయ' అను త్వశబ్ద జన్యశబ్దపు తృతీయారూపము కావచ్చును. 'త్వా' అను వైదికరూపము త్వశబ్దమునకు తృతీయారూపముగా నున్నది. (త్వ+అ).

చతుర్థి — సం. తుభ్యమ్, అవె. taibyā-taibyō. భాషాన్తరములో (చూ. ప్రా. స్లై. tebe) నీ విభక్తియందు 'తే' అను ప్రాతిపదిక యగుపడుటచే 'తు' అను సంస్కృతరూపమునకంటె tai అను నవెస్తా రూపము ప్రాచీనమువలె గనబడుచున్నది. సంస్కృతమున 'తు' అనురూపము 'తువమ్,' 'తువామ్, తువా' అను రూపములనుండి వచ్చియుండవలయును. 'భ్య' అను వైదికప్రత్యయమునకు సమానమగురూపములు భాషాన్తరములలో నగుపడుచున్నవి. ఉ. అవె. bya, లా. bi, గాథి. bo దీనికి కమ్పదముచేరి భ్యమ్ అను రూపమేర్పడి యుండవచ్చును. భ్య యను ప్రత్యయము భి ప్రత్యయమున క యను నవ్యయము చేరుటచే నేర్పడి యుండవచ్చును. తే యను రూపము త యను ప్రాతిపదికనుండి యుత్పన్నమైనది. సం. తే. ప్రా. పెర్షి. taiy, గ్రీ. toi, లా. te. త్వేయను వైదికరూపము త్వ యను ప్రాతిపదికనుండి యుత్పన్నమైనది-(tvo-i). ఇవి సప్తమీవిభక్తిరూపములు - చూ. సప్తమి.

పంచమి—త్వద్ అనురూపము త్వ యను ప్రాతిపదికకు ద్ అను పంచమీ ప్రత్యయము చేర్చుటచే నేర్పడినది. సం. తద్, అవె. thwath, లా. ted.

షష్ఠి—సం. తవ, అవె. tava, అనురూపములు teve అను ప్రాచీనరూపమునుండి వచ్చినట్లు తెలియుచున్నది. ఇది ప్రత్యయములేని శుద్ధప్రాతిపదిక రూపము. గ్రీకు, లాటిన్ రూపములలో ప్రత్యయ మగుపడుచున్నది. గ్రీ. teos, లా. tuus. తే యను శబ్దమును గుఱించి చతుర్థి చూడనగును.

సప్తమి—త యను ప్రాతిపదికకును, 'త్వ' అను ప్రాతిపదికకును నికారము చేరి తే, త్వేయను సప్తమీ రూపము లేర్పడినవి. చూ. అవె. thwoi, te, toi. తే యను రూపము చతుర్థీషష్ఠులక్రింద నుపయోగింపబడుచున్నది. వేదమున ద్వితీయలోగూడ తే యనునది వ్యవహరింపబడుచున్నది. ఇది ద్వివచన బహువచనములలో చతుర్థిషష్ఠులతోబాటుగ ద్వితీయలోగూడ వాం, వః అను రూపములవాడుక ననుసరించి వచ్చియుండవలయును. సప్తమీ రూపమని స్పష్టముగా దెలియజేయుటకును, చతుర్థీషష్ఠులనుండి భేదమును గల్పించుటకును 'త్వే' అను రూపమునకు ఇకారమునుజేర్చి దానిని 'త్వయి' అను రూపములోనికి మార్చియుందురు. (త్వే+ఇ=త్వయి) దీనికి శబ్దాన్తరములు సహకారులైనవి-చూ. ధియా : ధియి-త్వయా : త్వయి.

ద్వివచనము—ప్రథమ: యువమ్ అను వైదిక రూపము ప్రాచీనమైనది. ఇది యూ-అమ్ అని విభాగము చేయదగియున్నది. యూ అను శబ్దము బహువచనమునగూడ గలదు. (చూ. యూ-యమ్, jūs-em) యుష్మదస్మచ్ఛబ్దములలో సమానమగు ప్రాతిపదికము సకారయుక్తముగా బహువచనమునను, సకారవిరహితమగు కేవలరూపముతో ద్వివచనమునను గనబడుచున్నది. అమ్ శబ్ద మవ్యయము. యు శబ్దము ద్వివచనమున భాషాన్తరములలోగూడ గలదు. చూ. లిథు. judu. యువామ్ అనునది ద్వితీయారూపము ప్రథమగా వ్యవహరింపబడుచున్నది.

ద్వితీయ—ఏకవచనమున త్వమ్-త్వామ్ అను ప్రథమాద్వితీయారూపముల రీతిని ద్వివచనము యువమ్ అను ప్రథమకు యువామ్ అను ద్వితీయారూపము వ్యవహారములోనికి వచ్చినదని యూహింపబడినది. వయను ప్రాతిపదికయొక్క 'వా' (వౌ) అను ద్వివచనరూపమునకు అమ్ (em) భాగమగు మకారము (m) చేరి వామ్ అనురూప మేర్పడి యుండవచ్చును. ఇది చతుర్థీషష్ఠులలోగూడ వ్యవహరింపబడుచున్నది. చూ. వః; ద్వితీయా బహువచనము.

తృతీయా చతుర్థీ పంచమీయులు— ప్రథమాద్వితీయలలోని 'యువ' అను భాగమును ప్రాతిపదికముగా గ్రహించి దాని కకారాన్తశబ్దములరీతిని భ్యామ్ అను

ప్రత్యయమును జేర్చుటచే 'యువాభ్యామ్' అను రూప మేర్పడినది. యువా యను వైదికతృతీయ (చూ. వై. యువావత్తః) పై ప్రాతిపదికకు 'ఆ' అను తృతీయైక వచనప్రత్యయము చేరుటచే (త్వారీతిని) నేర్పడినది. యువన్ అను వైదికపంచమిగూడ నిట్లే 'యువ' అను దానికి పంచమ్యేకవచనప్రత్యయము (న్) చేరుటచే (త్వన్‌రీతిని) నేర్పడినది. ఈ రెండురూపములలోను ప్రాతిపదికయే ద్వివచనమును సూచించును. యువా భ్యామ్ అనురూపమున ప్రకృతి ప్రత్యయములు రెండును ద్వివచనముతో సంబంధించినవిగానున్నవి. చతుర్థిలోని 'వామ్' అనుదానినిగూర్చి ద్వితీయ చూడదగును.

షష్ఠీసప్తములు—'యువయోః' అనురూపము కూడ 'యువ' అను ప్రాతిపదికకు 'జస్' అను నకారాన్తశబ్దముల ద్వివచనప్రత్యయము నామవాచకములకు వలె జేరి యేర్పడినది. యువోః అను వైదికరూపము గూడ 'యువ' అను ప్రాతిపదికమునుండియే (ఏన యను ప్రాతిపదికనుండి ఏనోఃవలె) పుట్టియుండవచ్చును. లేనియెడల 'యువమ్' అనుదానికి మూలమగు 'యూ' అను ప్రాతిపదికమునుండి గలిగినదిగావచ్చును. షష్ఠిలో 'వామ్' అను రూపమునుగుఱించి ద్వితీయ చూడ నగును.

బహువచనము— ప్రథమ: వివిధభాషలలోని రూపములను విమర్శింపగా బూర్వమీవిభక్తి jūs అను రూపమున నుండినట్లు తెలియుచున్నది. చూ. అవె. yūs, గాథి. jūs లిథు. jūs. ఈ రూపమే సకార రహితముగా ద్వివచనమున గలదు. చూ. ప్రథమాద్వివచనము. దీనికి 'అమ్' (em) అను నవ్యయము చేరి సంస్కృతరూప మేర్పడినది. కాని 'యూవమ్' అని యుండవలసిన రూపము వయమ్ అను నస్మచ్ఛబ్దరూపము ననుసరించి 'యూయమ్' అనురూపమును బొందినదని యూహింపబడినది.

ద్వితీయ—'యుష్మాన్' అనునది'యుష్మ'అను ప్రాతిపదికమునుండి అకారాన్తశబ్దముల ద్వితీయాబహువచనముల రీతిని (రామాన్) పుట్టి యుండవలయును. భాషాన్తరరూపములను బట్టిచూడగా (గ్రీ. umme) 'యుష్మ' అనుశబ్దము పూర్వము 'us sme' అనునట్టి రూపమున నుండిన ట్లూహింపవలసి యున్నది. ఇందు మొదటిభాగము 'వస్' (vos) అనుశబ్దపు దుర్బల రూపమనియు, రెండవభాగము సర్వనామాన్తరముల విభక్తులలో నగపడు 'స్మ' అను నవ్యయమనియు నూహింపబడినది. అట్లయినచో సంస్కృతమున నిందుండి జనించిన 'ఉస్మ' అనురూపము ప్రథమా బహువచనము ననుసరించి (యూయమ్) 'యుష్మ' అనుహూలాదిరూపమును బొంది యుండవలయును. ఈప్రాతిపదికయే తృతీయాది విభక్తులలోగూడ నగపడుచున్నది. 'వః' అను రూపము 'వ' (ve-vo) అను శబ్దమునకు 'స్' అను బహువచన ప్రత్యయముచేరుటచే నేర్పడినది. ఈశబ్దము ద్వివచనమునగూడ నగపడుచున్నది. చూ. ద్వితీయాద్వివచనము. 'వః' అనురూపము చతుర్థీషష్ఠులలోగూడ నుపయోగింపబడుచున్నది.

తృతీయ—వేదమున'యుష్మా' అను తృతీయావిభక్తిరూప మగపడుచున్నది. (చూ. వై. యుష్మాదత్త.) ఇది 'యుష్మ' అను ప్రాతిపదికమునకు 'ఆ' అను తృతీయాప్రత్యయము చేరుటవలన నేర్పడినది. ప్రాతిపదికముచేతనే బహుత్వము సూచింపబడును. 'యుష్మ' అను ప్రాచీన తృతీయావిభక్తికి తిరుగ భిస్‌ప్రత్యయము జేరి 'యుష్మాభిః' అనురూప మేర్పడినది.

చతుర్థి—'యుష్మ' అను ప్రాతిపదికమునకు భ్యమ్మను ప్రత్యయముచేరి యుష్మభ్యమ్మను రూప మేర్పడినది. 'భ్యమ్' అను ప్రత్యయమును గుఱించి చతుర్థ్యేకవచనము చూడనగును. 'వః' అను రూపమును గుఱించి ద్వితీయయును, 'యుష్మే' అను వైదికరూపమును గుఱించి సప్తమియును జూడనగును.

పంచమి—'యుష్మ' అను ప్రాతిపదికమునకు 'త్' అను పంచమీ ప్రత్యయముచేరి 'యుష్మత్'అను రూప మేర్పడినది. బహుత్వము ప్రాతిపదికమువలననే తెలియజేయబడును.

షష్ఠి— యుష్మాకమ్మను రూపము నుత్పత్తి సరిగా తెలియుటలేదు. దీనితో సంబంధించిన రూప

మనెస్తా భాషలలో మాత్రమగపడుచున్నది. అవె. yusmā-kem. 'యుష్మ' అను ప్రాతిపదికమునకు స్వార్థక మగు 'ఆక' అను ప్రత్యయముచేరి 'యుష్మాక' అను రూపమేర్పడుచున్నది. యుష్మాకమ్మనురూపము దీని ద్వితీయా విభక్తిరూపమువలె నగపడుచున్నది. వః అను దానిని గుఱించి ద్వితీయ చూడవలెను.

సప్తమి— 'యుష్మె' అను వైదికరూపము 'యుష్మ' అను ప్రాతిపదికమునకు సప్తమ్యేక వచన ప్రత్యయమగు ఇకారము (i) చేరుటవలన నేర్పడినది. ఇది చతుర్థిగాగూడ నుపయోగింప బడుచున్నది. 'యుష్మాసు' అను రూపము యుష్మాభిః అను తృతీయా రూపము నాధారముగా జేసికొని యాకారాన్తశబ్దముల రీతిని వ్యవహారములోనికి వచ్చినదని యూహింపబడినది. చూ. రమాభిః రమాసు- యుష్మాభిః యుష్మాసు.

## అస్మచ్ఛబ్దము

23. అస్మచ్ఛబ్దమునకు (తద్, యద్ వలెనే) 'అస్మద్, మద్' అనునవి ప్రాతిపదికములని మనవైయాకరణు లనుచున్నారు. ఇట్టివి వేదకాలమునుండియు వ్యవహరింపబడుచున్నవి. ఉ. అస్మత్సఖి. (ఋ. వే) అస్మద్దేవత్య (పంచ. బ్రా.) మత్కృత, మత్సఖి (ఋ. వే.) కాని యకారాన్త ప్రాతిపదికములు (అస్మ, మ) గల శబ్దములుకూడ వేదమున విశేషముగాగలవు. ఉ. అస్మత్రా, అస్మద్రుహ్, మావన్త్. ఈశబ్దము నేకవచన రూపములలో 'మ' అను ప్రాతిపదికయేకాక 'అహ' అను ప్రాతిపదికయును, బహువచనరూపములలో 'అ' అను ప్రాతిపదికయేకాక 'వ, న' అనునవియును నగుపడుచున్నవి.

౧. అహ (egh): సం. అహమ్, అవె. azem, గ్రీ. egō, లా. ego, గాథి. ik.

౨. మ (me-mo): సం. మే. అవె. mē, ప్రా. పెర్షి. maiy, గ్రీ. emoi, లా. mī, గాథి. mik

3. వ (ve-vo): సం. వయమ్, అవె. vaem, గాథి. veis, ప్రా. హై. జ. wir.

౪. న (ne-no-); సం. నః, అవె. nō, లా. nōs. సం. నౌ, గ్రీ. nōi, ప్రా. స్లై. na. 'ఆవామ్' అనుదాని యాకారమును 'అస్మ' అను ప్రాతిపదికము లోని యకారమును నీ నకారమునుండి గలిగినవనియే యూహింపబడినది.

24. వేదమున నస్మచ్ఛబ్దమునకు క్రింది రూప విశేషములు గనుపడుచున్నవి.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ | ... | ఆవమ్ | ... |
| చతుర్థి | ... | ... | అస్మభ్య, అస్మే |
| పంచమి | ... | ఆవత్ | ... |
| సప్తమి | మే | ... | అస్మే |

పై వైదికరూపములను బరిశీలింపగా నేకవచన బహువచనములవంటి ప్రత్యయములు గల రూపములు ద్వివచనమునను నైదుండినట్లు తెలియుచున్నది. ఇతర శబ్దములలో నెల్ల ద్వివచనమున విభిన్నప్రత్యయ యుక్త రూపములు మూడే యగపడుచున్నవి.

25. ఇకను సంస్కృతరూపము లేరీతిగా నుద్భవించినవో విచారింపవలసి యున్నది.

ఏకవచనము—ప్రథమ: విభిన్న భాషలలోని రూపములను బరిశీలింపగా బూర్వము స్వల్పభేదములతో రెండు రూపము లీవిభక్తిలో వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. egho, egō. 'అమ్' (em) అనుదాని భాగమగు మకారము తుదను జేర్పబడిన వీనిరూపము లుగూడ కొన్ని భాషలలో గలవు. సంస్కృతమున 'అహమ్' అను రూపము పై మొదటి రూపమునకు (egho) మకారము చేరుటచే నేర్పడినది. ఉ. సం. అహమ్, అవె. azem, ప్రా. స్లై. azu; గ్రీ. egō, లా. ego, గాథి. ik. మాతృభాషలో నల్పప్రాణ మహాప్రాణవర్ణములకు (g,gh) వినిమయము సంభవించుచుండెను.

ద్వితీయ—ద్వితీయాది విభక్తులు 'మ' అను ప్రాతిపదికమునుండి పుట్టుచున్నవి. 'మా' అనునది 'మ' అను ప్రాతిపదికపు రూపాన్తరము. పదాన్తమున



సురేంద్రనాథ్ బెనర్జీ
పూనా : 1895—అహమ్మదాబాద్ : 1902



మహమ్మద్ రహి౦తుల్లాసయానీ
కలకత్తా : 1896



సర్ సి. శంకరనాయర్
అమరావతి : 1897



ఆనందమోహన్‌బోస్
మద్రాసు : 1898



ఆర్. సి. దత్తు
లక్నో : 1899



ఎన్. జి. చందావార్కర్
లాహోరు : 1900



డి. ఇ. వాచా
కలకత్తా : 1901



లాల్ మోహన్ ఘోష్
మద్రాసు : 1903

నచ్చు దీర్ఘమగుట కలదు. 'మామ్' అనురూపముపై మాశబ్దమునకు మకారము (అమ్‌యొక్క యేకదేశము) చేరుటచే నేర్పడినది. ఉ. సం. మా, అవె. mē లా. mē గ్రీ. me, గాధి. mik. సం. మామ్, అవె. mām, ప్రా. పెర్షి. mām ప్రా. స్లె. mēm.

తృతీయ—'మయా' అనురూప మెట్లుత్పన్నమైనదో సరిగా దెలియకున్నది. 'మామ్' అను రూపమునకును నకారాన్త స్త్రీలింగశబ్దముల ద్వితీయారూపమునకును నుండు సామ్యము నాధారముగా జేసికొని యాశబ్దముల తృతీయారూపములవలె నీశబ్దమునకు తృతీయారూప మేర్పడియుండవచ్చును. 'అస్మాసు' అనునదిగూడ నీవిధముగానే యుత్పన్నమైనది. చూ. సప్తమి.

'బాలామ్: బాలయా—మామ్ మయా' అట్లుకానిచో 'మయా' అనునది 'మయ' అను మశబ్దజన్య ప్రాతిపదికపు ద్వితీయ గావచ్చును.

చతుర్థి—'మహ్యమ్' అనుదానికి సన్నిహితమగు రూపము లాటిన్ భాషలో (mihi)మాత్ర మగపడుచున్నది. దీనినిబట్టి మాతృభాషలో ప్రత్యయము ఘకారాదిగా నుండినట్లు తెలియుచున్నది. 'అస్మభ్యమ్, తుభ్యమ్, యుష్మభ్యమ్' అను విభక్తులలో ప్రత్యయము భకారాదిగా నుండుటచే 'మహ్యం' అను రూపమున ప్రత్యయాదిస్థ భకారస్థానమును ప్రథమైకవచనములోని ఘకార (egho) మాక్రమించియుండవచ్చును. భ్యమ్ను ప్రత్యయమునుగుఱించియుష్మచ్ఛబ్ద చతుర్థ్యేకవచనము చూడనగును. 'మే' అను రూపము 'మ' అను ప్రాతిపదికమునకు ఇప్రత్యయము చేరుట నేర్పడినది. ఇది న్యాయ్యముగా సప్తమీరూపము షష్ఠిగా గూడ వ్యవహరింపబడుచున్నది. చూ. సప్తమి.

పంచమి—'మత్' అనురూపము 'మ' అను ప్రాతిపదికమునకు 'త్' అను పంచమ్యేకవచనప్రత్యయము చేరుటచే నేర్పడినది. సం. మత్, అవె. meth, లా. mēd.

షష్ఠి—'మమ' అనురూపము 'మ' అను ప్రాతిపదికమును ద్విరుచ్చారణము చేయుటచే నేర్పడినదని తలంపవచ్చును. లేనియెడల మశబ్దముతో సంబంధించిన 'అమ' అనుశబ్దము (గ్రీ. emoi) 'మా, మే' అనురూపముల ననుసరించి యాదిని మకారమును గ్రహించి 'మమ' అను రూపమును బొందియుండవచ్చును. 'మే' అను రూపమును గురించి చతుర్థి చూడనగును.

సప్తమి—'మ' అను ప్రాతిపదికమునకు సప్తమీ ప్రత్యయమగు నికారము చేరి 'మే' అనురూప మేర్పడినది. వేదమున నిది సప్తమిగాను, ద్వితీయగాను గూడ వాడబడియున్నది. ఇది ద్వివచన బహువచనములలో జతుర్థీషష్ఠులతోపాటుగ ద్వితీయలోగూడ 'నౌ, నః' అనురూపములవ్యవహారము ననుసరించి వచ్చియుండవచ్చును. సంస్కృతమున 'మే' అనురూపము చతుర్థీ షష్ఠులలో వాడబడుచున్నది. సప్తమీరూపమని స్పష్టముగా దెలియజేయుటకును, జతుర్థీషష్ఠులనుండి భేదమును గల్పించుటకును 'మే' అనురూపమునకు సప్తమీప్రత్యయమునుజేర్చి దానిని మయి అనురూపములోనికి మార్చియుందురు, (మే + ఇ=మయి.) దీనికి శబ్దాన్తరములు సహకారులైనవి. చూ. ధియా-ధియి—మయా: మయి.

ద్వివచనము—ప్రథమా ద్వితీయలు. వేదమున 'అవమ్' అనునది ప్రథమావిభక్తిగా గనబడుచున్నది. 'ఆవామ్' అనునది ప్రథమా ద్వితీయలు రెంటిలోను నగపడుచున్నది. మొదట నిది ద్వితీయగా నుండి తరువాత ప్రథమగాగూడ వ్యవహరింపబడ నారంభించియుండవలయును. 'యువమ్, యువామ్' అను యుష్మచ్ఛబ్దరూపముల ననుసరించి 'అ' అను శబ్దమునుండి 'ఆవమ్, ఆవామ్' అనురూపము లుత్పన్నములైనవని యూహింపబడినది, అనగా నిందలి 'వమ్, వామ్' అను భాగములు 'యువమ్, యువామ్' అనువానినుండి గ్రహింపబడినవని ఫలితము. 'న' అను ప్రాతిపదికమునకు 'ఔ' అను అకారాన్త శబ్దముల ద్వివచన ప్రత్యయముచేరి 'నౌ' అనురూప మేర్పడినది. ఇది చతుర్థీషష్ఠులలోగూడ నుపయోగింపబడుచున్నది. చూ. నః ద్వితీయా బహువచనము.

తృతీయా చతుర్థీ పంచకము—ప్రథమాద్వితీయా రూపములలోని 'ఆవ' అను భాగమును ప్రాతిపదికముగా

గ్రహించి దానికి అకారాన్తనామవాచకములకు వలె భ్యామ్ అను ప్రత్యయమును జేర్చుటచే 'ఆవాభ్యామ్' అను రూప మేర్పడినది. వేదమునందలి 'ఆవత్' అను పంచమీరూపము పై ప్రాతిపదికకు 'త్' అను పంచమ్యేకవచన ప్రత్యయము చేరుటచే (మత్, త్ కీతిని) నేర్పడినది. ప్రాతిపదికయే వచనమును సూచించును. 'ఆవాభ్యామ్' అనుదానిలో ప్రకృతి ప్రత్యయములు రెండును ద్వివచన సంబంధములే యైయున్నవి. చతుర్థిలోని 'నౌ' అను రూపమును గురించి ద్వితీయ చూడవలెను.

షష్ఠీసప్తములు—'ఆవ' అను ప్రాతిపదికకు 'ఓస్' అను అకారాన్త ద్వివచన ప్రత్యయము నామవాచకములకువలె జేరుటచే 'ఆవయోః' అను రూప మేర్పడినది. షష్ఠిలోని 'నౌ' అను రూపమును గురించి ద్వితీయ చూడవలెను.

బహు వచనము—ప్రథమ : విభిన్న భాషలలోని రూపములనుబట్టి చూడగా పూర్వ మీవిభక్తిలో 'vei' అను రూపముండినట్లు తెలియుచున్నది. దీనికి 'అమ్' (em) అను నవ్యయముచేరి 'వయమ్' అను రూప మేర్పడినది. సం. వయమ్, అవె. vaem, గాథ. veis. ప్రాచీన రూపము (vei) లోని యికారము సర్వనామముల బహువచన ప్రత్యయము గావచ్చును. (చూ. తే.)

ద్వితీయ—'అస్మాన్' అనురూపము 'అస్మ' అను ప్రాతిపదికమునుండి అకారాన్తశబ్దముల ద్వితీయా బహువచనమురీతి (రామాన్) నుద్భవించి యుండవలయును. భాషాన్తరరూపములను బట్టిచూడగా (గ్రీ. amme) 'అస్మ' అనుశబ్దము పూర్వము 'ns-sme' అను రూపమున నుండినట్లూహింపవలసియున్నది. ఇందు మొదటిభాగము 'నః' (nos) అనుశబ్దపు దుర్బలరూపమనియు, రెండవభాగము సర్వనామాన్తరముల విభక్తులలో నగపడు 'స్మ' అను నవ్యయమనియు నూహింపబడినది. ఈ ప్రాతిపదికయే తృతీయాదివిభక్తులలో గూడ నగపడుచున్నది. 'నః' అనురూపము 'న' (ne-no-) అను శబ్దమునకు 'స్' అను బహువచన ప్రత్యయము చేరుట నేర్పడినది. ఈశబ్దము ద్వివచనమునగూడ గలదు. చూ. ద్వితీయాద్వివచనము. 'నః' అనురూపము చతుర్థీ షష్ఠులలోగూడ గలదు.

తృతీయ—వేదమున 'యుష్మా' అను తృతీయా రూపముగలదు. (చూ. యుష్మచ్ఛబ్ద తృతీయా బహువచనము.) ఈరీతినే యస్మచ్ఛబ్దమునకు 'అస్మా' అను తృతీయారూపము పూర్వముండెడిదని మన మూహింపవచ్చును. దీనికి 'భిస్' అను తృతీయా బహువచన ప్రత్యయముచే అస్మాభిః అనురూప మేర్పడి యుండవచ్చును.

చతుర్థి—'అస్మ' అను ప్రాతిపదికమునకు భ్యమ్మను ప్రత్యయముచేరి అస్మభ్యమ్మను రూప మేర్పడినది. భ్యమ్మను ప్రత్యయమును గురించి యుష్మచ్ఛబ్ద చతుర్థ్యేకవచనము చూడవలెను. 'నః' అనురూపమును గురించి ద్వితీయచూడవలెను. 'అస్మే' అను రూపమును గురించి సప్తమి చూడవలెను.

పంచమి—'అస్మ' అను ప్రాతిపదికమునకు 'త్' అను పంచమీవిభక్తిప్రత్యయము చేరుట 'అస్మత్' అను రూప మేర్పడినది. బహుత్వము ప్రాతిపదికముచేతనే సూచింపబడును.

షష్ఠి—అస్మాకమ్మను రూపము నుత్పత్తి సరిగా తెలియుటలేదు. దీనితో సంబంధించినరూప మవెస్తా భాషలోమాత్ర మగపడుచున్నది. చూ. అవె. ahmākem. 'అస్మ' అను ప్రాతిపదికమునకు స్వత్వార్థకమగు నక ప్రత్యయముచేరుట 'అస్మాక' అను రూప మేర్పడినది. అస్మాకమ్మను రూపము దీనికి ద్వితీయవలె నగపడుచున్నది. 'నః'అను రూపమునుగురించి ద్వితీయ చూడవలెను.

సప్తమి—'అస్మే' అను వైదికరూపము 'అస్మ' అను ప్రాతిపదికమునకు సప్తమ్యేకవచన ప్రత్యయమగు నికారము (i) చేరుటచే నేర్పడినది. ఇది చతుర్థిగా గూడ నుపయోగింప బడుచుండెను. 'అస్మాసు'అను రూపము 'అస్మాభిః' అను తృతీయారూపము నాధారముగా జేసికొని యాకారాంత శబ్దముల రీతిని వ్యవహారములోనికి వచ్చినదని యూహింపబడినది.

రమాభిః రమాసు—అస్మాభిః అస్మాసు

# కావ్యాత్మ *

బులుసు వేంకటరమణయ్య

సరసముగ చతుర్వర్గఫలములను సాధించి పామరులను కూడ ప్రజ్ఞాన్వితుల నొనరించు కావ్యము యొక్క తత్త్వము తెలుపజెప్పునది అలంకారశాస్త్రము. అలంకార శాస్త్రపరిచితి లేని కవి ఎట్టి ప్రతిభావంతు డయినను, అతడు రచించిన కావ్యమున సరసత కొరవడును. పాఠకుడు ఎట్టి సహృదయవతంసు డయినను ఏతచ్ఛాస్త్రజ్ఞత లేనిచో అతనికి కావ్యామృత రసము ఆస్వాదనమునకు రాదు.

భారతీయులకు ప్రధానమగు సంస్కృత వాఙ్మయమున పురాతనకాలముననే పెక్కు శాస్త్రములు పరినిష్ఠితస్వరూపములు, ప్రఖ్యాతములు నయి వ్యాప్తి నొందియున్నను, అలంకారశాస్త్రము అడుగున బడి కొన్ని శతాబ్దులదనుక కొనయూపిరితోనే యుండవలసి వచ్చినది. పలుమార్గముల పరుగిడిన యీశాస్త్రమునకు పదునొకండవ శతాబ్దివరకు ఏదో ఒకదారిని స్థైర్యమే కలుగకపోయెను. ఏమయినను, తక్కిన లక్షణముల సంగతియెట్లున్నను - సంస్కృతాలంకారశాస్త్రమే వివిధ భారతీయాలంకార వాఙ్మయముల కన్నింటికి మూలమయ్యెనని చెప్పవలెను.

లక్ష్యగ్రంథములకువలె లక్షణగ్రంథములకు తగు నుత్పత్తివికాసములు కలుగని యాంధ్రవాఙ్మయమున అలంకారశాస్త్రము నామమాత్రావశిష్టమని వేరుగ చెప్పబనిలేదు. సంస్కృతమున ప్రమాణగ్రంథములలో చేరని అర్వాచీనాలంకారగ్రంథమగు ప్రతాపరుద్రీయము ఆంధ్రాలంకారవాఙ్మయమునకు పట్టుకొమ్మ! ఆ గ్రంథమునకు అవకతవక తెనిగింపులగు చూడామణి, సరసభూపాలీయములే. ఆంధ్రమున అలంకారశాస్త్ర జిజ్ఞాసువుల కాధారములు!! కావున మనకు నిజముగ శాస్త్రపరిజ్ఞానము కలుగవలెనన్నను, కావ్యనిర్మాణ పరిశీలనములు క్రమపద్ధతిని ఉండవలెనన్నను సంస్కృతాలంకార వాఙ్మయమే శరణ్యము.

ఇప్పుడిప్పుడు తెలుగు భాషాంతరీకరణములు, స్వతంత్రములు అను కొన్ని సాహిత్యశాస్త్రగ్రంథములు వెలువడుటకు మొదలిడినవి. కాని మనకు సమగ్రమగు అలంకారవాఙ్మయ మింతవేగముగ చేజిక్కునను నాశలేదు.

హితమును బోధించుట, అహితమునుండి మఱల్చుట సర్వవిధవాఙ్మయములకు సాధారణ ధర్మమయినను, ప్రభు మిత్ర సమ్మితములగు వేద పురాణములకంటె కాంతాసమ్మితమగు కావ్యమునకు కొంతవైలక్షణ్యము కలదు. అది దానియాత్మను బట్టియు, తదంగములను బట్టియు కలుగవలెను. గీర్వాణాలంకారికులు చాల కాలమువరకు తలకొకరీతిగ దారితీయుచు వారు తలచిన కావ్యాత్మలును (కావ్యమున ప్రధాన ప్రతిపాద్యములు) వివిధములయినవి. అన్నిమతముల సారమును గుఱుతెఱిగిన గాని పరస్పర తారతమ్యములును, ప్రాశస్త్యాప్రాశస్త్యములును ఎఱుకపడవు. అపారమగు నలంకార వాఙ్మయసాగరమునంతము గనుట కష్టసాధ్యము. తత్తన్మతతత్త్వ పరిశీలనమునకు సుధీవినిర్మితములగు తచ్ఛాస్త్ర సంగ్రహచరిత్ర గ్రంథముల పఠించుటయే అనుకూలద్వారము.

దేశచరిత్రగ్రంథములే కరవయిన ప్రాచీనకాలమున వాఙ్మయచరిత్రగ్రంథము లుద్భవింప నవకాశము గగన కుసుమప్రాయము. ప్రాచీన సంప్రదాయమును మాత్ర మెరిగిన పండితప్రకాండులు వాఙ్మయచరిత్ర గ్రంథములను రచింపబూనుట— ఇక్కాలముననను

* ఆంధ్ర గ్రంథమాల ౨౬ వ కుసుమము. రచయిత, శే. వేం. రాఘవ అయ్యంగారు. క్రౌను, ౩౨౮ పుటలు. వెల రెండు రూపాయిలు. ప్రకాశకులు 'ఆంధ్ర గ్రంథమాల' ౭ తంబుసెట్టివీథి, మదరాసు.

అరుదు. కావున సంస్కృతమునగాని, మఱియే భారత, దేశభాషయందు గాని వాఙ్మయచరిత్రగ్రంథములు వెలువడకుండుట యొక వింత కాదు. నవీన పద్ధతుల ననుసరించి పాశ్చాత్య భాషా వాఙ్మయములందు పట్టముగడించిన పండితులు సంస్కృత సాహిత్యశాస్త్రము ననుసరించి ఆంగ్లమున వ్రాసిన గ్రంథములే కొన్ని మన కుపయోగించుచున్నవి. అట్టియాంగ్ల గ్రంథముల ననుసరించియు, ప్రసిద్ధాలంకారశాస్త్రగ్రంథములను పరిశోధించియు, ఆంధ్రభాషను వ్రాయబడిన అలంకారచరిత్రగ్రంథములలో ఈ 'కావ్యాత్మ' యొకటి. ఇదికాక మఱియొకగ్రంథ మిట్టిపద్ధతుల ననుసరించియే శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు రచించినది కలదు. కాని అది అసమగ్రము. ఇప్పటికి వెలువడిన సాహిత్యశాస్త్రచరిత్రగ్రంథము లీరెండే.

'కావ్యాత్మ' ను రచించిన శ్రీ శేట్లూరు రాఘవఅయ్యంగారు ఎం.ఏ.ఉపాధిధారులు. సుప్రసిద్ధాలంకారశాస్త్రపండితు లగు శ్రీ వేమూరి రామగోవింద శాస్త్రులుగారి శిష్యులయి అలంకారశాస్త్రము నభిమాన పూర్వకముగ అధ్యయనము చేసినవారు. ప్రాక్పాశ్చాత్య విజ్ఞానవిలసితు:గు వీరు రచించిన "ఈ 'కావ్యాత్మ' పలువు రాంగ్లవిద్యావిశారదులు వ్రాసిన రచనలను ఆధారముగ గొని నిబంధింపబడినది. అందును ఎక్కువగా సుశీలకుమారడేగారి రచనాప్రణాళికయే దీనికి మేలుబంతి యయినది." కాన ఇందు స్వతంత్రపద్ధతి కంటె భాషాంతరీకరణపద్ధతియే ఎక్కువ.

డేగారిగ్రంథము ప్రకటితమయి చాలకాలమయినది. నాడునాటికిని ప్రపంచమున విమర్శనము పెంపొంది అన్ని విషయములను పరిణామము నలవరుచుకొనుచున్నందున 'డే' గారి సిద్ధాంతములే యిప్పటికిని ఆదరణీయములని నిర్బంధింప వీలులేదు. ఈవిషయమును "మతనిర్వచనవిషయమున భేద మంతగా లేకపోయినను మతవిభాగమున ప్రాచీనాచార్యుల ననుసరించియే వ్రాసితిని. అందువలన కొన్నిపట్టుల డేగారితో సమ్మతింపలేకపోతిని." అను రచయిత 'కృతజ్ఞతా'ంశము స్పష్టపఱుచును. కాన శ్రీ అయ్యంగారు గీర్వాణాలంకారగ్రంథములను లెస్సగ పరిశోధించి, భాషాంతరీకరణపద్ధతిపై నే ఆధారపడకయుండినచో ఈ 'కావ్యాత్మ' ఆంధ్రవాఙ్మయలక్ష్మికి ఒక అమూల్యాలంకార మయియుండెడిది.

ఇయ్యది చాలవఱకు ఆంధ్రీకరణ మగుటచే తత్సహజములగు లోపములు కొన్ని, శాస్త్రవిరుద్ధ సంప్రదాయములు కొన్ని, పరస్పర విరుద్ధ విషయములు కొన్ని అచ్చటచ్చట కానవచ్చుచున్నవి. అట్టివానిలో కొన్ని క్రింద పొందుపఱుపబడుచున్నవి:

౧. భామహాచార్యునికి పూర్వుఁడగు నాలంకారికుడు 'మేధావి' యనునతడు. 'త ఏతే ఉపమాదోషాః సప్త మేధావినోదితాః' అని భామహుడు ఆతనిని పేరుకొనెను. ఈ 'కావ్యాత్మ' యందాతడు 'మేధావిని'గా జాలచోట్ల చెప్పబడెను. Medhavin అని నాంతమగు నాంగ్లపదమును శ్రీఅయ్యంగారిట్లు మేధావినిగా మార్చియుండవచ్చును.

౨. ..."భామహాచార్యుడు మొదలుకొని జగన్నాథ పండితునిదాక వెలసిన ఆలంకారికు లెల్లరును శబ్దార్థములే కావ్యశరీరమని సమ్మతించి" రని శ్రీఅయ్యంగారు వ్రాసిరి. [పుట ౩౬.] అందరిమతములందును శబ్దార్థములు కావ్యము కాదు. దండి, రాజశేఖర, కేశవమిశ్ర, విశ్వనాథ, జగన్నాథపండితరాజులు శబ్దమే కావ్యమనిరి. అగ్నిపురాణమును ఆ మార్గమునే అనుసరించినది. కాన పయిమతము శాస్త్రసమ్మతము కాదు. ఇటులనే 'శబ్దార్థములు కావ్యమని రుద్రటుడును వచించెను. 'ఈమతమును కుంతల, రాజశేఖరాదు లంగీకరించిరి' [పయిపుటలోనే] అని వ్రాయుటయు సరికాదు రాజశేఖరుడు శబ్దమే కావ్యమని 'గుణవ దలఙ్కృతంచ వాక్యమేవ కావ్యమ్.' అను సూత్రమున వివరించెను.

౩. "ఇటు కాంతాతుల్యముగ కావ్య ముపదేశించుచునుటలోగల విశేష మేమనగా వేదములవలె శబ్దప్రధానములును, పురాణములరీతి నర్థప్రధానములును గాక, శబ్దార్థమిళితము, రసప్రధానము, విలక్షణమునై కాంతామణివోలె కావ్యము సరసతాపాదినియై సహృద

యుల సమ్ముఖులంగా నొనరించి, ప్రేమపూరిత కటాక్షా......రములరామాదులవలె వర్తింపవలయుననియు, రూక్షేక్షణ ప్రసరణముల రావణాదులకైవడి చరింపరాదనియు సలేశ సూచనముల మూలముననే విగళిత వేద్యాంతరమైన బ్రహ్మాస్వాద సదృశానందమును లభింపజేయునని మనము దలపవలయును. మమ్మటుని మతమున నిదియే సకలప్రయోజన మౌళీభూత మనబడును." [పుట ౩౯.]

కావ్యమున రసము ప్రధాన మనియు, అదియే కావ్యమునకు గల ప్రయోజనములలో ప్రధాన మనియు, రసప్రధానమగు కావ్యమున శబ్దార్థములు రెండును గుణీభూతములు (అప్రధానములు) అగుననియు, అట్టికావ్యము కాంతాసమ్మిత మగుననియు ఆలంకారికుల సిద్ధాంతము. తత్సమయవిరుద్ధముగ పయి గ్రంథభాగమున అధోరేఖాంకితవిషయములు వ్రాయబడినవి. 'సకలప్రయోజన మౌళీభూత' మని యొక అపూర్వపదార్థమే అలంకారగ్రంథమునను కానరాదు.

౮ "...... సంఘటన అసమాస, దీర్ఘసమాస మధ్యమసమాసాకలితము లని మూడువిధములని, ఇవి మూడును రసాదుల నాశ్రయించి చెలంగుననియు ఆనందవర్ధనుడు రచించెను. మఱియు సంఘటనాగుణము లైక్యములా ? లేక వ్యతిరేకములా ? అని విమర్శించుచు, ఆనందవర్ధనాచార్యులు సంఘటనాస్వరూపములు గావనియు, సంఘటనాశ్రయమై గుణము లుండవనియు నిష్కర్షగా వచించెను.'' [పుట ౭౨.]

'మాధుర్యాదిగుణముల నాశ్రయించి సంఘటన రసములను వ్యక్తపరచు' నని ఆనందవర్ధనుడు మూలమున చెప్పెను; కాని రసముల నాశ్రయించి సంఘటన యుండునని చెప్పలేదు. ''గుణా నాశ్రిత్య తిష్ఠన్తీ మాధుర్యాదీన్ వ్యనక్తి సా, రసాన్......'' అని కారికాభాగము. వృత్తియందు సంఘటనా, గుణములకు గల పరస్పరసంబంధము చాలవరకు చర్చింపబడినది. తుదకు సంఘటనాగుణము లభిన్నములైన కావచ్చును; సంఘటన నాశ్రయించియైన గుణము లుండవచ్చును; గుణముల నాశ్రయించియైన సంఘటన యుండవచ్చునని మూడు మతములును అంగీకృతము లయ్యెను. పయి గ్రంథభాగము ఆనందవర్ధనాచార్యుల అభిప్రాయమును తారుమారు చేయుచున్నది.

౫. "దండియు కావ్యశరీరమైన శబ్దార్థములకు శోభను సంపాదించుటకే ప్రయత్నించెను. ......... .. ... దండ్యాచార్యుడు పద్యకావ్యమును ఐదువిధములుగను, గద్యకావ్యమును మూడుతెరగులుగను విభజించెను ................. ......గద్యరచనము – ౧ కథ, ౨ ఆఖ్యాయిక ౩ చంపువులన జెలగును " [పుట ౭౮.]

దండి శబ్దమే కావ్యమని చెప్పెను. శబ్దార్థములు తన్మతమున కావ్యశరీరము కాజాలవు. దండి కావ్యమును మూడువిధములుగ విభజించెను. ౧ గద్యము, ౨ పద్యము, ౩ మిశ్రము.

" గద్యం పద్యంచ మిశ్రంచ తత్త్రిధా పరికీర్తితమ్."

గద్యకావ్యమున కథ, ఆఖ్యాయిక అను భేదములు లేవు. ప్రాచీను లంగీకరించిన ఆభేదములను దండి నిరసించెను.

'తత్కథాఖ్యాయికేత్యేకా జాతిః సంజ్ఞాద్వయాన్వితా'
చంపువు గద్యపద్య మిశ్రముకానిగద్యకావ్యముకాదు,
" గద్యపద్యమయీ కాచి చ్చమ్పూరిత్యభిధీయతే."

"కావ్యాత్మ' యందు దండిమతమునకు విరుద్ధములగు విషయములే కానవచ్చుచున్నవి,

౬. "నటుని జూచినంతనే మొదట 'ఇతడు రాముడు'(?) అని తలంచి, పిదప 'ఇతడు రాముడు కాడు' అని తోచినంతనే 'ఇతడు రాముడు కావచ్చు, కాకపోవచ్చు ' అను సందియము గలిగి, ' ఇతడు రాముని వలె నున్నాడు ' అను నియమవిషయమైన బుద్ధి కలుగును. ఇటుల సామాన్య (?) మిథ్యా, సంశయ, సాదృశ్య ప్రతీతులవలన విలక్షణ చిత్రతురగన్యాయమున 'ఈరాముడు సుఖియే; అటుల నేనును సుఖినే.' అను ప్రతీతి కల్గును. " [పుట ౧౫౦.]

సమ్యక్, మిథ్యా, సంశయ, సాదృశ్యము లని ప్రతీతులు నాలుగువిధములు. నటుడు రామపాత్రము

ధరించినపుడు సామాజికునకు ఆతనియందు పయిప్రతీతులకంటె విలక్షణమగు 'ఇతడు రాముడు' అను ప్రతీతి కలుగును. అది మనము గుఱ్ఱపుబొమ్మను చూచి 'ఇది గుఱ్ఱము' అని అనుకొనుదానివంటిది. ఇది అలంకారశాస్త్రసంప్రదాయము.

ఉద్ధృతగ్రంథభాగమున నటునియందు ప్రతీతులన్నియు కలుగునని వ్రాయబడుటయు, చిత్రతురగన్యాయ ప్రతీతి నిరూపణమును సంప్రదాయమున కెంతయు విరుద్ధములు.

౮. "'ముఖ్యార్థము' లేక 'శక్యార్థము' నే వైయాకరణులు, నైయాయికులు, మీమాంసకులు 'అభిధ' యందురు..............................అభిధాశక్తిచే జనించిన అభిధార్థము అనుకూలము కానప్పుడు మరియొకశక్తి మరియొకయర్థము నిచ్చును. ఇదియే లక్షణాశక్తి, లక్ష్యార్థ మనబడును." [పుట ౧౭౬.]

వాచకశబ్దమువలన వాచ్యార్థము (శక్యార్థము, లేక ముఖ్యార్థము)ను జనింపజేయువ్యాపారము (వృత్తి) 'అభిధ' యనియు, 'శక్తి' యనునది 'అభిధ'కు నామాంతర మనియు సిద్ధాంతము. ఇటులనే లక్షకశబ్దమువలన లక్ష్యార్థమును బోధించువ్యాపారము (వృత్తి) 'లక్షణ' యనబడును. 'కావ్యాత్మ' యందు ధర్మధర్మిభావము తారుమారయి, వృత్తులకును, అర్థములకును అభేదము చెప్పబడుటయు, 'శక్తి' పదము వృత్తిసామాన్యపరముగ వ్రాయబడుటయు ఎంతయు విరుద్ధము.

౯. "ఇంక వ్యావర్తక ధర్మపక్షమును పరికింతము. ఈపక్షము అతివ్యాప్తి, అవ్యాప్తి దోషములచే దూషితమై గన్పట్టును. లక్షణాప్రయోజనము చమత్కారవ్యాప్తి కానప్పుడు వ్యంజనను స్వీకరింపరాదు. వివక్షితాన్యపరవాచ్య వ్యంగ్యముల లక్షణ కవకాశము గలదు. ఇచట వ్యంగ్యము లక్షణామూలమై చెలంగును." [పుటలు ౧౫౩, ౧౫౪.]

"నచ భక్త్యా ధ్వనిర్లక్ష్యతే. కథమ్? అతివ్యాప్తేరవ్యాప్తేశ్చ.............. యత్రహి వ్యఞ్జకత్వకృతం మహత్సౌష్ఠవం నాస్తి తత్రాప్యుపచరిత శబ్దవృత్త్యా ప్రసిద్ధ్యనురోధ ప్రవర్తిత వ్యాపారాః కవయో దృశ్యన్తే.............. నహి ధ్వనిప్రభేదో వివక్షితాన్యలక్షః, అన్యేచ బహవః ప్రకారా భక్త్యా వ్యాప్యన్తే." అను ధ్వన్యాలోకభాగమునభిప్రాయము పయి 'కావ్యాత్మ'గ్రంథభాగమునకు మూల మని తోచుచున్నది.

పయిమూలము ననుసరించి 'కావ్యాత్మ' యందు వివరింప బడిన విషయము చాల విలక్షణము. అందలి తప్పులను ఎత్తిచూపుటకంటె మూలాభిప్రాయమును తెలుపుటయే యుక్తము ఆపిదప తప్పులు తమంతనే బయట పడగలవు.

"భక్తి ధ్వనికి లక్షణము కాజాలదు. ఏల? అతివ్యాప్త్యవ్యాప్తు లుండుటంబట్టి. వ్యంజనావ్యాపారమునకు ప్రయోజనము లేనిచోటులకూడ లక్షణ [భక్తి] నాశ్రయించినకవులు కొందరున్నారు. [ఇది అతివ్యాప్తి.] ధ్వన్యంతర్భేదమగు వివక్షితాన్యపరవాచ్యము, మరికొన్ని ధ్వనిప్రభేదములు భక్తి[లక్షణ]యందంతర్భవింపజాలవు. [ఇది అవ్యాప్తి.] కలవు. ఇట్టివింకను కలవు.

ఇందచ్చటచ్చట సంస్కృతాలంకార గ్రంథభాగములు- సందర్భానుసారముగ ఆంధ్రీకరింపబడినవి- కొన్ని కలవు. అయ్యవి ప్రత్యయమాత్రప్రత్యేకతను కలిగి మూలమునే మే లనిపించుచున్నవి. అందు రెండుదాహరణములు:—

౧. భామహుని కావ్యాలంకారమున ఇట్లు కలదు:—

"రూపకాది మలంకారం బాహ్య మాచక్షతే పరే,
సుపాం తిజాంచ వ్యుత్పత్తిం వాచాం వాంఛన్త్య
[లంకృతిమ్.
తదేతదాహుః సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తి రీదృశీ,
శబ్దాభిధేయాలంకారభేదా దిష్టం ద్వయంచ నః"

దీని క్రింది వివరణము 'కావ్యాత్మ'లో కలదు-

"......రూపకాద్యలంకారములు బాహ్యాలంకారములుగా పగులు తలతు రనియు, సుబంతతిజంత సాధుత్వములే సౌశబ్ద్య మనియు, నిదియే వాగ్వ్యుత్పత్తికి హేతుభూత మనియు, అర్థ వ్యుత్పత్తి విషయమున నిట్టివి లేవనియును, తనకు శబ్దాభిధేయాల కారభేదములు రెండునుకూడ సమ్మతమనియు భామహుడు రచించెను." [పుట 3౭.]

౨. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమున ఇట్లు కలదు:

"ద్వివిధో విషయః శబ్దానామ్. అనుమేయః, ప్రతిపాద్యశ్చ. తత్రానుమేయో వివక్షాలక్షణః, వివక్షా చ శబ్దస్వరూపప్రకాశనేచ్ఛా, శబ్దే నార్థప్రకాశనేచ్ఛా చేతి ద్విప్రకారా. తత్రాద్యా న శబ్దవ్యవహారాంగమ్. సాహి ప్రాణిత్వమాత్రప్రతిపత్తిఫలా. ద్వితీయాతు శబ్దవిశేషావధారణవ్యవహితాపి నశబ్దకారణవ్యవహారనిబంధనమ్, తేతుద్వేఅప్యనుమేయో విషయః శబ్దానామ్. ప్రతిపాద్యస్తు ప్రయోక్తు రర్థప్రతిపాదనసమీహావిషయీకృతోఽర్థః. సచ ద్వివిధః, వాచ్యో వ్యఙ్గ్యశ్చ. ప్రయోక్తాచ కదాచిత్స్వశబ్దేనార్థం ప్రకాశయితుం సమీహతే కదాచిత్స్వ శబ్దానభిధేయత్వేన ప్రయోజనాపేక్షయా కయాచిత్. సచ ద్వివిధోఽపి ప్రతిపాద్యో విషయః శబ్దానాం న లిఙ్గితయా స్వరూపేణ ప్రకాశతే, అపితు కృత్రిమేణాకృత్రిమేణ వా సంబంధాన్తరేణ.. వివక్షావిషయత్వం హి తస్యార్థస్య శబ్దైర్లిఙ్గితయా ప్రతీయతే నతు స్వరూపమ్."

పయిదాని యనువాద మీ క్రిందిరీతి నున్నది—

" అనుమేయము, ప్రతిపాద్యము నని శబ్దవిషయము ద్వివిధము. అందు అనుమేయము వివక్షాలక్షణము. శబ్దస్వరూపప్రకాశనేచ్ఛ యనియు, శబ్దమువలన నర్థప్రకాశనేచ్ఛ యనియు వివక్ష రెండు తెరగులు. ఇందు మొదటిది ప్రాణిత్వమాత్రప్రతిపత్తిఫలిత మగుటచే శాబ్దవ్యవహారాంగము గాదు. రెండవది శబ్దకారణవ్యవహారనిబంధనమై చెలంగును. ఇంక ప్రతిపాద్యమన్నచో నది ప్రయోక్తయొక్క అర్థప్రతిపాదనసమీహావిషయీకృతమై తనరారును. ఇది వాచ్యము, వ్యంగ్యము నని రెండు రీతులుగా నుండును. కొన్నివేళల ప్రయోక్త, స్వశబ్దముచే నర్థప్రకాశము నిచ్ఛగించును: మరికొన్ని పట్టుల ప్రయోజనాపేక్షానుసారముగను, స్వశబ్దానభిధేయముగను అర్థప్రకాశనము జేయును. ఈ ప్రతిపాద్యవిషయము లిఙ్గ లింగిస్వరూపమున ప్రకాశింపనేరదు. ఇది కృత్రిమముగనో, అకృత్రిమముగనో, సంబంధాంతరముననో వెలుగొందుచుండును. ఇంక వివక్షావిషయత్వమైన దాని యర్థమన్నచో నది శబ్దములకు లింగమూలమున ప్రతీత మగునుగాని స్వరూపమాత్రమునగా నేరదు."

పయి తెనిగింపులు మూలాభిప్రాయమును వ్యక్తపరుపక మూలవిరుద్ధాభిప్రాయములను కొన్నియెడల వివరించుచున్నవి.

పరస్పరము కొంత విరోధించు నంశము లీ "కావ్యాత్మ" లో కొలదిగ గలవు. మచ్చునకు రెండు—

౧. "భామహాచార్యుడు మొదలుకొని జగన్నాథపండితునిదాక వెలసిన ఆలంకారికు లెల్లరును శబ్దార్థములే కావ్యశరీరమని సమ్మతించుటచే......" [పుట 3౬] అనుదానికి విరుద్ధముగ "రమణీయార్థప్రతిపాదకశబ్దమే కావ్య" మని జగన్నాథపండితుడు వచియించుటవలన నీలక్షణము దండ్యాచార్యుని 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నపదావళియే కావ్య' మనుదానికి ప్రతిరూప మనవచ్చును." [3౨౦] అని చెప్పబడినది.

౨. "భామహుని వక్రోక్తిలోని విశేషాంశమేది యని మనము ప్రశ్నించినచో నయ్యది నవీనుల శ్లేష కాకు గర్భిత వక్రోక్తిశబ్దాలంకారమని బోధపడును." [పుట ౪౧] అనుదానికి వ్యతిరేకముగ—"అన్నివిధముల నిదియేసుమా వక్రోక్తి' యని అతిశయోక్త్యలంకారమున భామహాచార్యుడు వచించుటచే రెండును పర్యాయపదము లని మనము తలంపవచ్చును." అని వ్రాయబడినది. [పుట ౨౧౬]

ఇందు ఆయా సాహిత్యశాస్త్రకర్తల మతములందు 'కావ్యాత్మ'ను నిర్ణయించునెడ రచయిత 'డే' గారి పద్ధతులపయినే ఆధారపడెను. రసస్వరూపము లెస్సగ వివరించుటచే భరతునిమతమున రసము, గుణములను విమర్శించుటచే దండిమతమున గుణము, 'రీతి కావ్యాత్మ' అనుటచే వామనునిమతమున రీతి, అలంకారములను అధికముగ చెప్పుటచే రుద్రటుని మతమున అలంకారములు కావ్యాత్మలను సిద్ధాంతము దుర్బలమయినది. కావ్యమునకు గల ప్రయోజనములన్నింటిలో ప్రధానమగునది రసానందము. అది కల్గింప లేనికావ్యము కావ్యాభాసము. కావున ఎవరిమతమున ఏది 'కావ్యాత్మ' అయినను ఆయాత్మయందు రసముతప్పక అంతర్భవించి యుండవలెను. ఈ సూక్ష్మసిద్ధాంతమును మనస్సున నిడికొని పరిశీలించినచో తత్తన్మతములందు 'కావ్యాత్మ' తత్త్వము సులభముగ నిర్ణయింపవీలగును.

భరతునిమతమున నాట్యము ప్రధానము. రసము దానియందే అంతర్భవింపబడినది. దండి కావ్యమునకు శోభను కలిగించునవి అలంకారములే అని చెప్పి రసమును వానియందే ఇరికించెను. దండి గుణములే కావ్యాత్మ భూతము లని చెప్పలేదు. వైదర్భ, గౌడరీతులని రీతులు రెండున్నవనియు, అందు వైదర్భమార్గమునకు ప్రాణములగు దశగుణములు కలవనియుమాత్రమే అతడు చెప్పెను. వైదర్భిప్రాణములగు గుణముల నాతడు కావ్యమునకు ప్రాణములని తలచెననుట యుక్తిదూరము. వామనుడు 'రీతి కావ్యాత్మ' అని చెప్పినను రీతిసామాన్యమును కావ్యాత్మగా అంగీకరింపక సమగ్రగుణయగు వైదర్భియే గ్రాహ్యమని చెప్పెను. కాన అతని మతమున గుణములే కావ్యాత్మభూతములు. వామనుడు రసమును గుణములందే చొప్పించెను. రుద్రటుడు ఎక్కువగ అలంకారములను వివరించినను ప్రధానములు నాలుగుమాత్రమే. తక్కినవి వానిలోని అంతర్భేదములు. అతడు పదిరసములను చెప్పి రసము లెన్నియేని యుండవచ్చు ననియు, ఆస్వాదయోగ్యము లగునవన్నియు రసములేయనియు చెప్పి తనకు ప్రాచీనులగు వారికంటె రసస్వరూపమును విశేషముగ వివరించెను. రసముల నీతడు గుణాలంకారాదుల వేనియందును అంతర్భవింపజేయలేదు. రసమునకుగల ప్రత్యేకత ఇతనితోనే ఆరంభమయినది. ఇట్లు పరిశీలించినచో విషయము లన్నియు బయలుపడును. కాన పాశ్చాత్య పద్ధతుల ననుసరించి వ్రాయబడిన విమర్శనముల పయి ఆధారపడ నక్కరలేదు. *

"ప్రహతమార్గములందే, నడవ నేర్చినవారికే ఒక్కొక్కప్పుడు ఒడుదుడుకులు కలిగి కాళ్లు తడబడు చున్నప్పుడు అప్రహతమార్గములందు నడవబూనినవారికి తడబడుట వింతకాదు." కాన "కావ్యాత్మ" యందు కొన్ని పొరపాటు లందందు కనుపింపవచ్చును. అవి పునర్ముద్రణమున సవరింపబడను వచ్చును. ఏమయినను ఆంధ్రమున అలంకారవాఙ్మయచరిత్రమును వెలయించి శ్రీ రాఘవ అయ్యంగారు వాఙ్మయమునకు ఉపకారము నొనర్చిరి. ఆంగ్లమున రచింపబడిన సంస్కృతాలంకార చరిత్ర గ్రంథ పరిచితి లేనివారికి ఈ "కావ్యాత్మ" తత్స్వరూపమును ఎఱుకపరచు ననుటలో సందేహము లేదు. ఆంధ్రవిద్వల్లోకము శ్రీ అయ్యంగారి ప్రయత్నమును ప్రశంసించి 'కావ్యాత్మ'ను గౌరవించునుగాక!

---

* పయివిషయములు సవిశేషముగ 'కావ్యాత్మవిచారము' అను వ్యాసమున నాచే వివరింపబడి యున్నవి. [భారతి సంపు. ౧౧. సంఖ్య ౮. పుటలు౯౧-౯౩.] బు. వేం. ర.

## 1885 జాతీయమహా సభాధ్యక్షులు 1934



సర్ హెన్రీ కాటన్
బొంబాయి : 1904



గోపాలకృష్ణ గోఖలే
కాశీ : 1905



రాష్ బీహారి ఘోష్
సూరత్ : 1907—మద్రాసు : 1908



మదనమోహన మాలవ్యా
లాహోరు : 1909—ఢిల్లీ : 1918



బిషన్ నారాయణధార్
కలకత్తా : 1911



ఆర్. ఎన్. మధోల్కార్
బంకిపూరు : 1912



నవాబు సయ్యద్ మహమ్మద్ బహాదూరు
కరాచి : 1913



భూపేంద్రనాథ్ బాసు
మద్రాసు : 1914

## రాజమోహన హేరాయలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

**పి. శి. ఏ. అండు కంపెని,**

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

వేటూరి — సుందరశాస్త్రిగారి

## వృద్ధ సుందరరసము

సర్వవ్యాధి మేహములకు సంజీవి

గుణము ప్రత్యక్షము
అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు
అవసరంలేదు. ఎటువంటి సవా
మేహాలనైనా కుదుర్చును
50 మాత్రలు 5-

ఆర్యరసాయనశాల, ముక్త్యాల

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని, కవిరాజ
కందుకూరి వేంకటసుబ్బారావుగారి

## కామామృతము

కామామృతము:— దేశదేశములలోఁ బ్రఖ్యాతిఁబొందినది. రాత్రి 1 మాత్ర సేవించిన 1 గంటకే ఎంత నిస్సారమైనశుక్లమైనను సంసారసౌఖ్యము నీయఁగలదు. ఏవిధముగా నష్టమగుచున్న శుక్లమునైనను 5 దినములలో నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములశక్తితగ్గినవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించుకొనవలెను. 20 మాత్రల సీసా 1-కి రు. 2-0-0.

తేజోమృతము:— సెగరోగము (గనోరియా) ఎట్టిరంగుతో, ఎంతటిబాధతో, ఎన్నిసంవత్సరములనుండియున్నను మొదటిమోతాదునుండియే సుగుణమును జూపించి పూర్తిగ నివారించును. 1 సీసా రు. 4-0-0

వృద్ధామృతము:— ఒక్కసీసా చాలును. నల్లమందువేసికొనుదురభ్యాసమునుదొలఁగించి ఆదాయమును బలమును వృద్ధిచేయును. 1 సీసా రు. 5-0-0

విలాసము:— అమృతాశ్రమము,

నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

---

## వినోదశిల్పము

ఇందు అట్టలు, కాగితములు, కవిమ్ములు, పుల్లలు, దారములు, గాజుపూసలు, గొట్టములు మొదలగువానితో, ఉపయోగకరములగు వినోదవస్తువులను తయారుచేయు పద్ధతులు వివరింపబడినవి. ప్రాథమిక, మాధ్యమిక, బోధనాభ్యసన పాఠశాలల విద్యార్థులకును, గృహపరిశ్రమాభిలాషులయిన యందరికిని ఇది అమూల్యమైన గ్రంథము. తెలుగున నిప్పటి కిటువంటి పుస్తకము వెలువడలేదు. సరళశైలిలో, సులభముగ బోధపడుటకు చిత్రసహితముగ రచింపబడినది. భారతియందు ప్రచురింపబడుచువచ్చిన యమూల్యమైన వ్యాసములు ప్రజలకోరికపై ఇట్లు గ్రంథరూపముగ ప్రచురింపబడినవి. విద్యాధికారులును, స్థానికసంస్థల యధిపతులును మెచ్చి, యాదరించిన గ్రంథము. వెల రూపాయ నాలుగు అణాలు మాత్రము. కొలది ప్రతులే ముద్రింపబడినవి త్వరపడవలయును.

ఆంధ్ర గ్రంథమాల,

7, తంబుశెట్టివీధి, మదరాసు.

# రసవాదోపసంహృతి

దువ్వూరి సూర్యనారాయణమూర్తి
[ శ్రీ నవ్య సాహిత్యమండలి ]

శ్రీ పాటిబండ మాధవశర్మగారు కార్తికమాస భారతిలో రససిద్ధాంతము అనే వ్యాసాన్ని ప్రకటించేరు. వ్యాసము పరిశీలించితిని. అసలీవాదం శర్మగారు తెనుగుసంఘపత్రికలో సూక్ష్మంగా ప్రచురించినట్టున్నూ, తరువాత అభినవభారతినుండి ఉద్ధరించుకొన్న 'స్వంస్వంనిమిత్త మాసాద్య' అనే శ్లోకంతోనూ, గురుపాదుల పద్యంతోనూ తమ వాదాన్ని పెంపొందించినట్టున్నూ తెలిపేరు. అసలే గహనమైన ఈవిషయం పైవాటితో మరింత నిబిడమై పెరిగి గోదావరంత అయి పాయిపాయిలై విడిపోయి బోలెడు లంకలు వేసి బీళ్లు పెరిగ అయోమయం అయిపోయింది. దీనిమీద ఇంకా వాదోపవాదాలు పెంచి పాఠకలోకాన్ని క్లేశపెట్టడం ఎంతమాత్రమూ ఇష్టంలేక ఈ నా అభిప్రాయాన్ని సూక్ష్మంగానే విశదీకరిస్తున్నాను.

శర్మగారు, దేవగుప్తాపువారొకఉత్తరం రాసినట్టున్నూ, ఆవెనుక రెండుమూడునెలలకు శ్రీ దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారి పేర ఈవ్యాసం ప్రచురింపబడ్డది అనిన్ని రాసి దేవగుప్తాపువారి రాతకూ నావ్యాసానికీ సంబంధంఉన్నట్టు అభిప్రాయపడ్డారు. ఈ విషయంలో శ్రీ విశ్వేశ్వరరావుగారికీ నాకూ నేటివరకు ఏవిధమైన పరిచయమూ లేదనిన్నీ వారిని నేనెన్నడూ చూడలేదనికూడా శర్మగారు మున్ముందు తెలిసికొందురుగాక. రసవిషయజిజ్ఞాసువునైన నేను హనుమచ్ఛాస్త్రిగారివ్యాసం శాస్త్రసిద్ధం అవడంచేతనూ, శర్మగారివాదము నా కనుభవవిరుద్ధంగా కనిపించుటచేతనూ నారసర్ధాంతాన్ని ప్రచురించేను. దీని నిర్ణయానికి సహృదయులే ప్రమాణులు.

శాస్త్రసాంప్రదాయం విడిచిపెట్టి రసపరిష్కారానికి దిగిన శర్మగారి ప్రతిభావాద సూక్ష్మరూపం ఇది.

శాంతము మూలరసము. శాంతాపరపర్యాయక నిర్గుణతత్వంనుండి ప్రేమ పుట్టుచున్నది. దీనికి ప్రవృత్తి నివృత్తు లున్నవి. ప్రవృత్తివల్ల నాలుగు రసాలు, నివృత్తివల్ల నాలుగురసాలు పుట్టును.

దీనిపై నేనుచూపినముఖ్యమైన అనుపపత్తు లివి:

౧. శాంతరూపనిర్గుణతత్వజన్యం సామాన్యమైన కామమా? విశిష్టము, లేక ప్రకృష్టమైన ప్రేమేనా?

౨. రతిహాసోత్సాహాద్భుతాలందు సుప్రకాశమైన కామము, లేదా ప్రేమ నష్టమై కరుణబీభత్స క్రోధ భయానకములందు ఎట్లు భాసిస్తుంది?

వీనికి వారి సమాధానాలు—

౧. ప్రేమసామాన్యము; కామాదులు విశిష్టములు.

౨. వీనివిషయమున నిమిత్తవశమైన ప్రేమ స్వప్రకాశమును పొందుటకు కొంతబాధ అవసరమగుచున్నది.

తమప్రేమవాదాని కుపష్టంభకంగా మనస్సు లేదా, దానినిసర్గతత్వాన్ని నేను ప్రేమఅంటున్నాను. స్థాయీభావాలందు అనుస్యూతంగా వచ్చుచున్నమనోధర్మము ప్రేమేఅనిన్నీ నాతాత్పర్యము. "ఆత్మనః అహంకారవిశేషః సచేతసా రస్యమానః రసఇత్యుచ్యతే" అని భోజుడు చెప్పినాడు. ఆత్మధర్మమైన ఈ అహంకారమే మనోధర్మమని నాతాత్పర్యము అనే మాటలుగూడా వ్రాసినారు.

ప్రతిభావ్యక్తులగు శర్మగారు కేవలస్వప్రతిభతోనే తెనుగుసంఘపత్రికలోలాగ పూర్వరసపరిష్కర్తలసంబంధం లేకుండా ఏసిద్ధాంతంచేసినా, ఏమిపరిష్కరించుకున్నా మేమందులో కలగచేసుకోవలసిన అవసరం లేకపోయేది. ఇక వారు తమప్రతిభకు పూర్వాచార్యుల అనుమతిని జోడించతలచి పూర్వుల

శ్లోకాలకు వ్యాఖ్యానంచేసి పూర్వాచార్యానురోధత్వం సంపాదించతలచి ఏదోరాయడంచేత మే మిందులో కలుగచేసుకోవలసి వచ్చింది. అభినవగుప్తుడు అభినవభారతిలో ఇచ్చిన శ్లోకం ఎంతశ్రమపడినా రసప్రసూత్వమునే నిర్ణయించగలుగుతుందిగాని రసాలు ప్రేమమూలాలనే వాదానికి అప్రయోజకమే అవుతుంది. కాగా కేవలప్రతిభాదృష్టితోనే వీరివాదం సాగించవలసి వుందిగాని భోజాదుల రసచర్చలను తడవుట అనవసరమున్నూ, వృథాయాసమున్నూ.

మా ప్రేమనిర్వచనము దుష్కరము కాదు. ఆ శ్లోకానికి తాత్పర్యార్థాన్నే నేను రాసేను. కేవలప్రతిభావృక్కతో శ్లోకం సమన్వయించు సిద్ధాంతులకు ఇందు బహుళసందేహాలేమో తెలియదు. పశ్వాదులయందలి అనురాగాన్ని ప్రేమ అనవచ్చు; సందేహంలేదు. అయితే వస్తువుపైనున్న కోరికనుకూడా కామమనవచ్చు, కాని ఆపదం లోకంలో అనుమానము, ఆగ్రహము, పాపము, రతి, అనేమాటల్లాగ ఒకవిశేషార్థమందు రూఢాలైనట్లు భాసిస్తూండడంచేత కామమనడం కొంచెము వెగటుగా తోచవచ్చు. సామాన్యమైన కోరికకు తప్పక కామునేవ్యపదేశం. దానికి సుప్రసిద్ధవాక్యాలే ప్రమాణం.

“ఇచ్ఛా కామః; సర్వాన్ కామాన్ పరిత్యజ్య, నిష్కామః.”

కనుక శబ్దార్థం తెలిసిన విజ్ఞులు మా ప్రేమనిర్వచనాన్ని బహూకరిస్తారు లెండి.

ఇంక రససిద్ధాంతులు పూర్వసాహిత్యవేత్తల సమ్మతి అనుకొని తమవాదానికి జోడించిసాగించిన రససిద్ధాంతమందు అవ్వలికథాక్రమం బెట్టిదనిన :

సిద్ధాంతులు ప్రేమను ప్రకృష్టభావంగా ఒప్పుకొన్నారు. కామం సాధారణభావంగా అంగీకరించేరు. ప్రాథమికావస్థ ఐన సాధారణభావానికి ప్రకర్షస్థితివస్తేనే కదా ప్రకృష్టత సిద్ధిస్తుంది. మొక్కగాఉన్న దానికి పెరకువవచ్చి చెట్టుగా విజృంభించుట ప్రకృష్టభావము. ఇందు మొక్కగాఉండుట సాధారణభావం. మొక్కవంటికామం తత్తన్నిమిత్తాలవల్ల పెరిగి చెట్టువంటి ప్రేమ అవడం సువిదితమేకదా! ఇప్పుడు ప్రాథమికమైన కామన్నుంచే తత్తద్వికారములు కలుగుతున్నవని ఊహించుటలో క్లేశంలేదు. కనక శాంతంనుండి ముందుపుట్టేది కామం; దానివిజృంభణం ప్రేమ అను మావాదం ఎల్లాఅపాస్తమైనదో తెలియకున్నది. ఏతావతా, కామ, ఇచ్ఛా, రతి, వాంఛానురాగాదులు సర్వమూ ప్రేమయొక్క రూపాంతరాలవడానికి ఎంతమాత్రం అవకాశం లేదు. కామేచ్ఛాదులు సాధారణాలు, ప్రేమ ప్రకృష్టమున్నూ కనక—

భయానకాదినివృత్తిరసాల్లో కామప్రవృత్తి లేమి నిశ్చయం. దీన్నే నేను అభావమన్నాను. అభావమంటే నష్టి అనేయర్థం లేదనుకుని సిద్ధాంతులు “నివృత్తి అభావంకాదు” అన్నారు. అభావం నాలుగువిధాలు. ప్రాగభావం, ప్రధ్వంసాభావం, అత్యంతాభావం, అన్యోన్యాభావం అని. ఇక్కడ కామ ముండి నశించుట ప్రధ్వంసాభావం అవుతుంది. ఇప్పుడెవరు చిరము భావించవలసివుందో ప్రాజ్ఞులూహించగలరు. ఐతే ఈఅభావరూపంగావున్నా, కామం నివృత్తిరసజనకత్వంలో ఎల్లాప్రయోజకమవుతుందో ఎప్పటికీ చింత్యమే; జుగుప్సాదులలో నశించినకామం తిరిగి “ఎంతబాధ” పడినా స్వప్రకాశమును ఎట్లాపొందుతుంది? ఒకవేళ రసానుభూతిలో స్వప్రకాశం పొందుతుందన్నప్పటికీ మొదట నశించినది తిరిగీ రాదు. రసానందోపలబ్ధిలో క్లేశం పొందుట సంస్కృతసాహిత్యాచార్యులంగీకరింపరు.

ఒకచో “ఆమనస్సు, లేదా దాని నిసర్గతత్వమును నేను ప్రేమఅనుచున్నాను” అని రాసి మరోచోట “ఆత్మధర్మమైన ఈ అహంకారమే మనోధర్మమైన ప్రేమ యని నా తాత్పర్యము” అని పరస్పరవిరోధముగా నుడివేరు. ఇది స్వమతానికీ, భోజునిమతానికీ జోడించినందువల్ల కలిగిన అనర్థం. భోజుడు “ఆత్మనః అహంకారవిశేషః చేతసా రస్యమానః రస ఇత్యుచ్యతే” అనిచెప్పినాడు. ఆత్మధర్మమైన అహంకారాన్ని రసమునుగా చెప్పినభోజుని మతము వీరిప్రతి

భావతానికి విరుద్ధం. ఇది యెట్లావున్నదంటే "శాంతాద్భావః ప్రవర్తతే" అన్నచోట భావః అంటే శాంతవికారరూపమైన ప్రేమ అనుకున్నట్టుంది. మనస్సు వేరు. ఆత్మ వేరున్ను.

"సుఖాద్యుపలబ్ధిసాధన మింద్రియం మనః."

"జ్ఞానాధికరణ మాత్మా!"

దీనినిబట్టి మనోధర్మమైన ప్రేమకూ, ఆత్మనిష్ఠమైన అహంకారానికి చాలాభేదం కనిపిస్తుంది. దీన్ని మాత్రము సిద్ధాంతులు చిరము భావించక తప్పదు.

శాంతం మూలరసమని అభినవ భారతీతరసాహిత్యగ్రంథాలు చెప్పలేదు. కాక అది చాల ప్రాచీన మతం. అది మేమంగీకరించినా సిద్ధాంతుల ప్రేమ మూలక రసవాదానికి ఏమీ ఉపయోగం లేదు.

ఇంకొకటి "నాది రసోత్పత్తిక్రమము. ఆచార్య పాదులది రసోద్దేశక్రమము" అన్నారు సిద్ధాంతులు. కాని ఇదికూడా ఉత్పత్తిక్రమగర్భితమైన ఉద్దేశక్రమంగాని కేవల ఉద్దేశక్రమంమాత్రమే కాదు. అదే ఐతే, "ప్రథమం శృంగారః తత స్తజ్జన్యత్వేన" అని జన్యజనకభావం చూపిస్తూ ఆచార్యపాదు లెందుకు నిర్వచిస్తారు? కాగా ఇది ఉత్పత్తిక్రమంకాదనడానికి ప్రతిభావాదులు మరేవిధంగా దీన్ని అర్థం చేసుకున్నారో కదా?

అసలు ఈవాదం మొదట ఆలోచించగా చరిత్రాత్మకమైన వ్యక్తిగత రాగద్వేషాలవల్ల బయలుదేరినట్లు పొడకట్టుచున్నది. ఏమంటారా, హనుమచ్ఛాస్త్రిగారి రివ్యూలోని 'అప్రసిద్ధమన్నదానికి కేవల సత్యదూరమనిన్నీ 'ప్రాబంధికపుటనగమము' అనేదానికి కావ్యమెంతమాత్రము కాజాలదనిన్ని తాత్పర్యాలు రాసి శ్రీశర్మగారే తమ రసపరిష్కారంలో కొన్ని విసురులు విసిరేరు. అప్రసిద్ధమంటే అత్యంతాభావం ఔతుందా? రెండవమాటకు కొంతమాత్రమే కావ్యత్వం సిద్ధించవచ్చు అని గదా భావము.

ఇంతకీ కేవల ప్రతిభావాదమైనా యుక్తియుక్తంగా ఉంటే అభిజ్ఞుడు శిరసావహిస్తాడు. ఎంతశాస్త్రవాదమైనా అసంబద్ధమైతే ఖండించడానికే వెనుదీయడు. మావాదమే గెలవాలనీ మాటా, ఆ పట్టుదలా ఎవ్వరికీ పనిలేదు.

ఇప్పటికి భారతీపాఠకులైన సహృదయులకు మావాద ప్రతివాదాల పోకడలు అర్థమయే ఉంటాయి. ఇక దీన్నిగూర్చి అనవసర కార్పణ్యవాదాలు చేసి భారతికి భారంకూర్చుట వ్యర్థము. కనుక మావాదాల ఔచిత్యానౌచిత్య సమీక్షను ప్రాజ్ఞలోకానికి వదలి వేస్తున్నాను.

[ఈ చర్చ కింతటు స్వస్తి.—సం. భారతి]



# మూర్ఛనాపస్వరములు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
(శ్రీ నవ్యసాహిత్యమండలి నియంత)

"కొయ్యబొమ్మల మెచ్చుకనులకు
కోమలులసౌ రెక్కునా"

యువకార్తికమాసంలో చర్లగణపతిశాస్త్రి గారు నా తెలుగువీణను తీసి సారించబోయి తీర్చిదిద్దినశ్రుతి తెన్ను తెలియక మూర్ఛనలో అపస్వరాలు పలికించి అభిజ్ఞులకు అపహాస్యంగాను, అజ్ఞులకు ఆనందంగాను వాదం సాగించారు. ఒక్కొక్కచోట చికాకుపడి తీగెలు తెంపివేశారుకూడా.

సద్వైణికుడు వీణను చేతి కివ్వగానే వీణపై గప్పిన బురఖానుడ్డ యెక్కడ కుట్టించారు? ఎన్నికుట్లున్నవి? గజముయెంత? అనే చచ్చుప్రశ్నలు వేయక వెంటనే బురఖా తీసిపారవేసి శ్రుతి సరిపెట్టుకుని ఆతంత్రులలో నిద్రపోయే అమృతగీతికలను తనమెత్తని సిద్ధాంగుళులతో తట్టిలేపడం ప్రాజ్ఞలోకానికి విదితం.

తెనుగువీణవైణికుడు అట్లాంటివాడు కాడు. బురఖాదగ్గరనుంచీ పరిశీలిస్తేగాని విడవని శల్యపరీక్షకుడు. తీగెలలోని విభిన్నస్వరప్రవృత్తి తెలియక శిల్పిని దూషించే అకృతపరిచితుడు దురదృష్టవశాన ఇతని చేయి తెనుగువీణపై సోకింది. ఇక ప్రకృతం—

గణపతిశాస్త్రులుగారిని నే నెరుగుదును. ఐతే ఆయన నాకు పరిచితుడుమాత్రమే. ఊహాలలోను, రుచులలోను, లక్ష్యాలలోను ఉత్తర దక్షిణధ్రువాల వంటి మా మధ్య మైత్రి అనేమాటను మలినపరచలేను.

శాస్త్రులుగారివిమర్శ ఇట్లావుండడంలో నా కాశ్చర్యం లేదు. ఏమంటే, నావకుళమాలాపరిశీలనం చూసి 'ఆహా! క్రొత్తకవిత్వానికి మంచిదెబ్బ తగిలిం'దని సంతోషించి వుంటారు ఇప్పుడు క్రొత్తపోకడలతో నాదగ్గరనుంచి తెనుగువీణ రావడం చూచి వకుళమాలకు తెనుగువీణకు యేవిధముగనూ సామ్యం లేకపోయినా, కుపితులై నేను వకుళమాలలో చూపినలాంటిలోపాలే నాపుస్తకంలోకూడా చూపించితీరాలి అనిపట్టుబట్టి, ఏవో కొన్ని గిలవని నీహారలేశాలవంటి దోషాభాసాలు వెదకి ఈ అవహేళనం ప్రకటించి కృతార్థుడనయ్యాననుకొన్నారు.

అందంకోసం వేసిన అట్టలనూ వ్యవహారసౌకర్యంకోసం వాడిన ముఖపత్రమండలి ఇంటిపేరును, చూచి కంగారుపడి ముఖపత్రమనుకొని, శ్వేతపత్రమును చూసి నిరాశపడి శాస్త్రులుగారు చేసిన అవమర్శను నిర్లక్ష్యం చేస్తూ తెనుగువీణవిమర్శలో వారుపడిన భ్రమప్రమాదములను క్రమంగా వివరిస్తున్నాను.

౧. ముమ్మొదట మా శ్రీనివాసరావుగారు పెట్టిన శ్రుతినే మూర్ఛకులు అవగతంచేసుకోలేక తప్పుదారిని బడ్డారు! చూడండి:

"కాశాగజ్ఞాకంకాశమ్మా అంటే యేమిటి? అని కొందరు ఎన్నో ప్రశ్నలువేస్తారు. జవాబుగా కళాశీలి మొదట దీని కేమీ అర్థంలేదని ఒప్పుకుంటాడు" అన్నంతవరకే తీసుకుని శాస్త్రులుగారు "పైకవిత్వలక్షణమునకు తెనుగువీణకు సమన్వయము" చేయబడినట్లు భ్రాంతిపడి తమభ్రమను శ్రుతికారుని ఉద్దేశ్యముగా పాఠకలోకాన్ని వంచింపబోయినారు. కాని ఇంకొక రెండు పంక్తులు చదివితే ఈ భ్రమకు ప్రమఉన్నది.

"కాని బాలురు తమచుట్టూఉన్న ప్రపంచాన్ని చూడడం నేర్చుకుంటున్నారని గమనిస్తాడు. అనుభవాన్ని నుడిలోకి తెచ్చే తహతహ కనిపిస్తుం దతనికి వాటిలో. కళాశీలి బాలురచేత ఈ పద్ధతిని పలికించి అంతరుత్సాహాన్ని కవిత్వంగా ఆహ్వానిస్తాడు. అతి పవిత్రమైనదీ, విలువలేనిదీని ఈఉత్సాహం" అని శ్రుతికారుడు కళాశీలి పరమదృష్టిని నిర్వచించి అంతరుత్సాహాన్ని ఆహ్వానించడం కవిత్వమని సిద్ధాంతంచేసి "అతి

పవిత్రము విలువలేనిది ఐన యీ ఉత్సాహం" లక్ష్యంగా పెట్టుకుని (ప్రకృత) కవిత్వరహస్యాన్ని భేదించ మన్నాడు. ఇట్టి శ్రీనివాసుని గంభీరవాక్కు శాస్త్రిల వారిని కలవరపెట్టింది. కాని శ్రీ శ్రీ. కి నా తెనుగు వీణమీద నికృష్టాభిప్రాయం ఎంతమాత్రమూ లేదు. నా యీ అభిప్రాయము సుబద్ధం చేయడానికి శ్రీ శ్రీ తెనుగువీణనుగురించి నాకు వ్రాసిన ఒక ఉత్తరమునందలి కొన్నిమాటలిక్కడ ఉద్ధరించడం అప్రకృతంకాదు.

"విశాఖపట్టణం — ౨-౨-౩౫............... తెనుగువీణలో చాలాగీతాలు నేను చదివినవో మీరు వినిపించినవో కద! కొత్త వింకా వ్రాశారా? చూడాలి చూడాలి. యువకులతరంలో ఒక మధురకంఠం విని పిస్తున్నారు మీరు. సంస్కృతసాహిత్యం మథించిన్నీ ఆధునికాంధ్రకావ్యప్రవాహాల రకరకాలపోకడలు ఆకళించుకొనిన్నీ చక్కనిగీతాలు, చల్లనిగేయాలు పలికించింది మీ తెనుగువీణ." దీనినిబట్టి తెనుగువీణమీద శ్రుతికారుడికి ఎట్లాంటి అభిప్రాయం ఉందో ప్రాజ్ఞులూహించగలరు.

౨. మూర్ఛకుని విమర్శయెత్తుగడ చూస్తే ఆధునికకావ్యాన్ని అర్థం చేసుకునేపద్ధతే ఎరుగనట్టుతోస్తుంది. వివిధానుభూతులలో, విభిన్నావస్థలలో వెలువడిన కావ్యాలసంపుటిలో ఒకగీతానికీ యింకొకగీతానికీ ముడిపెట్టి విమర్శచేయడం యుక్తముకాదు. "వేగలేనాగలే నింక విడవివత్తు" అన్నగీతం ప్రపన్నాత్మ అను కావ్యంలోనిది. ఈ కావ్యం నివృత్తిమార్గమునకు చెందిన కవి ఒకమనస్తత్వమును ప్రదర్శిస్తుంది. "ననుజూసి నవ్వింది నవ్వులో మెరిసింది" అనేగీతం కవిశృంగార ప్రవృత్తిని సూచిస్తుంది. రెండూ వేరువేరుసమయాలలో వేరువేరుచిత్తవృత్తులతో వ్రాయబడినవి.

౩. "కమలిని నవ్వుతూ పిలుస్తున్నది. కవి నీ నవ్వు వెలుగులో బ్రతుకు నిలుపలేను. కరమెత్తి పిలువ కన్నాడు." ఇందులో విమర్శకుడు ఏమి అనౌచిత్యం చూశాడో "మొగమెత్తి నవ్వకే తలవంచినవ్వకే" అన మన్నాడు. సరే 'తలవంచినవ్వకే' అంటే నవ్వువద్దనే వాడికి బాధేమిఉంటుంది? అప్పుడు "నీనవ్వు వెలుగులో నిలుపలేనే బ్రతుకు" అనే పూర్వవాక్యానికి సమన్వయం ఎట్లా? ఇక్కడి ఔచిత్యం సహృదయతకొద్దీ ఊహించవచ్చు.

౪. ఏమో అనేగేయంలోని "ఎందుకో యీ హృదయ మింతకళవళపడును" అనే విచికిత్సకు జవాబు దానిక్రిందిపాదాల్లోనే ఉన్నది "ఏపేదవాని ఆకలి చిచ్చు ఏకష్టజీవిక్రొంజెమట- ఏవలపుచెడద క్రాగిన మంట- ఈ పాడుబ్రతుకులో ఇంకిపోయెనో కాని" అని. ఇక్కడ విమర్శకుడు "ఇతడు వియోగియైన కావలెను లేక ఉన్మాదియైన కావలెను" అని అంచనా వేయ నక్కరలేదు. హరీంద్రనాథ చట్టోపాధ్యాయుడు 'లై' (Lie) అనే కావ్యంలో పేదవాని కంటికీ కష్టజీవికంటికీ చంద్రుడూ, నక్షత్రాలూ, రమ్యదృశ్యాలూ కుష్ఠురోగిపుండ్లలాగను, వేదనాజనకములుగాను కనిపిస్తాయన్నాడు. కాళిదాసు సుఖితుడైనా రమ్యమైన వస్తువులనుచూసి, శ్రావ్యమైన సంగీతమువిని పర్యుత్సుకుడౌతాడన్నాడు. కవిత్వతత్వము తెలియని విమర్శకుడు లేని పోని 'ఉన్మత్త' ప్రసంగము తెచ్చి తన విమర్శను వికృతము చేసుకొన్నాడు.

౫. "నూతనత్వముకోసమై యర్థము పాడగునట్లు కూర్చుటలో నూతనత్వము ఉండదు." అని ఒక మహోపదేశం నాకు సాయించి ఈ దీర్ఘసమాసం ఉద్ధరించి అర్థం పాడఘుంపన్నాడు విమర్శకుడు: "మధుదుర్దిన శ్రావణ పర్యుషస్సుధా పాతము లార్చుకొన్నవి."

అర్థము :

మధుదుర్దినములయొక్కయు, శ్రావణ పర్యుషస్సులయొక్కయు, సుధాపాతములు (సుందరప్రవాహములు) ఆర్చుకొన్నవి = ఆడించుకొన్నవి. అమృత= అందమైనది; విః. శబ్దరత్నాకరము. ఇట్లాగనే * భట్టనారాయణుడు వేణీసంహారంలో 'హస్త' శబ్దం కరస్ఫూర్తితో కిరణార్థంలో వాడాడు. ఆడు, ఓడు, కూడు ల ఇంచుక్చకారానికి 'ఆర్చు' అనే మార్పు వస్తుంది. ఈయర్థమును సుధాపాతములు స్ఫురింపజేస్తాయి ప్రాకరణికంగా. విమర్శకుడు ఇందలి ద్వంద్వ

సమాసమును గమనింపక, 'ఆర్చు' ప్రౌఢ ప్రయోగమును గుర్తింపక, సుధాలాక్షణికార్థం తెలియక పొరపడ్డాడు.

౬. "ఉమామహేశ్వర విచిత్రపదాంకిత పుణ్యమేదినీ" "ఇందలి విచిత్రపదమున కర్థపుష్టి యక్కరలేదు కాబోలు! ఇది యనర్థపదము" అన్నాడు విమర్శకుడు. ఉమామహేశ్వరపాదాలలో ఒకదానికి పారాణిపూత (అలక్తకరసం) ఉంటుంది. రెండవదానికుండదు. ఈపాద విన్యాసాలముద్రలు చాలావిచిత్రంగా ఉంటాయి. ఇందలివిచిత్రత యిట్టిది. ఇంతమాత్రం తెలియక కావ్యాలమీద కలంనూరడం నిజంగా తెనుగు భాష దురదృష్టం.

౭. "నవనవేందీవరార్ద్రహృదయ సుకుమార నేత్రాల కొదిగినాడు." "ఇందులో భావము శూన్యమైనది. అనన్వితార్థపదసంఘటన మిందు ప్రవేశించినది." అని ఒక ఆక్షేపణ.

ఒకవిద్యార్థి అపుడే గురువుగారిదగ్గర మేఘసందేశం ప్రారంభించి "కశ్చిత్కాంతా" అని చదివి "అట్టె అట్టె కాళిదాసు ఇక్కడ బోల్తావేశాడు. 'కాచిత్కాంతా' అనవద్దా గురువుగారూ!" అని తన విమర్శనప్రతిభ వెలిగించాడట. అట్లావుంది మన విమర్శకులవారి విచికిత్స.

నవనవేందీవరార్ద్ర హృదయములవంటి సుకుమారనేత్రాలు అని ఇక్కడ అర్థం. ఉపమాన పూర్వపదకర్మధారయసమాసం. కలువపూవుల తేనెచే తడిసిన నల్లని మెత్తని లోపలిభాగాలకూ కన్నీళ్లచే తడిసిన నల్లని సుకుమారస్త్రీనేత్రాలకూ ఇక్కడ ఉపమానోపమేయభావం విమర్శకుడు గ్రహించునది.

౮. ఈ క్రిందివానిలో బాదము లతుకుటలేదట.

చైత్రమధుయామినీ-చంద్రికా హృదయాన పీవలపురగులునో-ఈ పూతనీ మోత. ఇందులో ప్రతిపాదం ౧౦ మాత్రలతో నడుస్తుంది. మాత్రల హెచ్చుతగ్గులు వస్తేగాని పాదం కుంటదు. ఇందు ఆక్షిప్తపాదానికిగూడ పైమూడు పాదాలవలెనే ౧౦ మాత్రలూ ఉన్నవి. ఇక యిదియెట్లా 'త్రిశంకునిలాగ పైకిగెంటినను కిందికే పడిపోవుచున్న'దో విమర్శకునికే తెలియాలి. విమర్శకుడు ఛందస్సైనా తెలియకుండా ఆక్షేపణలకు దిగరాదు.

౯. నేను వకుళమాలాపరిశీలనలో "నందనానందకుంద మరందలవము"లోని కుంద విశేషణానందం మరందానికి అప్రయోజకం కనక ఆక్షేపించాను. ఇక తెనుగువీణలోని "పాలసంద్రపుతళుకు హాలాహలపు బెళుకు" కన్నులకు ప్రయోజకాలు. ఈ రెండిటివల్లా కన్నులయొక్క నలుపుతెలుపుల నైగనిగ్యం చెప్పబడుతుంది. పాలసంద్రపు మెరుగు, హాలాహలపు మెరుగు అని ఒకేమాట రెండుసార్లు వాడడం యిష్టంలేక ఒకే అర్థంగల్గిన రెండుమాటలు వాడాను. ఈయనకు నా విమర్శను అనుకరించడమే తెలుసుగాని, నా ఆక్షేపణలోని సత్తువ తెలియదు.

౧౦. కవి ఉపజ్ఞను కబళించనంతవరకు అనుకరణం కావ్యానికి శోభాధాయకమే అవుతుంది. పూర్వపూర్వకవుల ఉత్తమరచనాచ్ఛాయలు ఉత్తరోత్తర కవుల కావ్యాలలో ప్రతిబింబించడం కవికులమర్యాద. అయితే నిజమైనకవి తనకునచ్చిన పరకవిభావములను, పదములను తనఊహలకు మెరుగుగామాత్రమే తెచ్చి తనస్వాతంత్ర్యమును ముద్రకొడుతూనే కావ్యాన్ని దిద్దుకుంటాడు. ఇది కవిసామాన్యమైన అనుకరణం. కవ్యాభాసుడు పరపదభావములకు దాసుడై సరాసరి వాటినే యథాపదముగా వాడుకొని తనకావ్యాన్ని వికృతపరచుకుంటాడు. ఇది పారతంత్ర్యం. దిజ్నాగుని ఎన్నో భావాలకు భవభూతి మెరుగుపెట్టి తీసుకుని ఉత్తరరామచరిత్రను ఉజ్జ్వలవంతం చేశాడు. శ్రీనాథాదుల భావాలను పెద్దనాదులు వేలకొలది అనుకరించారు. నేను వకుళమాలలోని పారతంత్ర్యాన్ని నిరసించినమాట నిజం. అయితే అందులో నేనుచూపినవి తక్కవి యథాపదముగాను, ఛాయలుగాను పరకవులకు వశుడై వేసినవి చూసాను. అందు చౌర్యప్రసక్తి లేనేలేదు. వకుళమాలాపారతంత్ర్యం ఇట్టిది—

౧. ఆసకొసల జారిపడిన స్వప్నాల—వకుళ.
నీలికొనల జారిపడినస్వప్నమ్ము—ఊర్వసి.

౨. నాగది నలంకరించుకొన్నాను నేను
నేనె వెన్నెల వెల్లవేయించినాను — వకుళ.

నామరణశయ్య పరచుకొన్నాను నేను
నేను నాకు వీడ్కోలుపు విన్పించినాను-ప్రవాసము.

తెనుగువీణలో పారతంత్ర్యం చూపదలచి విమర్శకుడు నేను సర్వథాగర్హించిన వకుళమాలకు పరతంత్రుడ నయ్యానంటాడు. అనుకార్యాని మీద ఆదరం ఉంటేగాని అనుకరణం యెంతమాత్రమూ రాదు. ఇది, చదివిన సంస్కారమాత్రంచేత రావచ్చు ననడం తప్పు. రసానందలబ్ధితో చదివిన పుస్తకాంశాలే సంస్కారమాత్రంగా తలలో ఉంటాయి. తదితరవిషయాలు ఎప్పటికప్పుడే పోతాయి. అదీగాక ఏ ఒకటి రెండు మాటలకో ముడిపెట్టి వకుళమాలానుకరణం అన్నభాగాలను అనుకరణతత్వం తెలియమిగా జమకట్టుకొని ఇతరకవుల ఛాయ లన్నవాటికి జవాబు వ్రాస్తాను. "నాకొఱకు చెమ్మగిలునయనమ్ము లేదు" కృష్ణశాస్త్రి. "ఎద రగిలించి పాడిన నభోవిహగీతికి ఒక్క అశ్రువే వసలరు సుమ్కమానవులు." తెలుగువీణ. కృష్ణశాస్త్రిగారి పద్యంలో నామరణమునకు ఏడ్చేకన్ను లేదనిఉంటే నా పద్యంలో హంస తాను తీవ్రానుభవంతో పాడిన వర్షాకాలపు గీతాలకు ఏసుమ్కమానవుడూ ఒక కన్నీటిబొట్టు అయినా రాల్చలేదు. కనుక ఈసుమ్కమానవులున్నప్రదేశాలు వదలి కైలాసం పోదామంటుంది, తోడియంచతో. ఇందు కృష్ణశాస్త్రిగారి 'పద్యచ్ఛాయ లీలగా నాఊహను రేగించి మెరుగిచ్చింది గాని వకుళమాలనువలె నన్ను వశంచేసుకోలేదు. ఇది సహృదయతకొద్దీ విమర్శకుడు బోధపరచుకోవాలి.

"ప్రొద్దుపొడుపు నోములు నోమబూనినావొ చిట్టి బొట్టుకుంకుమబెట్టు చిన్నదాన" రాయప్రోలు. "చిట్టిబొట్టూ పెట్టడానికి వెళ్లవా- ఏతగని నోములు నోచమన్నా—" తెనుగువీణ. ఇందులో యేమిఅనుకరణం ఉన్నది? నారచన అంతాకొత్తది వైతాళికులలో ప్రచురితమయ్యేదాకా రాయప్రోలువారిపద్యం నేను చూడనేలేదు. ఐతే చిట్టిబొట్టువిషయం తీసుకోవడమే పారతంత్ర్యం అంటారా? భారతంలో వర్ణించిన శకుంతలకథనే కాళిదాసు నాటకంవ్రాశాడు. నన్నయభట్టుమొదలు నావరకూ వచ్చిన తెలుగులిపిలో నేను కావ్యంవ్రాయడమే పారతంత్ర్యమేమో? ఆహా? విమర్శఅంటే యిట్లాఉండాలి. ఇక ఇదేవరసలో నిస్సారంగాఉన్న మిగిలిన పారతంత్ర్యాక్షేపణలకు జవాబు వ్రాయ నవసరంలేదు.

౧౧. "ఈకొత్తమేఘాల చలువపందిళ్లలో" అంటే, వర్షాకాలంలో చలువపందిళ్లా అని విమర్శకు శంక. మేఘాలయొక్క అని యిక్కడఅర్థం. వర్షమేఘాలు ఆకాశంనిండా కమ్ముకొనగా చలువపందిళ్లు వేసినట్లు ఉందని తాత్పర్యం. బాలుడైనా ఊహించుకోవచ్చు.

౧౨. "కలుషహృదయాల గర్వాలకాంక్షితాల నిత్యకోలాహల—" అనుత్థితాకాంక్షాస్థలమైనను ఏకదేశాన్వయం ఉండవచ్చు. "వారి యస్మదీయోరుచమూసమూహములు" హరివంశము.

౧౩. "ఏసురపొన్నపూల హసియించిన మార్గశిరప్రభాతముల్—ఆ శుభవేళకాదిది" ఇక్కడియచ్ఛబ్దాన్ని సురపొన్నపూలతో అన్వయించి విమర్శకుడు అక్కడ అచ్చుపొరపాటునపడ్డ 'కామా' (,) వల్ల పొరపడ్డాడు. యచ్ఛబ్దమును ప్రభాతములతో అన్వయించాలి. ఈరహస్యం 'బాగుగా జదువుకొన్న' తెనుగువీణ కవికి తెలుసు.

౧౪. "విమలశారదశుభ్ర" పునరుక్తివంటిదికాదు; స్వచ్ఛము, శ్వేతము అనే విభిన్నార్థాలు ఈ రెండిటికీ ఉన్నాయి. శరత్కాముది స్వచ్ఛశ్వేతత్వం చెప్పడానికి ఈరెండూ కావాలి.

౧౫. "౧. ఆకలిచిచ్చు కన్నీరు. ౨. క్రొంజెమట నెత్తురుబొట్టు. ౩. క్రాగినమంట నిట్టూర్పు. ౪. నవయావన తీవ్రవేళలు. ౫. సుదూరభారము." 'పై

పదసంఘటనములోని యర్థము ఏ ద్రావిడ ప్రాణాయామముచేత సిద్ధించునో అని విమర్శకుని ఎత్తిపొడుపు. వీటి అర్థం ఆరామద్రావిడ ప్రాణాయామం చేతనే సిద్ధిస్తుంది. ఆకలిచిచ్చూ, కన్నీరూ అని వేరు వేరు పదాలివి. ఇట్లాగే రెండుమూడిటివానియర్థం. ౪. నవ యౌవనముయొక్క పొగరువేళలు అని యర్థం. ౫. మారాభారం అనేవాడుకను గ్రాంధికించి 'సు' ఎక్కువకోసం వేయబడ్డది "సుమారంగంతుమధ్యానం" ఒక సంస్కృతకవి.

౧౬. "అనుభవాఘట్టనాన్ని" అని తెనుగువీణలో ఉన్నమాటను "ఆ ఘట్టాన్ని" అని చదివిచేసిన కుశంకను గర్హిస్తున్నాను.

౧౭. "రెక్క రెక్క కదియించి చరింప(?)రాజహంసమా" ఇక్కడ అచ్చులో 'క' అంటలేదు. ఇట్టివి వీరివిమర్శలో ఎన్నో ఉన్నవి, ఉన్న అక్షరాన్నే సరిగా చదవలేనివారు లేనిఅక్షరాన్ని ఎట్లాఊహించుకోగలరు? నేను ఎక్కడా గణభంగం చెయ్యలేదు. కనక ఇక్కడ గణభంగం నా ఉద్దిష్టంకాదు. అయితే ఒకచోట గణభంగం తెనుగువీణఅచ్చులో దొర్లింది. విమర్శకునికది అననేలేదు వ్రాతప్రతిలో దానిని జరూపం ఉన్నదిలెండి.

ఇప్పటికి చాలామట్టుకు తెనుగువీణ.గీతికామూర్ఛనలోని అపస్వరాలను ప్రాజ్ఞలోకానికి విశదపరచడం అయింది. నిజానికి ఈ నిలవనిశంకలకు జవాబివ్వవలసినంత అవసరంలేదు కాని, నన్ను మిత్రుడుగా పరిగణించిన గణపతి శాస్త్రులుగారికి ఒకగుణపాఠంనేర్ప దలచి ఈ జవాబువ్రాశాను. ఎప్పుడూ సదసద్వ్యక్తికి హేతువులను విజ్ఞులుండగా వట్టివాదోపవాదాలు పెంచడం పనిచేటు. వ్యక్తిగతరాగద్వేషాలతో చేసిన అవహేళనములు నిలవకపోవడమేకాకుండా "నెక్కిరింపబోయి బోల్తాపడుట" అన్నట్టు నవ్వులపాలౌతాయి కనుక గణపతి శాస్త్రిలుగారు ఈపై నిట్టి అవహేళనాలు ప్రకటించి సారస్వతప్రపంచాన్ని కలవర పెట్టడం కంటె ఉదారబుద్ధితో ఉన్నతసమీక్షలు వ్రాస్తే బాగుంటుందని నాసలహా.



## 1885 జాతీయమహా సభాధ్యక్షులు 1934



సర్ ఎస్. పి. సిన్హా
బొంబాయి : 1915



అంబికాచరణ మజుందారు
లక్నో : 1916



డా. అనిబిసెంటు
కలకత్తా : 1917



సయ్యద్ హాసన్ ఇమాం
బొంబాయి (ప్రత్యేక): 1918



పండిత మోతిలాల్ నెహ్రూ

అమృతసరము : 1919—కలకత్తా : 1928.



లాలా లజపతిరాయి

కలకత్తా (ప్రత్యేక) : 1920



సి. విజయరాఘవాచారి

నాగపూరు: 1920



హకీమ్ అజ్మల్ ఖాన్

అహమ్మదాబాదు : 1921

# భావకవిత్వము

భారతుల పున్నయ్యశాస్త్రి

'భావకవిత్వము' అనుపదము శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారిచే ప్రప్రథమమున వాడబడినదని శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రాజమహేంద్రవరమున జరిగిన ద్వితీయ అభినవాంధ్ర కవిపండిత సమావేశమున నుడివియున్నారు. ఆసమావేశమున నే మాట్లాడుచు శ్రీశివశంకరశాస్త్రిగారు 'ఆత్మగౌరవము' అను పదమునందువలెనే 'భావకవిత్వము' అనుపదమునందును తమకు అభిమానము లేదనియు, ఆ పదమును యీనాటి కవితకు వాడరాదనియు చెప్పియున్నారు. కాని ఆపదము సర్వసాధారణముగా యీనాటికవిత్వమునకు వాడబడుచునే యున్నది. ఈపదమునుగూర్చి కొంచెముగ విచారింతము.

భావకవిత్వమనుదానిని శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారే ప్రారంభించిరి. అయ్యది శ్రీకృష్ణశాస్త్రిగారియందు పరమావధిని గాంచినదని చెప్పవచ్చును. వారి యనుయాయులును ఇప్పుడు పెక్కండ్రుగలరు. మొత్తముమీద భావకవిత్వము ప్రజాభిమతపాత్ర మైనదనియే చెప్పవచ్చును. కాని కొంతమంది దీనిని యేవగించుకొనుచున్నారు. ఇందులకు ఒకటి రెండు కారణములు గలవు. మొదటిది అర్థములేని పదాడంబరము ఎక్కువగానుండుట. రెండవది ఏవిధమైనసందర్భము తెలియబరచకుండ అనిర్దిష్టమైన యేదియో భావమును విషయముగా జేసుకొని చెప్పుట. ఈ రెండుకారణములలో మొదటిదానివలన పండితులైనవారలకు భావకవిత్వమునం దనిష్టత కలిగినది. రెండవకారణమువలన జనసామాన్యమునకు భావకవిత్వమును అర్థము చేసికొనుట కష్టమై దానిపై అనిష్టత యేర్పడినది. పాశ్చాత్యుల Lyric poetry ని అనుసరించి భావకవిత్వము పుట్టినదని తజ్జ్ఞులు నుడువుచున్నారు. కాని 'యీనాటికవిత్వమును భావకవిత్వ మనుచున్నారే, తిక్కనాదులు చెప్పినకవిత్వమునందు భావము లేదా ? భావము లేని కవిత్వ ముండునా ? కావున 'భావకవిత్వము' అను పదమునందే అర్థము లేదు. అది యొకవేళాకోళపు మాట' అనికొందరనుచున్నారు. కాని యీ మాట నిజముగాదు. భావములేని కవిత్వము ఉన్నది గావుననే భావముగల యీ నాటికవితను 'భావకవిత్వ' మని యనుచున్నారు. తిక్కన కవిబ్రహ్మగనుక ఆయన చెప్పిన ప్రతిపద్యమునందును భావము ఉన్నదను కొనుట గొప్పపొరబాటు. అసలు ఈసందర్భమున 'భావము' అను పదమునుగూర్చి విచారింపవలసి యున్నది. మామూలుగా పద్యములయందు 'భావము' అనగా అభి

ప్రాయమని అర్థము. అనగా ఒకకథాసందర్భములో చెప్పబడినపద్యమునకు భావమేమి అని ప్రశ్నించుకొనినచో ఆసందర్భమున ఆ పద్యమునకుగలస్థానము మనకు సమాధాన మగును. 'భావకవిత్వము' అనుపదమునందలి 'భావము' అనుపదమునకు అర్థము 'అభిప్రాయము' అనికాదు. రసమునకు అంగమైనభావము అనిఅర్థము. రసములుతొమ్మిది. ప్రతిరసమును స్థాయిత్వమును పొందవలెనన్నచో విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములు అంగములుగా ఆయాసందర్భములలో వర్ణింపబడవలెను. అప్పుడు అవి యన్నియు ఆసీయమానస్వాదువులై యేరసమునకు అంగములుగా వర్ణింపబడినవో దానికి స్థాయిత్వమును సిద్ధింపజేయును. ఇట్లు విభావాదిభావములు సమగ్రముగా వర్ణించబడిన కృతి అఖండకృతి (ప్రబంధము) యనిపించుకొనును. అట్లుగాక రసమునకు అంగములైన భావములలో ఏయొక్కదానినో వర్ణించి అది యేరసమునకు యేభావమో చెప్పబడక, స్వభావముమాత్రము వర్ణింపబడి అంతటితో వదలివేయబడినచో స్థాయిత్వమునుచెందక భావప్రధానమైన యారచన ఖండకృతియను పేరుతో భావకవిత్వముగా పరిగణింపబడుచున్నది. దీనినిబట్టి చూడ పూర్వులకవితను రసకవిత్వమనియు, యీ నాటికవిత్వమును భావకవిత్వమనియు చెప్పనొప్పునని తేలుచున్నది.

యువకవులు భావప్రధానములైన తమ రచనలను అర్థవత్తులైన పదప్రయోగములతో సార్థకములుగ నొనర్చి, అభివృద్ధికి తీసుకొని రాగలందులకు కోరుచున్నాను.



# అమరత్వము *

వేలూరి శివరామశాస్త్రి

౧

నేలపయిన్ నిరంతరము నింగి చెలంగుచునుండు దానిపై
'ఓలెలుపాంతి' నాఁబడుచు నుండును స్వర్గపురంబు దానిలో
'ఓలెబిస' న్నపేరఁ బురుషోత్తముఁ డుండు ననంతకోటిలో
కాలకు నెల్ల హర్తయును గర్తయు భర్తయు నొక్కతానయై.

ఓలెలుపాంతిలోన కొలువుండిన యోలెబి నొక్కనాఁడు భూ
గోళమువంకఁ జూచె నట గోచరమాయె మహాసముద్రముల్
శైలములున్ సరస్సులును సాంద్రవనంబులు సూర్యచంద్రులున్
నీలనభోంతరాళములు నిర్ఝరముల్ మొదలైన వన్నియున్.

ఈ చెలువంబు నీసొగసు నీనెఱిచక్కఁదనంబు నెక్కడం
జూచిన చంద మెంతయును శూన్యము సృష్టికి విత్తు దీనిలో
వైచుట యొప్పు నంచు భగవానుఁడు చయ్యనఁ బల్కె నంత న
వ్వాచవిలోనె పుట్టుకొనివచ్చెను నెక్కడలేనిజీవముల్.

ఓలెబి నల్లజీవులను నోలగమందులఁ జూచి మీ రిదే
నేలకుఁ బొండు! మీ కచట నీటిని నిచ్చితి నేల నిచ్చితిం
బాల నొసంగితిన్ మఱియుఁ బండ్ల నొసంగితి మీరలందఱున్
వీళులు గట్టుకొం చనుభవింపుఁడు సౌఖ్యము లం చనెన్ వెసన్.

జేయని జీవజాలములు శీఘ్రతరంబుగ నేలమీఁదికిం
బోయియు వేరువెల్లఁకులుఁ బూవులుఁ బూపలుఁ గందమూలముల్
కాయఁగసుళ్లొగిం దినుటకాక యొకళ్ల నొకళ్లు కిన్కమై
డాయుచుఁ బీఁకికోఁ దినఁదొడంగి రడంగిరి కొంద ఱిట్టులన్.

కప్పను బాము మ్రింగె భుజగంబును బైకొని దుప్పి మ్రింగె నా
దుప్పిని దూలుఁబట్టుకొని తోడనె సింగము మ్రింగె నిట్టులన్

* ఇది రెడ్ ఇండియనుల ఉపనిషత్తు.

ముప్పును గూడఁబెట్టుకొని పుట్టుచు గిట్టుచు మానసంబులన్
దొప్పలతోడ సౌఖ్యమును దుఃఖముఁ గ్రోలె సమస్తజీవముల్.
అన్నిటికన్న మానవునియాతన మిక్కుటమాయెఁ బాములా!
కన్నను గాటువేసెఁ, బలుగాకులు బెబ్బులులా! యొకింత యా
కొన్నను మ్రింగివైచెఁ, గొనకున్ మశకంబులుఁ జీమ లీఁగలున్
మున్నుగ నెన్నియో నరుల మున్కొని కుట్టెను నెత్తు రోడఁగన్.

౨

ఏదేవుం డలస్వర్గలోకమును బైనీభూమి సృష్టించెనో
యాదేవుం డిలఁ బాఱఁజూచె నొకపర్యాయంబు తన్మాత్రలో
భూదేవీవదనారవింద మఖిలంబున్ డంబు గోల్పోయిన
ట్లై దృగ్గోచర మైన నేమి యిదియం చాతండు చింతించుచున్.

ఏలా జీవములందుఁ గొన్ని మెఱుఁగై యింకొన్ని దీనంబులై
యీలా గున్నవి? వీనిలోన నరు లేరీ? యొక్కఁడుం గానఁగా
రాలేదే? యలవా రెవారు? నరులే! రామయ్యతండ్రీ! యిటుల్
పీలైపోయి రిదేమి యంచు నెదలో వీక్షించి యేకాగ్రుఁడై.

ఆహా జీవము లింతవట్టు తమలో నన్యోన్యసౌదర్యమున్
స్నేహంబున్ విడనాడి చంపుకొననే? నిర్భాగ్యముల్ జంతువుల్
స్వాహాసేయనె శక్తిలేని నరులన్? చాల్ జాలుఁ గ్రౌర్యం బటం
చూహించెన్ నరునిన్ మనస్విగను నత్యూర్జస్విగం జేయఁగన్.

కుమ్మం గొమ్ములు లేవు కాటుగొనఁగాఁ గోరల్ దగన్ లేవు పై
హుమ్మంచుం బడి గీఱ గోరులును లే వొక్కుమ్మడిం బీఁక దం
తమ్ముల్ లే విఁకఁ గుట్టఁ గొండియయినం దాలే దహో వట్టి ద
ద్దమ్మం జేసియ వీడితిన్ నరుని నన్యాయ్యంబుగా నక్కటా!

ఇమ్మైనున్నను మించిపోయినది లేదింతేనియున్ వీరికిన్
గొమ్ముల్ గోరలు గోళ్లు దంతములునుం గొండుల్ మఱొండుల్ గడున్
వమ్మైపోవును గొంతకాలమున కావైయర్థ్యమే లేని యం
త్రమ్మొం డిచ్చెద నంచు బుద్ధిని దయాధాముం డొసంగెన్ దగన్.

ఇమ్మై బుద్ధిని బొంది మానవుఁడు తా నేపారి దంతమ్ములన్
గొమ్ముల్ గోరలు గోళ్లుఁ గొండులును జేకోలేని సామర్థ్యమున్
సమ్మోదంబును జాలఁ బూని జలభూసామ్రాజ్యసంస్థాపనా
సమ్మానంబునయందు నన్నిటికి నాచార్యత్వము౦ గైకొనెన్.

౩

'ఈలోప' మిటులు తొలఁగి నరాళికి సుఖముం బ్రభుత్వ మబ్బెంగానీ
భూలోక మెంత కేనియు - నోవెలుపాంతియె?' యటంచు నోలెబి సెంచెన్.
'భూలోకంబున జీవులు - కాలక్రమమునను ముదిమిఁ గైకొని యెపుడే
నీలుగుచున్నా రం'చును - నోలెబిసుల్లం బదెల్ల నుల్లల నుడికెన్.
సురలోకశిల్పులును సోదరులు హుసేదేవతలకుఁ దత్క్షణమే యు
త్తరువాయె వెంటనే వారిరువురునున్ వచ్చి ప్రాలి రెంతయు భక్తిన్.
"భూలోకమందునుండియు - నీలోకమువఱకు మెట్ల నేర్పఱపుఁడి! పా
ర్శ్వాలను జెట్టులు జేమలు - నీళులు సస్యములు చాల నిర్మింపుండీ!
మీ విరచితమగు మెట్టుల - త్రోవంబడి స్వర్గమునకుఁ దోతెంచి పునర్
భూవాస మరుగువారికిఁ - జావనునది లేదటంచుఁ జాటింపుండీ!
షాం డీక మీపని మీరొ చే - యుం డద్ది ముగింపకుండ నోగినన్ గనరా
కుండుండు మీకు మేలగు - చుండుత మెల్లపు" డటంచు నోలెబి సనియెన్.

౪

చూడఁగఁజూడ నాళ్లు చనఁజొచ్చె నెలల్ గతియించె నొండురెం
డేఁడులు దాఁటె నంతటను నీశ్వరుఁ డల్ల హుసేనగర్భ్యు లీ
నాఁ డిదె వత్తు రీదినమునం జనుదెంతురు నేఁడు తప్ప దీ
నాఁడు ధ్రువం బటంచును మనంబున నెంచుచునుండె నెంతయున్.
ఎన్నిదినంబు లేఁగినను నిర్వురుసోదరులందు నొక్కఁడై
న న్నయనాభిరామముగ నాకుఁ గనంబడఁ డింత కొక్కమె
ట్టన్నను గానఁబట్ట దిది యంతయుఁ జూచిన వింతవుట్టెన
న్నన్న యిదేమి పాపమని యాతఁడు వేచెను గొన్నియేం డ్లిటుల్.

కాలము మెల్లమెల్లఁగను గట్టలు దాఁటుచునుండె నౌర యి
య్యోలెలుపాంతిలోనికిని నొయ్యన చేరెడిమాట మాని దా
దాలనునేని నొక్కటియుఁ దాప కనంబడ దీ హుసేసురల్
ప్రోలికి రారు వీరికరపుష్టియుఁ గౌశల మిట్లడంగెనే!
కా దిది కాదు వీరికరకౌశలమున్ గరలాఘవంబునున్
బోదు మఱేదియో యొక యపూర్వపు విఘ్నమువచ్చి వీరిలో
వాదము పెట్టెనో పనికి భంగము తెచ్చెనొ యం చెరఁగ విసం
వాదముచెంది యోలెబిసు వారలఁ బిల్వఁగఁబంచె ప్రేల్మిడిన్.

౫

తాపిం జేతను బూని నెమ్మొయిపయిం దా రేశముద్రాతతుల్
దీపారంగ హుసేసురల్ వడిగ నద్దేవాదిదేవుఁ దయా
రూపుం జేటె విరక్తి వ్యక్తపడ వైరూప్యంబుగాఁ జూచి యీ
సోపానంబులు కావు మావలన నంచుం బల్కి రొక్కుమ్మడిన్.
'లేదా మీతొలికౌశలంబు? మఱియుఁ లేదా పురాపుష్టియుఁ?
లేదా తొల్లిటి హస్తవేగ మ'నుచుఁ దేవుండు ప్రశ్నింపఁగాఁ
గాదండీ యది, మేఘమండలముదాఁకన్ మెట్టుగిం గట్టుటల్
సేదిత్తాఖ్యుఁడు మానవుండొకఁడు చేసెం తం బడంగొట్టుటల్.
ఏనాఁ డెంతపనిం బొనర్చెదమొ బి ట్టేక్షించి సేదిత్తు తా
నానాఁ డంతపనిం బొకాలఁగను జేయుం బంతమున్ బట్టినాఁ
డీనాఁ డిప్పుడు మేఘమండలమునం దీమెట్టు లిట్లుండెనా
భానుం డస్తమునొంద నుండదొక సోపానంబు రూపానకున్.
ఈదుర్మార్గుని శిక్షసేయుఁడను చెంతేసిన హుసేదేవతల్
ఖేదం బొప్పఁగఁ బల్కి నీశుఁడు కృపాకృష్టాంతరంగంబుతో
'సేదిత్తా యల మానవోత్తముఁడు! తా సేదిత్తుసేదిత్తొకో!
సేదిత్తుం బిలువుం డ'టంచుఁ బలికెం జిత్తంబు హర్షించుచున్.

౬

ఉత్తరువొంది యిట్టులను నోలెలుపాంతికి వేగ వచ్చి సే
దిత్తల యీశ్వరేశ్వరుని దేటి కనుంగొని మోకరిల్లి చే

కత్తిని దేవుడాల నిడి గడ్డముక్రిందను గట్టమోపి తాఁ
జిత్తరువో యనన్ నిలిచెఁ జిత్తము భక్తిని బల్లవింపఁగన్.

ఓలెబి సాతనిం గనుచు నో నరుఁడా! నరు లుండునేల నీ
యోలెలుపాంతితోఁ గలుపనుండెడు తాపలఁ దేపతేపకుం
గూలఁగఁజేయఁ బంతమునకున్ దిగి తేల యటన్న వాఁడు నేఁ
గూలఁగఁద్రోయకున్న నొనఁగూడునె చావది భూమిలో ననెన్.

మిత్తి భయంకరాకృతిని మీఁదికి దూఁకుచునున్న వేళ సం
విత్తు నశించి వాయువులు వీడ్కొనఁబోయెడువేళ నీ కెవర్
వత్తురు సాయ మప్పు డమరత్వముతోఁ బనిలేదె నీకుఁ? బ్ర
త్యుత్తర మిమ్మటంచుఁ గరుణోత్తరుఁ డోలెబి సాచి పల్కెన్.

చిత్తమునందు భక్తి విలసిల్లఁగ భీతి యొకింత లేక నే
ది త్తమరత్వమా వలదు దేవర మాకది వద్దు వద్దహో
మిత్తియె లేనిచో బ్రదిమిమీఁద విమోహ మదేడ? జీవికే
యుత్తలపాటుకూర్చెడు వియోగమువల్లనె వెట్టిప్రేమముల్.

ప్రతిరేయియందులఁ బడయఁజాలమిఁగదా యిందుబింబమునందు నింతప్రీతి
ఆఱుఁగాలములందు నందఁజాలమిఁగదా యేటినీళులయందు నింతసక్తి
అన్నిలోహములయ ట్లబ్బకుండమిఁగదా హేమంబునందుల నింతవిలువ
కాఱుగాఱునయందుఁ గాయకుండమిఁగదా యీమామిడులయందు నింతకూర్మి
చూచిన మొగంబునేచూడఁజొరఁగవిసువు-త్రావినమృతమెమఱిత్రావఁదడనఁజేఁ
ఎందులకుమాకు నమరత్వ మీడికగను*-బ్రాఁతగిల్లిన సకలంబు రోఁతగాదె.[దు

అమరత్వంబు లగించితేనియును ప్రేమాకర్షణం బుండునే?
రమణుల్ భర్తల కార్తురే? శిశువులన్ రమ్మంచుఁ దామమ్మకే
చుమి పెల్లేత్తురె? వీరె యిట్లయినచోఁ జుట్టాలమా కేలకో
యమరత్వం బిది జాడ్య మిద్ది వలదయ్యా వద్దు వద్దం చనెన్.

ఉత్తర మిట్లు వచ్చినను నోలెబి సంతటఁ గొంతసేపు తా
వృత్తినిరోధమున్ సలిపి పిమ్మటఁ జల్లఁగ నిట్లు పల్కె 'నే

---

* అతిదీర్ఘే జీవితే కో రమేత? [కఠ. ౧. ౨౮.]

దిత్త! నిజం బహో బ్రతుకుతీపియ తప్పదయేని చావుతోఁ
బొత్తునుగాక తప్పదిఁకఁ బొమ్మొగి నీదగు ప్రేమభూమికిన్.

౭

నాఁటఁగోలె నల్ల నాకసోపానముల్ - కట్టఁబడినవట్టు నట్టె యుండె
సిద్ధవాణియైన నేదిత్తు ధర్మాన - మర్త్యు లమరులుగను మాఱరైరి.
ఎవ్వఁడేని సరియఁ యే డహోరాత్రమ్ము - లుత్తరాశఁబట్టి యూర కేఁగు
మెట్లువాఁడు సూచు మేఘరాజ్యమునంధె - యాఁగె నవ్వి స్వర్గ మరుగ లేదు.
చెల్లిపోయినట్టి నేదిత్తు మూర్ఖుఁడో - పండితుండొ యెవరు పల్కఁగలరు?
వాదులాడినట్టి నేదిత్తు మేల్ సేసెఁ - గీడు సేసె నెవ్వ రాడఁగలరు?

---



సరోజినిదేవి
కాన్ పూ॥ : 1925



ఎస్. శ్రీనివాస అయ్యంగారు
గౌహతీ : 1926



డా. అన్సారీ
మద్రాసు : 1927



పండిత జవహరలాల్ నెహ్రూ
లాహోరు : 1929

## 1885 జాతీయమహాసభాధ్యక్షులు 1934



సి. ఆర్. దాసు
గయ : 1922



అబ్దుల్ కలామ్ అజద్
ఢిల్లీ (ప్రత్యేక): 1923



మహమ్మదాలీ
కాకినాడ : 1923



మహాత్మా గాంధీ
బెల్గాం : 1924

౧. అమృతనాథుఁడు:

ఈ తెలుఁగుకవి రచియించిన గ్రంథములు చిక్కుటలేదు. ఈతఁడు మైలము భీమనఁగూర్చి చెప్పినపద్య మొక్కటి కాచన బసవన తనకవిసర్పగారుడమున నుదాహరించి నాఁడు. పేరునుబట్టిచూడ నీతఁడు జైనుఁడనియు, మైలముభీమన సమకాలికుఁడగుటచే క్రీ. శ. ౧౧౫౦ సంవత్సరప్రాంతము వాఁడనియు నూహించుట కవకాశము గలుగుచున్నది.

౨. క్షేమేంద్రుఁడు:

సంస్కృతవాఙ్మయప్రపంచమున నత్యంతప్రసిద్ధివడసిన క్షేమేంద్రునిపేరున ప్రాచీనాంధ్రవాఙ్మయమున వెలసినకవి. ఈతని నిజనామము లక్ష్మాభట్టనియు క్షేమేంద్రుఁడీతనిబిరుదమనియు సకలనీతిసమ్మతగ్రంథ పీఠిక తెలుపుచున్నది. ఈతఁడు ముద్రామాత్యము, శతపక్షిసంవాదము, శూద్రకరాజచరిత్రము ననుకావ్యముల రచియించెను. మడికిసింగన తన సకలనీతిసమ్మతమునను, తిక్కనసోమయాజి తనకవివాగ్బంధనమునను నీతని ముద్రామాత్య శతపక్షిసంవాదముల నుండి పద్యముల నుదాహరించినారు. కొన్ని సంకలితలక్షణగ్రంథములయందు శూద్రక రాజచరిత్రమునుండి పద్యములు కానఁబడుచున్నవి. నాయొద్దనున్నయొకప్రాచీనసంకలిత లక్షణగ్రంథమున క్షేమేంద్రునిపేరిట నాచన సోముని వసంతవిలాసములోని పద్యములు పేర్కొనఁబడినవి. సంస్కృతకవి క్షేమేంద్రుఁడు క్రీ. శ. ౧౦౬౦ సంవత్సరప్రాంతము వాఁడగుటచే నాంధ్రకవి క్షేమేంద్రుఁడా వెనుకవాఁడై క్రీ. శ. ౧౧౦౦ సంవత్సర ప్రాంతమువాఁడగును.

3. భవదూరుఁడు

ఈతనికృతు లెఱుఁగరావు. విద్యానగర రాజ్యము నేలినప్రథమబుక్కరాయలకొడుకు భవదూరుఁడొకఁడు గలఁడు. ఈతఁడాభవదూరుఁడైనచో క్రీ. శ. ౧౩౬౦ సంవత్సర ప్రాంతమువాఁడగును. ఈతనిపద్యములు సంకలితగ్రంథముల నీతనిపేరనే కానవచ్చుచున్నవి. ప్రాచీనులలో కొంద ఱాంధ్రకవి స్తుతులలో నీతని స్తుతించిరి. (చూడుఁడు మల్హణచరిత్ర నాగరఖండ కవిస్తుతులు.)

౪. వటమూలుఁడు

ఈతఁడు "వటమూలమందిరా" అను మకుటముగల శతకమునకుఁ గర్త. ఇందు కవి తన్ను తానే సంబోధించుకొనినాఁడు.* ఈ సంప్రదాయ మితనితో నారంభమైనట్లు కనఁబడుచున్నది. క్రీ. శ. ౧౫౮౦-వ సంవత్సరమున వెలసిన తురగా రామన, అయ్యంకి బాలసరస్వతి యనుజంటకవులు తమనాగర

ఖండమున నతని స్తుతించినారు. కావున నీతఁ డంతకంటెపూర్వుఁడని చెప్పనొప్పును. ఈతని శతకములోనుండి కొన్ని పద్యములు 'భారతి' యందుఁ బ్రకటింపఁబడినవి. (భారతి, శుక్ల సంవత్సర ఫాల్గునము. మార్చి ౧౯౩౦. ౪౨౦ పుట). ఆపద్యములఁ జూచినచో, వేదాంతవిషయములను, యోగవిషయములను జానుతెనుఁగున నీకవి యెంతయిమిడికగఁ జెప్పఁగలఁడో తెలియఁగలదు.

౫. ఆంధ్రభోజుఁడు

సకలనీతిసమ్మతమున పేర్కొనిన నీతిభూషణమను కావ్యము నీతఁడు రచియించెనని యీగ్రంథపీఠిక తెలుపుచున్నది. లింగమగుంటతిమ్మన తనబాలబోధచ్ఛందమున నీతని నీతిభూషణమునుండి పద్యములఁ బేర్కొనినాఁడు. ఈతఁ డెవ్వరో గుర్తింపఁబడలేదు.

లక్షణదీపిక, కవిసర్పగారుడము, బాలబోధచ్ఛందస్సు, ఆంధ్రప్రయోగరత్నాకరము మున్నగు లక్షణగ్రంథములయందుఁ బేర్కొనినకవులు మన కెఱుకపడనివా రెందఱేనిగలరు. ఈగ్రంథములు ముద్రితములు గాకుండుటచేతను, నాంధ్రకావ్యములయందుగల కవిస్తుతులను నీలక్షణగ్రంథములను సమన్వయము చేయకుండుటచేతను, నాయాకవులఁగూర్చిన విషయములు మనకు దురూహము లగుచున్నవి. లాక్షణికులు ప్రాచీనులు గాకపోయినను వారు పేర్కొనిన గ్రంథములు, కవులు ప్రాచీనులుగాకపోరు. మఱియు నీలక్షణగ్రంథములవలన మన కీవఱ కెఱుకపడియున్న కవులఁగూర్చి కూడ క్రొత్తసంగతులు తెలియుచుండును.



గుత్తికోట దూరదృశ్యము T. K. R.

# విశాఖదత్తుని చంద్రగ్రహణం

శ్రీ న. చ. వరదాచార్యులు

"క్రూరగ్రహస్య కేతు శ్చంద్రమసం పూర్ణమండల
మిదానీమ్;
అభిభవితు మిచ్ఛతి బలాత్—"

ఇది విశాఖదత్తుని ముద్రారాక్షసంలో "ఉద్ఘాత్యకం" అనే ప్రస్తావనాభేదానికి అంగంగావున్న శ్లోకం. తల్లక్షణానుసారంగా యింతవరకూ వున్న యీశ్లోకభాగం నేపథ్యగతుడైన చాణక్యునికి హృదయస్థార్థపరామర్శం చేయడంచేత "ఆః; క ఏష మయి స్థితే" అని నేపథ్యంనుంచే గర్జిస్తాడు. పదపడి సూత్రధారుడు నాట్యోపాయంకూడా "రక్షత్యేనంతు బుధయోగః" అని చదువుతాడు. దీనికి శ్లేషమూలంగా రెండర్థాలు వస్తూవున్నవి. మొదటిఅర్థం నటీసూత్రధారుల ప్రకృతసంభాషణ పర్యవసాయి. రెండవది నాటకీయ కథను పరామర్శించేది. దానిమూలంగానే చాణక్యునికి కోపంవచ్చింది.

నటీసూత్రధారుల సంభాషణలో చంద్రోపరాగం కలుగుతుందని నటి విన్నట్టూ, అది అబద్ధంఅని సూత్రధారుడు నిరసించినట్టూ తేలుతూంది. ఆవిషయాన్నే ప్రతిపక్షోపన్యాసపూర్వకంగా ఖండిస్తున్నాడు యీశ్లోకంతో సూత్రధారుడు. కాబట్టి "కేతువనే క్రూరగ్రహం సంపూర్ణమండలుడైన చంద్రుణ్ని యీరోజు బలాత్కారంగా పరిభవించదలచుకున్నాడు. కాని బుధయోగం అతణ్ని (చంద్రుణ్ని) రక్షిస్తూంది" అని ప్రకృతచంద్రోపరాగపరంగా మొదటిఅర్థం చెప్పుకోవాలి.

ఇంక రెండో అర్థం—"క్రూరం అయిన పట్టుదలగల రాక్షసుడు, మలయకేతువుతోకూడి అసంపూర్ణమండలుడైన చంద్రగుప్తుని బలాత్కారంగా పరిభవింప సమకట్టాడు. కాని చాణక్యపండితుని వుపాయం అతణ్ని రక్షిస్తుంది." అని నాటకీయ కథాపరంగా చెప్పుకోవాలి.

అయితే, చంద్రగహణపరంగా వున్న మొదటి అర్థాన్నిబట్టి ఆరోజు మొత్తంమీద గ్రహణంలేదని స్పష్టంగా వక్తృవుద్దేశమే అని తేలుతూవుంది. కాని, ఆలేకపోవడం బుధయోగం మూలాన్నిగాని లేకుంటే ఆరోజు గ్రహణం పట్టవలసిందే. స్థూలదృష్టితో చూస్తే గ్రహణంపట్టే లక్షణాలన్నీ వున్నాయనిన్నీ తాను చతుష్షష్ట్యంగమైన జ్యోతిశ్శాస్త్రాన్ని పరిశీలించినవాడు గనుక సూక్ష్మదృష్టిని పరామర్శచేయగా నాడు గ్రహణంలేదని గ్రహించకలిగినాననిన్నీ సూత్రధారుడు వుపన్యసించాడు. ఈయభిప్రాయం చంద్రగుప్తునిరాజ్యాంగ వ్యవహారాలనిబట్టి పోల్చిచూస్తే రమణీయంగానే వుంది. జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా విమర్శిస్తే యెంతవరకు సంగతంగా వుంటుందో చూదాం. అసలు గ్రహణం అంటే యేమిటి?

రాహుః కుభామండలగ శ్శశాంకం
శశాంకగ శ్ఛాదయతీనబింబమ్;
తమోమయః శమ్భువర ప్రదానాత్
సర్వాగమానా మవిరుద్ధ మేతత్.
సిద్ధాంత శిరోమణి.

అని సర్వాగమాలకు అవిరుద్ధంగా మనపూర్వులు చెబుతున్నారు. ఇది పాశ్చాత్యసిద్ధాంతుల గమనికకు అనుకూలంగానే వుంది. వారేమంటున్నారు? సూర్యుని కాంతి చంద్రునిమీద పడేదారిలో అడ్డుగా భూగోళం వస్తుంది. గనక ఆకాంతికి అడ్డుతగిలి చంద్రుణ్ణి కొంత భాగమో పూర్తిగానో మూస్తుంది. ఇది చంద్రగ్రహణం. సూర్యగ్రహణంలో సూర్యుణ్ని భూమిమీదికి కనబడనివ్వకుండా చంద్రగోళం మధ్యను అడ్డుగా యేర్పడుతుంది. కాబట్టియే గ్రహణానికైనా యీ మూడుగోళాలు సమరేఖమీదికి వస్తవి. ఇది పాశ్చాత్య సిద్ధాంతం.

మన ప్రాచ్యసిద్ధాంతంలో భూమిని నిర్దేశించే సాధనం రాహుకేతువులే. రాహువువున్న రాశికి సప్త

మంలో కేతువు వుంటాడు యెప్పుడున్నూ. అంటే మన సిద్ధాంతంలో భూమిని స్థిరంగా యెంచుకొని భచక్రం తిరుగుతూంది - అన్నాడు గనుక మధ్యగావున్న భూమియొక్క ఛాయ యిప్పుడు ఫలానా రెండురాసులకూ తగులుతూంది సుమా అని సూచించటానికి రాహుకేతువులను ఒకదానికొకటి యెదురుగా చూపుతుంటారు. అనగా కేతువు వున్న రాశిలోంచి తిన్నగా రాహువువున్న రాశిలోకి చూడవలెనంటే మధ్య భూగోళం అడ్డుగావుండి యివతలినుంచి అవతలికికాంతి ప్రసరించదన్నమాట. కాగా యిపుడు చంద్రగ్రహణం పట్టవలెనంటే సూర్యచంద్రులమధ్య భూమి అడ్డురావాలెగనుక రాహుకేతువు లేరాసులలో వుంటాగో సరిగా వాటిలోనే సూర్యచంద్రులూవుంటే అప్పడే యిద్దరిమధ్య భూమి అడ్డుగా యేర్పడుతుంది. కాబట్టి గ్రహణంనాడు జ్యోతిశ్చక్రంలో సూర్యచంద్రులస్థితి యిలావుంటుంది.




ధనుస్సులో చంద్రకేతువులు, మిథునంలో రవిరాహువులు వుంటారు. అనగా ఒకజంటకు ఒకజంట సప్తమంలో వుంటారన్నమాట.

మన ప్రకృతశ్లోకంలో "చంద్రమసం, పూర్ణమండలమ్" అంటున్నాడుగనుక అది పూర్ణిమ అనిన్నీ, ఆనాడు గ్రహణం పట్టవలసిన కొన్ని లక్షణాలు వుండిన్ని అట్టిది జరగలేదనిన్నీ రాశాడు గనుక నాటిభచక్రంపైన చూపిన మోస్తరుగా వుండవలెను. పైన చూపినరీతి గ్రహచారం వున్నప్పటికీ గ్రహణం పట్టకపోవచ్చునుగాని పట్టినగ్రహణానికిమాత్రం గ్రహగతి ఆరీతిగా వుండితీరవలిసినదే. ఇలా వున్నప్పటికీ గ్రహణం పట్టకపోవడానికి కారణమేమంటే, ఆచంద్రసూర్యులు ఒకరికొకరు కనబడకుండావుండే గడియలు సగలు గడచిపోవడం వల్లగాని అయనభేదాలనిబట్టి మూడుగ్రహాలు సమరేఖకు తారసిల్లక పోవడంవల్లగాని గ్రహణం తప్పిపోవచ్చు, మరి "రక్షత్యేనంతు బుధయోగః" అనే గ్రహణభంగకారణం ఆపాతమధురంగా వుంది. బుధుడు రవిని విడిచి వొకరాశికన్న వెనకముందులలో వుండడు. ఎక్కువభాగం రవితోనే వుంటాడు.— (నేను ప్రాచ్యసిద్ధాంతానుసారమైన గమనికతో రాస్తున్నాను కాబట్టి రవిచరిస్తున్నాడంటే తప్పుగా భావించకండి—) రవి చంద్రునికి సప్తమాన వుంటేగాని పూర్ణిమకాదు. ఇలాంటిస్థితిలో చంద్రునికి బుధునితో యోగంయెట్లా? అసంభవం. ఇది చంద్రగుప్తునిపక్షంలో మాత్రం సుందరంగా వుంటుంది. పోనీ, యోగంఅంటే లాక్షణికంగా సప్తమస్థితివశాన కలిగేదృష్టిమాత్రమే అనుకుందామని సమాధానపడితే, అలాంటి యోగంవల్ల యెన్నడూ గ్రహణం వారించబడి యుండలేదు. ఆలాగని శాస్త్రమూలేదు. ఇక్కడ వ్యాఖ్యాత అయిన ఢుంఢిరాజపండితుడు వ్యాససంహితలోని గర్గవచనమంటూ.

"గ్రహపంచకసంయోగం దృష్ట్వా నగ్రహణం వదేత్,
యది నస్యాన్ బుధ స్తత్ర యుద్ధం దృష్ట్వా గ్రహం వదేత్."

అని ఒకకారికను చూపిస్తున్నాడు. అది యిక్కడ దశదాడి మాదివాక్యంలాగుంది. ఏమంటే బుధుడు చూస్తూవుండగానే పట్టినగ్రహణాలు అనేకంగా వున్నాయి. పాతపంచాంగాలు తీసిచూస్తే యెన్నోవుదాహరణాలు దొరుకుతాయి. మచ్చుకొకటి చూడండి, శ్రీముఖమాఖపూర్ణిమనాడు యిలాంటి గ్రహణం పట్టింది.

కు
కే చం
రా ర శ
బు శు
గు

ఇందులో బుధుడు చంద్రుణ్ని చూస్తున్నాడు. గ్రహపంచక సంయోగమూవుంది. అయినా గ్రహణం పట్టిలేరింది. అనాదీ, అనంతమూ అయిన ఈకాలచక్రం లో యిలాంటి ఉదాహరణాలు అమితంగా దొరుకు తాయి. ఇంతేకాకుండా యీ శ్రీముఖ సంవత్సరం లోనే భాద్రపద శుద్ధ పూర్ణిమనాడు యీకింది మాది రిగా గ్రహగతివుండిన్నీ గ్రహణంపట్టలేదు. కారణం యేమిటి? తిథ్యంతం పగలే సమాప్తి చెందడంవల్లను,

రా చం
శ
కే బు
కు
శు గు

రవి, చంద్ర, ఛాయాగ్రహాలు భమరేఖకు రాకపోవడం వల్లను యీగ్రహణం పట్టలేదు. మరి యీటీథయోగం గ్రహణాన్ని భంగపరచడం అనేది యెలాసమర్థించాలో తెలియడంలేదు.

ఇంక, యీగ్రహణం పట్టదగినట్టుగా తోచిన పూర్ణిమ యేమాసంలోది - అనే విషయం చర్చిస్తాను. మూడోఅంకంలో కౌముదీ మహోత్సవం ప్రకటించ బడటం, దాన్ని చాణక్యుడు నిషేధించడం వగైరాలు జరిగినవి. అందుచేత కౌముదీమహోత్సవం ధర్మశాస్త్రా నుసారంగా ఆశ్వయుజ పూర్ణిమకు జరగాలి గనుక ఆ రోజు ఆశ్వయుజ పూర్ణిమ అని నిర్ణయించుకుంటాం. అయితే మూడోఅంకం పదోశ్లోకం "ధూర్తై రన్వీయ మానాః" అనేదాని వ్యాఖ్యానంలో "పార్వణమితి క్వచిత్ పాఠః; పర్వణి కార్తిక్యాం పౌర్ణమాస్యాం భవం క్రీడావిధి మిత్యర్థః" అని ఢుంఢిరాజవ్యాసుడు రాశాడు. ఇక్కడఇలారాశిన్ని మళ్లీనాలుగోఅంకంలో రాక్షసునికి కుసుమపురోపరోధంనిమిత్తం ప్రయాణించేందుకు ప్రస్థా నదివసాన్ని నిర్ణయించి జీవసిద్ధి క్షపణకుడు చెబుతూ వున్న వాక్యాలను వ్యాఖ్యానిస్తూ "ఆయ మత్రాభిప్రా యః—ఆశ్వయుజ్యాం పౌర్ణమాస్యాం కౌముదీమహో త్సవప్రతిషేధేన" అంటూ కౌముదీ మహోత్సవం ఆశ్వ యుజపూర్ణిమనాడు అని జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు. ఇందులో యేది నిజమో! పంచాంగాలని గుణించే సిద్ధాంతులందరు యిలాంటివ్రతోత్సవాదులను నిర్ణయిం చేందుకు నిర్ణయకౌముదిని ఆధారంగా తీసుకుంటారు. తదనుసారంగా చూస్తే ఆశ్వయుజ పూర్ణిమనాడే అన డం నిజం? కాబట్టి ఆ ఆశ్వయుజపూర్ణిమకు పూర్వ మందే యీగ్రహణపూర్ణిమ అయివుంటుంది. ఎంత పూర్వంకావాలో చూదాం. ఆ ప్రథమాంకంలోనే చంద్రగుప్తుడు పర్వతేశ్వరునికి పారలౌకిక కర్మ నాచ రించడానికి అభ్యనుజ్ఞను శోణోత్తరాముఖాన చాణ క్యుణ్ణి అభ్యర్థిస్తాడు. పర్వతేశ్వరుడు యెప్పుడు మర ణించాడనేది నాల్గో అంకంలో మలయకేతువు "అద్య దశమోమాస స్తాత స్యోపరతస్య" అని చెప్పుతూవున్న మాటలనుబట్టి ఆనాటికి పదిమాసములకింద అని తెలు స్తూంది. అనగా నాటికి పదో మాసం వచ్చింది: ఆనాల్గో అంకం మార్గశిర పూర్ణిమనాటిదని స్పష్టంగా క్షపణ కుడు పెట్టిన ప్రస్థానముహూర్తంవల్ల తెలిసికోగలుగు తున్నాం.

"ఏకాహాచరితై కార్థ మిత్థ మాసన్న నాయకమ్;
పాత్రైస్త్రిచతురై రంకం తేషామంతేఽస్యనిర్గమః"

అనే లక్షణానుసారంగా వొక అంకంలో ఒక నాడు జరిగిన కథయే ఉపవర్ణిత మౌతుంటుంది— కాగా మార్గశిరపూర్ణిమనాటికి పర్వతేశ్వరుడు పోయి తొమ్మిదిమాసములు నిండినవి. అంగుచేత పర్వతేశ్వరుడు ఫాల్గుణపూర్ణిమనాడు మరణించివుంటాడు. అతడు మరణించినతర్వాత మలయకేతువు భాగురాయణుని సలహావల్ల పారిపోతాడు. అతడు స్వదేశానికి చేరినతర్వాత రాక్షసుడు అతనికి మగధరాజ్యం యిప్పిస్తానని ప్రబోధించడం, పెద్దసైన్యాన్ని కూర్చుకొని వాళ్లిద్దరు కుసుమపురాన్ని ముట్టడిద్దామనే వుద్దేశంలో వున్నారనే వేసు కుసుమపురం అంతటా పాకడం యివన్ని ప్రథమాంకారంభానికి ముందే జరిగిపోయాయి ఇవి జరగడానికి మధ్యకాలవ్యవధి మూడుమాసాలయినా వుండాలి. ఏమంటే—కుసుమపురంలో జరిగిన కామదీమహోత్సవప్రతిషేధం, చంద్రగుప్త చాణక్యుల కృతకకలహమూ మలయకేతునగరానికి తెలియడానికి పూరాగా రెండుమాసాలు పట్టాయి. కాబట్టి పైనజూపిన నాఊహ తిరస్కార్యంకాదు. అయితే ఫాల్గునపూర్ణిమనాడు చచ్చినవాడికి జ్యేష్ఠపూర్ణిమనాడు పారలౌకికం జరగడం సంభావ్యమా? అని శంకకలిగింది కాని, కన్నకొడుకు పదిమాసాలదాకా నివాపమైనా యివ్వనప్పుడు. (చూ. నాల్గో అంకంలో మలయకేతువు-నచాస్యాభి ర్వర్ధా పురుషాభిమాన మద్వహద్భి స్తముద్దిశ్య తోయాంజలి రప్యావర్జిత. చంద్రగుప్తుడు మూడునెల్లకైనా కారుణ్యంగా పారలౌకికం చేయించడం అసంభావ్యంకాదు. ఏతావతా—ఈగ్రహణం పట్టవలసినట్లుగా అనుమానించబడ్డరోజు జ్యేష్ఠపూర్ణిమ అని తేలుతూంది.

నాడు భచక్రంలో గ్రహాలు ఏరీతిగావున్నాయో వూహించుదాం. జ్యేష్ఠపూర్ణిమగనుక చంద్రుడు జ్యేష్ఠానక్షత్రంలో వృశ్చికరాశిలో వున్నాడు. గ్రహణం కేతుగ్రస్తంగా అనుమానింపబడ్డది కాబట్టి వృశ్చికంలోనే కేతువుకూడా వున్నాడు. దీనికి సప్తమమైన వృషభరాశిలో రవివుండాలి. కేతువుకు సమసప్తకంగా రాహువున్నూ వృషభంలోనే వున్నాడు. పూర్వోక్తరీతిగా బుధుడుకూడా సప్తమదృష్ట్యా చంద్రుణ్ని చూస్తూ వృషభంలోనే వున్నాడనుకుందాం; వెనకే చెప్పివున్నాను; గ్రహణభంగానికి యీబుధుడు అకించిత్కరుడని ఇతర గ్రహాలు యెలాగున్నా మన కనవసరం. దీన్నిచక్రం మీద చూపాలంటే యిలావెయ్యాలె.




ఇపుడు యింకోసంగతి ముఖ్యంగా మనం పరిశీలించవలసివుంది. ఈగ్రహణం పట్టదగినట్టుగా తోచిన పూర్ణిమ జ్యేష్ఠమాసపుదేయని నిశ్చయించవలసిన అవసరం యేలకలిగింది? చెబుతున్నా: నాల్గోఅంకంలో ప్రస్థానదివసనిర్ణయంచేసే సందర్భంలో జీవసిద్ధి నాటి గ్రహగతులను ఈవిధంగా చూపుతున్నాడు: "సావగా, ణిరూవిదా మయే ఆముజ్జణాదో జీవుత్తసవ్వకల్లాణా తిహీ సంపుణ్ణచందా పుణ్ణమాసీ. తుమ్హాణం ఉత్తలాఏ దిసాయే దక్షిణాం దిసం పత్థిదాణం అదిక్ఖణక్ఖత్తే. అవిఅ—అత్థాహిముహే సూరే ఉదిఏ సంపుణ్ణమండలే చందే; గమణం బుధస్స లగ్గే ఉదిదత్థమిదేఅ కేదుమ్మి" అని. అది మార్గశిర పూర్ణిమ. చంద్రుడు మృగశిరలో మిథునరాశిలో వున్నాడు. చంద్రుడు సంపూర్ణమండలుడై ఉదయిస్తూ సూర్యుడు ధనూరాశిలో అస్తమిస్తుండగా బుధుడి లగ్నం అయిన మిథునం ప్రయాణానికి మంచిది అని చెబుతున్నాడు. కేతువు అస్తమించడం రాహువు వుదయించడమూ జరుగుతుంది. దానికి చక్రం ఇలా వుంటుంది. లగ్నంలో సౌమ్యుడైన

రా
ల చం
ర బు
కే

పూర్ణచంద్రుడున్నాడు. లగ్నం బుధునిది. కేతువు అస్త మించాడు. అనగా రవికి ఒకరాశిప్రక్క నున్నాడు గనుక అస్తమించినట్లే ఈముహూర్తానికి యీగ్రహాలు ఆయాస్థలాలులో వున్నట్లు కంఠరవేణా కవియే చెబుతున్నాడు. గనుక రాహుకేతువులు యీరాసులలో వుండడం నిశ్చితం. కాబట్టి యేడుమాసాలక్రింద అనుమానింపబడ్డ గ్రహణానికికూడా రాహుకేతువులు ఇక్కడే వుండడం అసంభావ్యంకాదు. అంచేత ఈఅస్తంగతత్వమూ లోగడచూపిన గ్రహణోద్యుక్తత్వమూ కుదరటం కోసం గ్రహణానుమానం జ్యేష్ఠపూర్ణిమకే కలిగిందని పైనచెప్పిన కారణ సముదాయాన్నంతా పురస్కరించుకొని చెప్పవలసిన అవసరం కలిగింది.

అయితే యిక్కడ వ్యాఖ్యాత "ద్విః స్వభావా త్ర్పయాణే నిషిద్ధం మిథునం యద్యపి దుర్లగ్నం తథాపి బుధేన సౌమ్యగ్రహేణాధిష్ఠితం సత్సులగ్నంభవతి." అని బుధుడు మిథునరాశిని అధిష్ఠించియున్నట్లు రాస్తున్నాడు. అది అసంభవం. అందువల్ల ఆ వాక్యాన్ని సమగసపరుచుకోడంకొరకు "అధిష్ఠితమ్" అన్నదానికి ఆధిపత్యమాత్రం అర్థం చెప్పకుని ఆ అసంభావ్యతను వారించుకోవాలి. ఇన్నిటినీ మనము సమాధానపరుచుకున్నా "రక్షత్వేనంతు బుధయోగః" అన్నవాక్యం మాత్రం ఏవిధంగానూ సంభావ్యకోటిలో చేరడంలేదు. సాహిత్యదర్పణం షష్ఠపరిచ్ఛేదంలో ఉద్ఘాత్యకానికి వుదాహరణం చూపేచోట యీ "క్రూరగ్రహ" శ్లోకం వుద్ధరించబడివుంది. దానిపై మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాద ద్వివేదులు రాశిన టిప్పణిలో "రక్షత్వేనంతు బుధయోగః ఏనం చంద్రం రక్షయతి గ్రహో ద్వారయతి. తథా చోక్తం గర్గేన—

"పంచగ్రహసమాయోగం దృష్ట్వా సౌమ్యవివర్జితమ్; గ్రహణంతు వదేత్తత్ర సబుధం నగ్రహం వదేత్."

క్షతివస్తుతస్తు గణితగోలవిరుద్ధత్వాచ్చింత్యమేతత్" అని యీవిషయం సూచితమైవుంది.

విశాఖదత్తుడు పాత్రముఖేన "ఆర్య, కృతశ్రమోస్మి చతుష్షష్ట్యంగే జ్యోతిశ్శాస్త్రే" అని ఒకచోటా, "అస్తి చాస్మాకం సహాధ్యాయిమిత్ర మిందుశర్మానామ బ్రాహ్మణః, స చౌశనస్యాం దండనీత్యాం చతుష్షష్ట్యంగే జ్యోతిశాస్త్రేచ పరం ప్రావీణ్యముపగతః" అని మరొకచోటా తనజ్యోతిశ్శాస్త్ర ప్రావీణ్యాన్ని ప్రకటించుతూ యిలాంటి సందర్భాల్లో ప్రమత్తుడై వుండడు. దీన్ని సమర్థించగలిగే వుంటాడు. ఇంత వివాదగ్రస్తమైన విషయాన్ని వ్యాఖ్యానించేచోట వ్యాఖ్యాతయినా విపులంగా రాశి సమర్థించవలశింది. అతడూ, అంటీముట్టకుండా తప్పకోడం శోచనీయం. ఎవరయినా పండితులు యీవిషయాన్ని వివరించుతూ సమర్థిస్తే మంచిది.

---




డాక్టరు దొంగ అయితే



వల్లభాయి పటేల్
కరాచి : 1931



నెల్లీ సేనుగుప్త
కలకత్తా కాంగ్రెసు అధ్యక్షురాలు 1933.



బాబురాజేంద్రప్రసాదు
బొంబాయి : 1934



(1) హ్యూమ్ము, (2) నౌరోజీ, (3) వెడర్ బర్న్
కాంగ్రెసు స్థాపకులు




విజయరాఘవాచారిగారికి ఒసంగబడిన సన్మానపత్రము వెండిరేకుపై చెక్కబడినది.
అందు హ్యూము, ఆచారి, గాంధిగార్ల బొమ్మలు అమర్చబడినవి. (P.P.B.)

# పచ్చబొట్టు

కప్పగంతుల సత్యనారాయణ

సంతతవాహినియైన నదిప్రక్కన నిర్మింపబడిన దాచలువరాతి మేడ. ఆకాలమున దేశములో నతి నాజూకుగా నెంచబడిన యలంకారములతో నిండిన దా మేడ. ప్రపంచములో నాకాలమున బహుసమర్థులనియు, శిల్పకళాధురీణులనియు పేరెన్నికగాంచిన పనివాండ్రచే నిర్మింపబడిన దా మేడ. ఆదేశపు ప్రధానసేనాని నివసించున దా మేడ.

మేడగోడలను వొరుసుకొని నిరంతరమును భగవదాజ్ఞప్రకారము నేను చేయవలసినపని యిదియేయన్నట్లు ప్రవహిస్తున్నదానది. మేడకు తక్కిన మూఢు వైపులా చక్కని వుద్యానవనం. అందులేనివృక్షములు ప్రపంచమున లేవేమో. ప్రక్కనున్న నదీజలములు తోటలోని వృక్షములను యేపుమీర పెంచుట కనుకూలించినవి.

ఆమేడలో నివాసము భూలోక స్వర్గవాసము. సాయంత్రపురేఖలు క్రమ్ముచున్న సమయమున ఆచలువరాతి మేడపై కిటికీ సమీపమున నొక కుర్చీలో క్రింద గోడనానుకొని ప్రవహించుచున్న నదివంక నొకమారును, తన యొడిలోని యేడాది వయసుగల చిన్న మగబిడ్డవంక, నొకమారును, తనకెదురుగ నస్తమించుచున్న సూర్యునివంక నొకమారును, యొడతెరపిలేకుండ చూచుచు పందొమ్మిదిరువదేడుల వయసుగల్గిన స్త్రీ యొకతె కూర్చున్నది. మేలిముసుగును తీసివైచిన ఆమె ముఖమునకు సాటి చెప్పుటకుగూడ లేదు. ఆమె అసామాన్య సౌందర్యవతి. నిగనిగ మెరయు నామె చెక్కిళ్లపై ప్రతిబింబమును స్ఫుటముగా చూడవచ్చును.



ఆమెకన్నులు నీలాలగతి నతిరమ్యమగు కాంతిని దెచ్చి పెట్టిన వామెముద్దుమొగమునకు. ఆమెఫాలభాగమున గాలి కనుకూలముగా నెగురు నల్లనిముంగురులు ప్రపంచములో నామెమొగమునకుసాటి లేకుండ జేసినవి. తెల్లని పరికిణీ, ఆకుపచ్చని జుబ్బా, ఎర్రని మేలిముసుగుసడ్డ, బంగారునగలు ఆమెఅందమునకు మెఱుగులు. సాయంకాల సూర్యుని రక్తవర్ణమామెవదనమున కనూనమగుశోభ దెచ్చి పెట్టినది. నీలాలవంటి నదీజలములకే యొరుపురాగా బంగారువంటి యామె మేనిచాయ కారుణ్య మలమునొనుట వింతకాదు. ఒడిలోని కుమారుని పరిష్వంగ మామె కధికమగు హాయిని కలిగించుచున్నది. అర్థములేని పిల్లవానినవ్వుల కామె యొడలుమరచుచున్నది. మాటిమాటికి తాను పిల్లవానిని ముద్దుపెట్టుకొనునపు డెల్ల సంతోషభరమున చిరునవ్వు నవ్వుచున్నది. ఆమె నవ్వినపు డెల్ల ముత్యాలవంటి దంతములు తెల్లనికాంతులతో తళుక్కని మెఱయుచున్నవి. కుమారుడు మూడుమూర్తుల నామెనే పోలియున్నాడు.

'నీమగనికి నీపై నత్యధికప్రేమ గలదనుటకు నీకుమారుని రూపమే సాక్షి' యని యామెచెలు లామె నెన్నోపర్యాయములు గేలిచేసిరికూడను. తనకుమారుని చిరునవ్వుముందర ప్రపంచములోని సుఖములన్నియు నామెకు తృణప్రాయములు. అవును ! స్వీయసంతానమును ముద్దులాడుచు నానందతరంగములో దేలియాడు భాగ్య మందరకును గల్గునా ! బిడ్డలు లేరను వ్యాకులతతో కృశించెడువా రెందరో !!

ఆమె ప్రకృతిరామణీయకముల కానందించుచు, బిడ్డను ముద్దాడుచున్నను, దీర్ఘాలోచనాపరురాలై యున్నట్లు నడుమనడుమ రేఖలు గ్రమ్ము నామెనుదురుచెప్పుచున్నది.

ఆమెభర్త ఆమెనువిడిచిపోయి పదునైదుదినములైనవి. రాజ్యపుపొలిమేరల ప్రచండసేనాయుతులగు ప్రతిపక్షులు విడిసినారని రాజునకు వార్తరాగా, రాజ్యగర్భమున వారు జొరకుండనే యెదుర్కొనవలసినదిగ సర్వసేనాపతి కుత్తరువుల నిచ్చినాడు రాజు. తత్ఫలితముగ నాత డింతవరకును రాలేదు. ఆమె కాపురమునకు వచ్చినపిదప భర్త యామెను విడిచి యుద్ధముల కేగుట కిదియే మొదటిపరి. భర్త యెంతకష్టపడుచున్నాడో— యుద్ధమునకు బోయినవాడు తిరిగివచ్చువరకును-యేమో- ఎవరుచెప్పగలరు? పక్షముదినములనుండియు నామె కతనికడనుండి వార్త రాలేదు. ఎడతెరపిలేని యాయుద్ధమున నాత డెట్లు మసలుచున్నాడో అని యాసుందరీమణి చింత.

అది తురుష్కుల రాజ్యము. ప్రజలతినాగరికులు. షా అనుపేరుగల ఆరాజు సర్వవిషయముల నత్యుత్తముడు కాని సమీపరాజులతో నతనికి యుద్ధములు తప్పలేదు. విస్తారమగు భూభాగములో నతని దొకచిన్నరాజ్యము. పొలిమేరలవారందరు తురుష్కులే. నామమాత్రమున కాభూభాగమున కొకచక్రవర్తికూడ కలడు. అతడును మహమ్మదీయుడే. తనసామంతులలో నెన్నియంతఃకలహములున్నను నిర్ణీతకాలమున నాతనికప్ప మాతనికి జేరిన నతడేగొడవయు బట్టించుకొనడు. రాజ్యకాంక్ష సామంతులలో మిక్కుటము. చక్రవర్తినికూడ పదభ్రష్టునిచేసి, యాతనిరాజ్యమును గబళింపగోరుచు సమయమునకు వేచెడి సామంతులుకూడ నుండిరని రహస్యముగా ప్రజ లనుకొనుచుండిరి.

రాజునకు దినదినమును వార్తలు వచ్చుచునేయున్నవి. ఏమని? క్రొత్తసైన్యముల బంపుమని; పోరు ఘోరముగా జరుగుచున్నదని; శత్రుసైన్య మపారమని—. రాజుమాత్ర మేమిచేయగలడు? సైన్యములను పంపుచునేయున్నాడు. రాష్ట్రరక్షణార్థము ఏకొలది పాటిసైన్యమునో తనకడ నుంచుకొని తక్కినసైన్యము నంతను పంపివేసినాడు. పోరు ఘోరముగా జరుగుచున్నదని చింతించుచున్నాడు. శత్రుసైన్య మపారమని భీతిలుచున్నాడు. తనకు నష్టము కలుగనిరీతిని సంధిచేయుటకుగూడ హక్కు లిచ్చినాడు సర్వసేనాపతికి. సంధి కావలసినవారా పరిపంథులు? పూర్తిగ రాజ్యమును వారివశమొనర్చి రాజు నవలికి నడువమన్నారు. నాకంఠమున ప్రాణము లుండగా నారాజ్యమున మీ రడుగుపెట్టలేరనినాడు సేనాపతి.

## ౨

అటులనే కూర్చొనియున్న దాసుందరి. ఒడిలోని కుర్రవాడంతులేని యానందాతిరేకమున నవ్వుచునేయున్నాడు. సూర్యుడు ప్రతినిముసమునకు భూగర్భములోనికి బోవుచున్నాడు. అమిత వేగముతో నది ప్రవహించుచున్నది. తోటలోని చెట్లపయినుండి మామూలుగ గాలి విసరుచున్నది. చెట్లమీద పిట్టలు సంగీత మాలాపించుచున్నవి. ప్రకృతిక్రమ కార్యకలాప మొండొంటితో సంబంధములేక జరిగిపోవుచున్నది. ప్రకృతిసౌందర్య మచ్చట నెలకొన్నది.

యుద్ధములో తనభర్త ఏమిచేయుచుండునాయని తలపోయుచున్న యాకాంత కీదృశ్యములపై దృష్టి పోలేదు. ఆమె కనులముందర యుద్ధరంగ మున్నది. ఆమెకర్ణములకు వీరాలాపములు వినబడుచున్నవి. ఆమె శరీరమంతయు గాయములు పడినట్లున్నది. ఆమెమనసు కదనరంగములో విహరించుచున్నది. నడుమ నడుమ మాత్రము ఒక్కొకపరి యామె బిడ్డని మందహాససుఃను గ్రోలుచున్నది. హృదయము మాత్రము కారణము తెలియని వ్యాకులతతో కొట్టుకులాడుచున్నది. మనసుదిటవు చేసుకొనుట కామె ప్రయత్నించినది. కాని సాధ్యము కాలేదు.

అంతయు నిశ్శబ్దముగా నున్నది. నగరములోని ప్రజల కలకలము స్పష్టముగా వినబడినను ఆమెతలోచన కంతరాయము కలుగుటలేదు.

ఆమె నదివైపు తిరిగి కూర్చున్నది. పిల్లవాడామెయొడిలోనే యున్నాడు. ఒక్కసారిగ నేదో గంభీరఘోషమైన ట్లయినది. ఆమె గమనించలేదు.

మేడమెట్లపై దడ దడ చప్పుడయినది. ఆమె ఆలకించినది. రొప్పుతూ రోజుతూ దాసి యొకతె పైకి వచ్చినది. ఆమెగుండెలు గట్టిగా కొట్టుకొన్నవి.

కూర్చొనియే మెడ వెనుకకు త్రిప్పి దాసివంక చూచిన దామె.

'అమ్మా!' అని పెద్ద కేకవైచిన దాదాసి. ఆమె శరీర మాపాదమస్తకము కంపించినది. కంఠము తడబడినది.

'ఏమి?' అన్న దామె వణకుచు.

'అమ్మ—యుద్ధంలో మనోళ్లోడిపొయ్యారు. పగోళ్లు మనపట్నం దగ్గిరి కొచ్చేసారంట. అయ్యగార్ని సంపేశారంట' అని గడగడ వణకుచు కన్నుల నీరు నింపుచు గుండెను రెండుచేతుల నొక్కుకొనుచు చెప్పిన దాదాసి.

ఆమె నిలువున నీరైనది. 'ఆఁ' యని యరచుచు తటాలున కుర్చీనుండి లేచినది. తన యొడిలో పిల్లవాడున్న సంగ తామెకు తోచలేదు. పిల్లవానిని పట్టుకో గలిగినంత సత్తువకూడ నామెకు లేకపోయినది. కెవ్వున కేకవైచి పిల్లవాడు నదిలో త్రుళ్లిపడిపోయినాడు. దిగ్భ్రమజెంది 'దేవుడా!' యని నిలువలేక యచ్చటనే చలువరాళ్ళమీద పడిపోయిన దామె.

ఇదియంతయు నొక్క త్రుటిలో జరిగినది. దాసి బిత్తఱ జెందినది. దాని కేమిచేయుటకును తోచలేదు. పిల్లవానికొరకు క్రిందికి పరుగెత్తుటా? అమ్మగారియవస్థ చూచుటా?

మనస్సంతయు కేంద్రీకరించుకొని 'అయ్యో! పిల్లవాడు చచ్చె చచ్చె'ననుచు క్రిందికిపోవుటకు మెట్లవద్దకు పరుగెత్తినది.

మెట్లు దిగలేదు. 'బాబోయి' అని యొడలు విరుచుకొని క్రిందబడినది పాప మాదాసి. ఆమెవంక జూచుచు పదిపదునైదుగురు భీకరాకారులగు సైనికులతో నొక్కయువకు డచ్చట ప్రత్యక్షమైనాడు. తనను జూచి మూర్ఛనొందినదాసిని తనడేరాకు గొంపొమ్మని రువురుభటుల కాజ్ఞనొసంగి, గదిలోని కడుగుపెట్టినాడావీరుడు.

కన్నులు మిరుమిట్లుగొలుపు బంగారుబొమ్మవలె నేలబడియున్న ఆయువతిని రెండుచేతులతో లేవనెత్తినాడు. ఆమె స్పృహదప్పియున్నది. 'ఈమెను కూడ

నాడేరాక గొనిపోయి సేదదీర్పుడు' అని మరియిరువుర కాజ్ఞనిచ్చి గదినంతయు శోధింప నారంభించినా డాతడు.

తనకుపయుక్తములు, అమూల్యములు నగు పదార్థములను సేకరించుకొని వెడలిపోయినా డాయుద్ధవీరుడు.

పిల్లవానిమాట నాలోచించినవారే లేరు.

## 3

'అమ్మా!'

'........................'

'అమ్మగారూ!'

'ఏమే?'

'మనకులంలోవున్న ఆచారమేనండి'

'అయ్యో'

'మనరాజుగారిభార్య రెండోసారి నిక్కాకట్టుకున్నామేనండి'

'తమరు చిన్నతనంలో వుండారు. ఈయన చిన్నతనంలో వుండారు. చక్కదనానికి, భాగ్యానికి, చచ్చిపోయిన అయ్యోరికి తీసిపొయ్యేవారు కాదండి'

'దేవుడా!'

'తమరు ఇష్టపడ్డారంటే మూడ్నిముసాల్లో పెళ్ళయిపోద్దండి'

'.....................'

'తమరి ముందుజీవితముగూడా హాయిగా వుంటుందండి.'

'.... ...............'

'తమరిపాదాలు ఆశ్రయించుకోనున్న మాకింత కూడు దొరుకుతుందండి'

'.....................'

'ఈ అయ్యోరుగూడా సేనంతటికి ప్రభువేనంటండి'

ఈవిధమున ప్రతిదినమూ ఆమెకు బోధ చేయుచున్నది దాసి. వీరిరువురను బందీలుగా గొనివచ్చినవీరుడు రెండవరాజువద్ద సర్వసేనాపతి. పాతికేండ్లలోపు వయసు. స్ఫురద్రూపి. ఆమెచక్కదన మతని నాకర్షించినది. ఆమెను పెండ్లిజేసికొన నాతని కిచ్ఛవొడమినది. భర్తమరణము, పిల్లవాడు నదిలో పడిపోవుట ఆమె మనస్సును పూర్తిగా కలచివైచినవి. ఆమె మరణించ నిచ్ఛగించినది.

కాని కొలదదినములనుండి దాసిదానిమాట లామెకాలోచనను బుట్టించినవి. ప్రతిదినము వచ్చి సేమ మరసిపోవునావీరుని రూప మామెకు జీవితముపై మరల నాసగొల్పినది. ఆమెయిష్టముపైననే వివాహముచేసుకొనదలచిన యాతని దృఢప్రేమ యామె కతనిపై ననురాగమును గలిగించినది.

కాలక్రమమున సుఖదుఃఖములు మరపురాకుండునా! భర్తృవియోగదుఃఖ మామెకు పాతబడినది. సుఖయుతమని తోచుచున్న నూతనజీవితముపై నామెకు గాటమగుకోరిక గల్గినది. మతశృంఖలము లామెకోరిక నరికట్టలేదు. స్త్రీలలో ద్వితీయవివాహమున కామత మామోదించినది.

కొలదికాలములో నామెకును, సేనాపతి నవాబు మీర్ ఆలీకును నిక్కా జరిగినది.

*  *  *  *

కాలమంతయును నొక్కరీతి గడచునా! మన మనుకొనినట్లు పరిస్థితులలవడునా! రోజులు చెడ్డవైనపుడు దైవముకూడ విముఖుడగును - కాదా!

ఆమె రెండవభర్తతో పదిసంవత్సరములు కాపురముచేసినది. ఆమెకు మరల బిడ్డలు కలుగలేదు; ముల్లాలకు మ్రొక్కినది. ఫకీరుల దీవెన లందినది. నిరంతర మల్లాను ప్రార్థించినది. కాని ఫలిత మేమియును గనుపట్టలేదు.

కాలచక్రము గిరుకతిరిగినది. ఒక్కసారిగమార్పులగుపించినవి. ఆమెరెండవభర్తజీవితము ఎంత విచారకరము-యుద్ధపుమిషగొని తుదముట్టిపోయినది.

ఆమెకు జీవితముపై విసుగుపుట్టియుండవచ్చును. జనానాలో సుఖజీవితమును గడుపుమనిన ఫాదుషా

కోర్కె కామె సమ్మతించలేదు. బ్రతుకుటయా? చచ్చుటయా?

ప్రాణమనిన తీపిలేనివారెవరు! ఆత్మహత్య నామె నిరసించినది.

ఆమె చిన్నతనమున గానమభ్యసించినది. కోయిలకు స్వరమునేర్పు పటిమగలదామె కంఠస్వనము.

ఆమె చక్కదనము సాటిలేనిది. పరిపక్వమగు యౌవనమందున్న దామెతనువు. ఇకేమి?

చక్కదనము, యౌవనము, గానకళానైపుణ్యము.

బిడియము విడిచిన చాలుగాని కోట్లకొలది ధన మార్జించవచ్చును. పురుషుడా! వాంఛ మిక్కుటమగుచో, తగినవాకు లభించకపోవునా?

ఇది యామె యాంతరంగికతర్కము. ఆమె మనసు కళాకల్పితమైపోయినది. ఆ ఇరువురుభర్తల మరణమామె కనులజూచినది. ఆమెతనువుమాత్రము నశింపదా! అట్టిచో!! ప్రపంచభోగముల నేల ననుభవింపకూడ దనుకొనినది. దాసిని దాని యభిప్రాయము నడిగినది. దానికి నీతినియమముల నాలోచించునంత మనోవికాసములేదు. యజమానురాలి హృదయ పరివర్తన కది మిక్కుటముగ నచ్చెరువందినది. తదనుకూల దోహదము నర్పించినది.

వారిరువురు దూరదేశములకు ప్రయాణమును కట్టినారు. బ్రహ్మకు దెలియకుండ వెళ్లిపోయినారు.

ఆమేడను జూచినప్పుడాపట్టణవాసులామెను జ్ఞప్తికి దెచ్చుకొని 'ఎక్కడున్నదో నిర్భాగ్యురా' లనుకొనెడివారు. ఆమె విషాదచరిత్రను చెప్పుకొని కన్నీరు నించెడువారు.

## ౪

ఆమె గానకళా నైశద్యము దేశదేశముల వ్యాపించిపోయినది. ఆమెగానసభయనిన పోనివారు లేరు. చివర కామెపేరైన నెరుగనివారులేరు.

అది మరియొకదేశము. ఆరాజసభలో నాడామె సంగీతసభ జేయును. ప్రజలెల్లరు సభలో క్రిక్కిరిసిపోయినారు. ఆమె రత్నకంబళముపై కూర్చున్నది. స[illegible] సింహరాజములతో డీకొనగల్గినశూరులున్నారు. ప[illegible] లతో కవితను గుల్కించెడికవు లున్నారు. ప[illegible] న్యాసములలో సుందరములగు చిత్రములను సృష్టి[illegible] చిత్రకారు లున్నారు. సకలశాస్త్రములు చదివిన[illegible] తు లున్నారు. మతమే జీవితముగా బుట్టి పెరిగి [illegible] ధముచేయు మౌల్వీ లున్నారు. ప్రతిపక్షులలో నసంతృప్తిలేకుండ, నతిచమత్కారముగ, న్యాయ[illegible] తీర్పుజెప్పెడి న్యాయాధికారు లున్నారు.

ఆమెసౌందర్యమున కందరును ముగ్ధులై[illegible] భూలోకమున నవతరించిన దేవకామిని యనుకొ[illegible]

రాజాజ్ఞ యగుటతో డనే ఆమె పాట [illegible] భించినది. సభలోనివారందరు మంత్రముగ్ధ పన్న[illegible] వలె నిశ్చేష్టులైనారు. రాజువంక సభ్యులు, స[illegible] వంక రాజు—ఎల్లరు నామెవంక కనులుమా[illegible] తిరుగుచున్నవి. పారవశ్యముచే నోడలు తెలియని క[illegible] తల లూగుచున్నవి. ఆమె పాడుచున్నది.

కీర్తికొరకు, ధనముకొరకు, రాజును మెప్పి[illegible] టకు—ఆమె పాడుచున్నది.

సంతోషముకొరకు, మానసోల్లాసముకొ[illegible] ఆత్మశాంతికొరకు సభ్యులు వినుచున్నారు. [illegible] సభ పరిసరవస్తుజ్ఞానమును మరచి, ఆమెసంగీతరస[illegible] ర్యమున మత్తులైనారు. సంగీత మెవరిమనసున కా[illegible] మును గొల్పదు! ఎంతసేపుపాడినదో ఆమెకు తెలి[illegible] సభ్యులకు తెలియదు. ఆమె మొగమంతయు [illegible] పట్టినది. సభ్యులకు శరీరమంతయు నుక్కపో[illegible] సభామందిరమంతయు వెచ్చనిగాలితో నిండిపో[illegible] సభలో కూర్చుండుట కష్టతర మనిపించినది. కా[illegible] యెవ్వరికిని సంగీతము వదలిపెట్టిపోవుటకు మ[illegible] రించలేదు.

తనంతతానే సంగీతము నాపిన దామె. శేపా బహూకరించవలయునన్నాడు రాజు. ఒక్క[illegible] సభ్యులందరు బైటపడి హాయిగ గాలి పీల్చినారు.




'రాజుగారి కుడిప్రక్క కూచున్నాయన్ని'

'అవును'

'చాలా చక్కని మొహం. ఆజానుబాహు—'

'వర్ణనయెందుకూ! పనేమిటో నువ్వురావడానికి అది చెప్పు'

'ఆయన రాజుగారి ముఖ్యస్నేహితుడు.'

'సరే'

'గొప్పకవి'

'అయితే—'

'నెలకి రెండువేలు పేరుకి ఆయనకి జీతం'

'సరే!'

'అయితే— ఖజానాఅంతా ఆయనపెత్తనమే'

'ఇస్. ఏమంటావు అయితే?'

'రాజుగారి కాయనమాట మంత్రమే'

'సరే. ఇప్పుడేమొచ్చింది?'

'తమరిపాట విన్నప్పటినుంచీ—'

'....................'

'ఇదివరకు యెన్నడూ యెరుగని అవస్థలో పడ్డారు'

'....................'

'కొత్తరక్తం'

'....................'

'నెలనైతే'

'....................'

వెనుకనే సభలోని ఉన్నవారంతయు బైటికి పోయినది.

పరిచారికతో నామె బసకు పోయినది. రాత్రి యెనిమిదిగంటలవేళ. ఆమెవాకిట నెవరో నిల్చినారు.

'అమ్మా!'

'ఎవరు?'

'తలుపు తీయించండి.'

'....................'

'....................'

'ఏమి?'

'మనవి. లోపలికి రావచ్చునా?'

'రా'

'ఊ. ఏమిటి?'

'తమరు చూసేవుంటారు'

'ఏమిటది?'

'పదివేలు కుమ్మరిస్తాను. మూడునిముసాల్లో'

'.......................'

'సెలవా'

.......................'

'.......................'

'ఒక్కగంటలో పంపు'

'చిత్తం'

రాజుగారి కుడిపైపున నున్నకుర్రవాని నామె చూచినది. అతనిసుందరరూపమునకు విస్మయమందినది. ఆమె కేమో జ్ఞాపకమువచ్చినది. కాని మార్పుజెందిన ఆమెమనసున కది స్ఫుటము గాలేదు. తను పాడినంతసేపును ఆయువకుడు మైమరచుట నామె క్రీగంట కనిపెట్టినది. అతడు తదేకదీక్షతో తన నీక్షించుట నామె గ్రహించినది. ఆమె నాకర్షించిన దతనిరూపము. అతని నాకర్షించిన దామెరూపము. ఆమెనడివయసులోనున్నది. అతడు లేతయౌవనములో నున్నాడు. భోగలాలసత కిరువురు లొంగిపోయినారు.

ఆమె నతడు ప్రేమించినాడు. అతని నామె ప్రేమించినది. సార్థక్య మమరినది. ఇక నేమున్న దాటంకము! పరిచారికలు నిముసములో మెత్తని పాన్పు నమర్చినారు.

తన నలంకరించుకొనుటలో యారాత్రి పడినపాట్లు మిక్కిలి శ్రద్ధ—నూతనము.




అలంకృతమగు నామె రూపము పరిచారికల నక్కజపడజేసినది. ఆమె యతనిరాక కెదురుచూచుచున్నది.

టకటకమను గుర్రపుడెక్కల చప్పుడు వినబడినతోడనే పరిచారికలు వీథితలుపు తెరిచినారు. జోడుగుర్రముల బండినుండి దిగినా డాతడు. పానుపున్న గదిలోని కాతని దీసికొనిపోయినారు. అంగీనివిప్పి మేకు

నకు దగ్గిల్చి పాన్పుపై కూర్చున్నాడతడు. తేజఃపుంజములతో నావృతయై గదిలోనికి వచ్చినదామె. అతడామె కెదురుగపోయి కౌగిలించుటకు చేతులను ముందుకు జాపినాడు.

ఆమె కెవ్వున నరచినది. బయట పరిచారికలు గందరగోళపడినారు.

ఆమె నిశ్చలముగా 'ఆగు' మన్నది. ఆశ్చర్యముతో వెనుక కడుగిడినాడతడు.

'ఏదీ, నీ కుడిచేయి ముందునకు చాపు' మన్నదామె.

తెల్లని గాజుకుప్పెలలోని యత్తరుదీపముల మధ్య దబ్బపండువంటి యతని శరీరచ్ఛాయ మిల మిల మెరయుచున్నది. ఆ పచ్చని కుడిచేతి జెబ్బమీద 'షా అబ్దుల్' అను నక్షరముల నల్లని పచ్చబొట్టు స్ఫుటముగా గనుపడుచున్నది.

ఎన్నియో సంవత్సరములకు పూర్వము నదిలో బడిపోయిన తన కుమారుని కట్టిపచ్చ బొడిపించియుండుట యామెకు జ్ఞప్తికి వచ్చినది. ఆమెకు పాలు చేపినవి.

'ఆపే రెవరిది?' అన్నదామె, యెట్లు మాట్లాడవలయునో తెలియక.

'నాపేరది' అన్నాడత డేమియుతోచక.

'నీతలిదండ్రు లెవరో నీవెరుగుదువా?'

'కన్నవా రెవరో నాకు తెలియదు పెంచినవారు మరణించి చాలకాలము కాలేదు. వారు మరణించునంతవరకు వారే నాతలిదండ్రు లనుకొంటిని. మరణకాలమున నా పెంపుడుతండ్రి చెప్పినాడీ యుదంతము'

'ఏమని?'

'ఏమని—నన్నాత డొకసైనికునివద్ద కొన్నాడట. ఏదో ముట్టడిలో నదిలో గొట్టుకొనిపోవుచు, నేటియొడ్డున నున్న ఆసైనికునిదృష్టిలో పడితినట నేను. నన్నాతడు వెలికితీసి బ్రతికించినాడు. ఆసైనికుని భార్య చనిపోయినపిదప, యింకొకరాజు కొలువుకు బోయి, ఆపురమున నన్ను విక్రయించినాడు. నా పెంపుడుతండ్రి ఆపురమునుండి యీపట్టణమునకు కాపురమొచ్చినాడు.'

'నాబిడ్డా' యని యతనిని కౌగిలించుకొన్నదామె. నిముసముక్రింద పొంగిన నారిరక్తనాళములు, కాగినరక్తము చల్లారిపోయినవి.

తనయుదంతము నామె వానికి తరువాత చెప్పియుండవచ్చును.

వ్యభిచారము చేయింపబూనిన యత్యాచారము విధికృతమున దప్పింపబడినది.

---

## నిర్వ్యాపారత, ఆర్థికమాంద్యము

ఒక్క భారతవర్షమే కాదు ప్రపంచమునందే ప్రాంతపువార్తలు వినినను నిరుద్యోగులరేటుక్క విలపోతలు జాస్తిగ వినవచ్చుచున్నవి. దినదినము నిర్వ్యాలయం దారితేరినవారిసంఖ్య విస్తరించుచున్నదే గాని వారికి సంపాదింపదగిన సదుపాయములుమాత్రము అమరకున్నవి. ఈనిర్వ్యాపారతకు కారణము ప్రపంచమునందేర్పడిన ఆర్థికమాంద్యమని పలువు రభిప్రాయపడుచున్నారు.

నాబుద్ధికి మాత్రము ఆర్థికము, మాంద్యము అను రెండుపదములను ఆంధ్రనిఘంటునుండితొలగించినపక్షమున ఆర్థికమాంద్యము లేదనియే నాయూహ. ఆర్థికమాంద్యమనుపదమున కింతటి మహత్తరప్రచారము లభించుటకు పత్రికాధిపతులు, ధనికులు మొదలగువారొసంగిన ప్రచారమేగాని యితరులొసంగినదిగాదు. ౧౯౩౬ వ సంవత్సరము నాటికిని ఈ ౧౯౩౫ వ సంవత్సరము నాటికిని నడుమ వెలసిన అసంఖ్యాకములగు బ్యాంకులు, ఇన్‌ష్యూరెన్సుకంపెనీలే నావాదమునకు దోహదమొసంగును. ఒకబ్యాంకు పుట్టినదనగానే డిపాజిట్లు యెట్లు రెక్కలు గట్టుకొని పడుచున్నవో గమనింపుడు. ఇండియాకు రిజర్వుబ్యాంకు సాంక్షనుఅయి డిపాజిట్లకు పిలుపు తగిలినదనగానే వారముదినములు నిండకమునుపే కోరిన కోట్లకొలదిధనమెల్ల చేకూరినప్పుడు ఆర్థికమాంద్యమెక్కడ! 'దున్నపోతు యీనింది, దూడనుకట్టివెయ్య' మను పరమానందయ్య వారిశిష్యులవలె "రాబోయే రోజులు మంచివిగావు, ఆర్థికముగ చాలచిక్కులు తటస్థింపవచ్చును, ఇప్పటినుంచి జాగ్రత్తపడితే మంచిది" అని ఒకపరమానందయ్య యెక్కడనుంచో ఒకపొలికేక పెట్టితే శిష్యులంతా దానికే తాళమువేసినట్లు మన ధనికులంతా తమతమఆస్తులను బయటపెట్టుటకు వెరచుచున్నారు. వారియొద్దగల ధనమంతయు పెరుగుదల, అరుగుదల లేక నిలిచిపోయియున్నది. ఏవ్యాపారముమీద ఆధనమును వినియోగించుటకైనను ఆపొలికేక భయపెట్టుచున్నది. నిజముగా ఆర్థికమాంద్యమునే దున్నట్లైన యిన్ని క్రొత్త యిన్‌స్యూరెన్సుకంపెనీలు, ఇన్ని బ్యాంకులు, యిన్నిటాకీకంపెనీలు యెట్లు జన్మించగలవు? ధనికులయొద్ద మూల్గుచున్న డబ్బునంతయు బయటపెట్టించి స్వదేశపరిశ్రమల నభివృద్ధిపరచుటకు వినియోగించినపక్షమున ఆదాయము హెచ్చి, పనిలేక నిర్వ్యాపారులుగ నున్నవారికి జీవనోపాధి లభింపగలదు. ఈవాదము నిప్పుడొకప్రక్క నుంచుదము.

## మన విద్యావిధానము, సేవకావృత్తి

భారతవర్షపుప్రజలలో సగపాలు వ్యవసాయమువల్ల జీవనము చేయుచున్నారు. నాల్గవవంతు చెమటనోడ్చి, చీవాట్లతో, తన్నులతో, అనూహ్యమైన అవమానములకు లోనై గుమాస్తాగిరిచేసి ధనికకోటికి ధనమును కూర్చిపెట్టుచున్నారు. మనకు నేర్పబడుచున్న విద్య మనలను గుమాస్తాగిరికే తయారుచేయుచున్నది గాని స్వతంత్ర నిర్మాణశక్తి నలవరింపజేయు విద్యనెయ్యింటి కొకపాలుగూడ మనకు నేర్పబడుటలేదనియు, ప్రస్తుత విద్యావిధానము పూర్తిగమార్చబడవలెననియు మన కాంగ్రెసుపెద్దల యెబజెండ్ల ఘోష మనచెవులయందు ఢంకామ్రోతవలె మ్రోగుచునేయున్నది. ఇక మన భారతజాతికి గత్యంతరములేదా?

వేరుగతి లేదు. అందరు నందల మెక్కదలచిన మోయువారెవ్వరు? ఈ సామ్యము ననుసరించియైన సేవకావృత్తి (నీచమే యగుగాక) కొందరివంతుకురాక తప్పదు.

## సేవకావృత్తిగూడ నొక కళ

సేవ యనునది ఉత్తమునకు జేసినను, అధమునకు జేసినను నయ్యది నీచమైనదే. సేవచేయుటయందు గూడ

ఒక నిపుణతగలదు. అది గూడ నొకకళ. నిపుణతతో గూడిన సేవ అధముడగు యజమానిని ఉత్తమ మార్గమునకు త్రిప్పగలిగినను, త్రిప్పలేకున్నను సేవకునకు మాత్రము జయసిద్ధి తప్పదు. ఈ చిన్నిగ్రంథము సేవకావృత్తిచే జీవించువానికి ఆవృత్తియందు గల నైపుణ్యమును, కళను విస్తరించును.

## వాణిజ్యవిద్య-పాశ్చాత్యుల పక్షపాతము

వాణిజ్యమను పేరునకు సంబంధించినవిద్య అంతులేని మహాసముద్రమువంటిది. ఈ విద్య పాశ్చాత్యుల భద్రమయిన సొత్తు. ఇందలి మెలకువలు మనకు వారు నేర్పరు. వాణిజ్యమున నొకభాగ మనదగిన టైపు రైటింగు, షార్టుహాండు, కమర్షియల్ జాగ్రఫీ, అకౌంటెన్సీ, బుక్ కీపింగు మొదలగు కొన్ని మాత్రమే గుమాస్తాగిరికి అత్యవసరమైనవి మనకు కమర్షియల్సు అనుపేరున నేర్పబడుచున్నవి. వాణిజ్యమును, అనగా నే దేని ఒకవ్యాపారమును నలుమూలల విస్తరింపజేయుటకు కావలసియుండు Advertising, sales organi_sation, commercial art, salesmanship, Industrial management, Business corres_pondence, cartooning, Lettering, show cards మొదలగు బహువిధ విషయములు మన కందుబాటున లేకుండజేసిరి. రక్షింపుకొనుటకు వారిలో కొందరు మన దుచ్ఛిష్టముగ పారవేసిన అసంపూర్తి, అమూల్య గ్రంథసముదాయమే మనకు మహాప్రసాదము. ఎట్లో లభించిన ఆగ్రంథముల శ్రద్ధతో పఠించినను మనకనికులం దేర్పడియుండిన ఉదాసీనతచేతను, అన్నీ ఉండియు అల్లునినోట శనియన్నట్లు మన మేధమునను అభివృద్ధి మార్గమున బడలేకున్నాము.

## విద్యార్థిదశ - తల్లిదండ్రుల బాధ్యత

మనకు నేర్పబడుచున్న విద్య విద్య కానేకాదు. "మీ బాలురకు మేము పాఠశాలయందు నేర్పువిద్య కంటె యింటియొద్ద తల్లిదండ్రులు నేర్ప గలిగినదియు, బాలురే తమంతతాము తల్లిదండ్రుల ప్రోత్సాహమువలన నేర్చుకొనదగినదియు విద్య మరిమూడింతలుగల"దని ఒక ఉపాధ్యాయుడు 'Scholar' మాసపత్రికయందుదాహరించియుండెను. ఆయుపాధ్యాయుని వాక్యములందు సత్యము లేకపోలేదు.

తమబిడ్డల వ్యక్తివృద్ధికి తల్లిదండ్రులే బాధ్యులు. పాఠశాలవిద్యతో బాటు తల్లిదండ్రులును కొంతశ్రద్ధ వహించిన పక్షమందు తమబిడ్డలు విద్యార్థిదశయందున్నప్పుడే గట్టిపునాది యేర్పడి వారి జీవితము సారవంతము గాగలదు. స్వశక్తిచే సంపాదింపగలిగిన దాని యందే మనకు హెచ్చుసుఖముకల్గు చుండును. అట్లే విద్యావిషయమునగూడ మనకవసరమగు ప్రతి స్వల్పవిషయమునకు మరొకరిమీద నాధారపడుట కేవలము తెలివితక్కువ. అట్టిది నెరవేరుటకూడ బహుకష్టము. కాన స్వశక్తిచే తనకనుగుణవృత్తికి కావలసియుండు అనేకాంశముల నేర్వ ప్రయత్నించుటుచితము.

ముఖ్యముగ యువదశయందున్నవారికి ఉన్నతాశయము లుండుట శ్రేయము, సహజము. యువకులు దానికి తగినపునాదులను తొలుత యేర్పరచుకొనవలెను. చేయదలచిన కార్యమునందు శ్రద్ధ, భక్తి గలిగి చరింపవలెను. అపుడు జయమును అంచెలమీద తప్పక సాధింపనగును. గొప్ప యంత్రశాలను నిర్మించవలెను. మరలను నన్నిటిని సరిగ బిగించి చమురును పూయుచుండిన చిరకాలము పనిచేయును. మరలను సరిగ బిగించక, చమురుతో తడపకుండిన నిర్మాణమంతయు నేలకూలి ప్రమాదము తటస్థించును.

పట్టుదల, నిజాయతి, అణకువ, యుక్తి, పరిశుభ్రత, Punctuality మొదలైనవి జయసిద్ధికి సోపానములు. నడవడికవల్లనైవాటిని తనలో ప్రతిఫలింపజేసికొనవలెను.

## జీవనభారము

నౌకరీలకొరకు పల్లెలనుండి గ్రామములకు, గ్రామములనుండి పట్నములకు, పట్నములనుండి రాజధాని నగరములకు అనేకమంది యువకులు వెడలుచుండుట సహజము. నౌకరీకొరకు వెదకుట, లభింపజేసికొనుట, లభించినదానిని జాగ్రత్తగా కాపాడుకొనుట మున్నగు

ఘట్టములందు కావలసియుండు వాక్చక్యము, పైపుణి మనలో నెందరకో కొరవడిన కారణముననే వారు వారొనర్చు ప్రయత్నములలో కొందరు అపజయము చెందుచున్నారు. తల్లిదండ్రులు తమబిడ్డలకు నౌకరీ దొరకి జీవనోపాధి లభించినదనిన, వారి బాధ్యత యంతరించినట్లు తలంచుచున్నారు. అట్లుతలంచ జనదు. ఇందుదాహరింపబడిన విషయములకు తోడు తలిదండ్రులుగూడ వారిబిడ్డలకు నేర్పదగు నంశము లెన్నియోగలవు. తల్లిదండ్రులా బాధ్యతను విడనాడకుందురుగాక!

నౌకరీవల్ల జీవనోపాధి గడుపనిశ్చయించినప్పుడు చిన్న" తా బేదారీతనముతో ప్రారంభించుటే ఉత్తమము. ప్రతి చిన్న విషయమునందును యువకుడు పూర్ణానుభవము సంపాదింపగలిగినప్పటికి ఒక స్వంతవ్యాపారమునే జయప్రదముగ సాగింపగల యవకాశమేర్పడియుండును. వాణిజ్యము వ్యాపారమునకు సంబంధించిన సవాలక్ష గ్రంథముల పఠించినదానికంటె ప్రథమదశ నుండి కడపటిదశవరకు గల ప్రతిదానియందును తాను పొందిన అనుభవమునెయ్యింతలు అమూల్యమునై తనకు సహాయకారి గాగలవు.

## భావి జీవితము

తన కిప్పుడువయస్సు పదునారవవత్సరము. భారత చట్టము ప్రకారము యింక రెండు సంవత్సరములలో తాను మేజరు కాగలడు. ఇప్పుడు తాను స్కూలు ఫైనలు ప్రాంతముల పాఠశాల చదువుచుండును తన భావిజీవితమునకు స్థిరమగు పునాదినిగూర్చి తానును తన తల్లిదండ్రులును యోచనచేయుటకు సరియైన సమయమయ్యదియే! స్కూలు ఫైనలు గడచి మేజరు కాబోవునరికి భావికార్యక్రమమునుగూర్చి స్థిరపరచుకుని యుండక పోయిన అనేకయువకుల జీవితము లెట్లు భగ్నమైనదియు, సారహీనములుగ నున్నదియు మన నిత్యజీవితమునందు చూచుచునేయున్నాము.

వృత్తులు అసంఖ్యాకములు. తాను స్కూలు ఫైనలుపరీక్షకు వెళ్లినట్లు తెలిసిన తన స్నేహితులు, తన బంధుకోటి ముందు యేమి చేయదలచితి వని యడుగుదురు. మెడికలు, ఎంజనీరింగు, ఎలెక్ట్రికల్, లా, ఆర్ట్సు అండు క్రాఫ్ట్సు, బి. ఎ, టెక్నికల్సు మొదలగు నెన్నియోరకములైన వృత్తులు గలవు. ఈవృత్తుల సాధించుటకు తగినంతధనము లేకున్నచో ఉండనేవున్నది. ఏవృత్తికిసంబంధించిన సమాస్తాగిరియైన. పైనుదాహరింపబడ్డ వృత్తులగూర్చి విస్తరించి వ్రాయుట కిందు తావు లేదు సరేగదా అందు కుద్దేశింపబడలేదు. సుమాస్తాగిరి నిశ్చయించుకొనువారికిమాత్రమే యందలి విషయము లుపయోగపడగలవు.

నిర్మాణమునందాసక్తిగల యువకుడు యింజనీరింగు చదువుటమంచిదే. కాని మురికిగుడ్డలు ధరించుట, కాయకష్టము చేయుట మున్నగు వసహ్యపుపనులకు సిగ్గు చెందకున్నచో యింజనీరింగువిద్య వాని నున్నతపదవికి దెచ్చుటకు మంచి అవకాశమును గూర్చును.

మెడికలు—ఇయ్యది చాల లాభకారియైనదే. దీనికి పలుకుబడి, వాకచక్యము, అనుభవము, సౌహార్దము మున్నగు సులక్షణములు అత్యావశ్యకములు.

లా—దీనిని నమ్ముకొనదలచినవారికిగూడ మంచి పలుకుబడి కావలెను. ఓపిక, యుక్తిగూడ అవసరములు.

ఆర్ట్సు అండు క్రాఫ్ట్సు—కళలు పాఠ్యక్రమము ననుసరించి నేర్వదగినవికావు. నిజమైన కళాభిజ్ఞుడు పుట్టుకతోనే కళాభిజ్ఞుడగునుగాని నేర్పదగినది బహుకొద్ది. Architect యొక్క జీవితము ప్రథమమున కొంత విసువుదలనే సూచించును.

డ్రాయింగునం దభిలాషగలిగి ఒక ఆఫీసునందు కుర్చీకి అంటిపెట్టుకొని పనిచేయగలవారికి Drafts-man & surveying మంచి అవకాశము లభింపచేయును.

ఇట్లే యెన్నిటినో ఉదాహరింపవచ్చును. ఆయా వృత్తులయందు త్రీవ్రలుపుకు యువకున కుత్సాహము, తలిదండ్రుల ప్రోత్సాహము, ధనము, పరీక్షలందు తెలివితేటలుగ నారితేరుట, సంఘములో పలుకుబడి మొదలునవి సమకూడిననేగాని వాటియందు అభివృద్ధి చెందజాలరు. అసాధారణ మేధావియైనచో నందు కొన్ని

కూడిరాగలవు. ఎంత త్వరలో ఆయావృత్తులకు సంబంధించిన పరీక్షలందు యువకు డుత్తీర్ణుడగుచుండిన నంత త్వరలో ధనార్జనకు దిగవచ్చును.

యువకుడు మెరికగనుండి, యెంతచదువునైన చదువుట కాసక్తి, ధనసదుపాయము, పలుకుబడి లభించినపక్షమున యింజనీరింగు, మెడికలు, లాపంటివృత్తులయందు లభ్యపడుపలుకుబడి, ఆధిక్యము, గౌరవము, ధనార్జన వాణిజ్యమున ప్రవేశింపగోరువానికి చేకూరవు. పైసదుపాయము లమరకున్నయువకునకు వ్యాపారమే మిగిలినయుపాయము. యథార్థముగ దీనియందుగల ఆధిక్యము ఒకేవృత్తిని నమ్ముకొనియున్నవానికి లభ్యము కాదు.

## వ్యా పా ర వృ త్తి

వాణిజ్యమనునది మహాసముద్రమువంటిది. ఇందనేకరీతులు గలవు. అమోఘావకాశము లిందును చాల గలవు. మన మెరిగినపెద్ద లెందరో వ్యాపారరీత్యా పెద్దలైనవ్వారే. వారందరు సంఘమునందు పొందుచున్న గౌరవప్రతిష్ఠ లపారము. ఒకేవృత్తిని నమ్ముకొనియుండువానికి జీవితపర్యంతమదేకాని వేరేమార్పురాదు, లభ్యమును కాదు. ఒకవిధముగ వానిజీవనసంస్థ స్థిరపడినదని యెంచవచ్చును. వాణిజ్యమునం దట్లుగాదు. బంట్రోతుగ నొకకంపెనీయందు చేరినవాడే దినములు గడచిన పిమ్మట కంపెనీమానేజరుపదవిని పొందుచున్నాడు. ఈమార్పుకు కారణము వానిలోగల పట్టుదల, చాకచక్యము, అణకువ, యుక్తి, భక్తి విశ్వాసములు. అవి వాని అధికారులను ముగ్ధులుగ నొనర్చి ఆతని నాపదవికి దెచ్చుచున్నవి. బొంబాయి, మదరాసు, కలకత్తాలవంటి మహాపట్నములందలి వ్యాపారపుకంపెనీల చరిత్రలలో నిట్టిగాథలు తరుచుగ వినుచుందుము.

## జయాపజయములు

ఒకానొకయువకుడు ఒకప్రత్యేకవృత్తికి పనికి వచ్చువాడా, లేక వ్యాపారమునకుం బనికి రాణించువాడు యను విషయమును నిర్ణయించుట కష్టమే యైనను యువకుని బాల్యమునుండి పరీక్షించుచున్న తల్లిదండ్రులు మొదలైనవారు కొందరు ఆ విషయమును నిర్ణయించగలరు. పరిపూర్ణత చెందినవారును, హెచ్చుధనార్జనచేసిన వారును అన్నివృత్తులందును గలరు. పరిపూర్ణత చేరువలో నగపడుచున్నప్పటికిని అపజయము చెందినవారు గూడ గలరు. ఇట్టి అపజయమునకు హేతువు ఆయువకుని జీవితచరిత్రయే చెప్పును. దీనినిబట్టి ఆ యువకుడు తనవిద్యార్థిదశయందు తగుశిక్షణ పొందలేదని, యీనాటి అపజయమునకు హేతువు చిన్ననాటి అశిక్షణమే నని గ్రహింపదగును. దేనికైనను క్రమశిక్షణ మవసరము. మైనారటీకాలమందు వేయబడ్డ పునాదియే చివరకు ఫలకారిగాగలదు. ఉత్సాహము, ఆసక్తి, నేర్పు, పట్టుదల గలయువకుడు జయించితీరును. ఇక అపజయముచెందువారు సహజముగ క్రమశిక్షణ లేనివారు, తమ్ముతా మెరుగనివారు, బాధ్యత యనున దెరుగనివారు, ప్రపంచజ్ఞానము లేనివారు. (సశేషము)

# గర్భనిరోధము

గోవిందరాజు రాఘవరావు

(Contra-Ceptne)

గతించిన ౫౦ సంవత్సరములలో హిందూదేశములోని జనులు నూటికి ౨౯ చొప్పున వృద్ధినొందిరి. ఇదే సమయమందు ఇంగ్లాండు వేల్సు దేశములలో నూటికి ౫౪ చొప్పున ఎక్కువైరి. మన దేశములో జనసంఖ్య అంత ఎక్కువ త్వరగా పెరుగకపోయినను నూటికి ౬౭ గురు వ్యవసాయము మున్నగు విశేష ధనార్జనకు వీలుకాని వృత్తులపై నాధారపడినప్పుడు మనదేశమున కీవృద్ధి చాలా అధికము. క్రీ. శ. ౧౮౮౧-౯౧, ౧౯౨౧-౩౧ లో పంటలు సరిగా పండి కలరా, ప్లేగు మొదలగు వ్యాధులు లేనప్పుడు మన జనసంఖ్య వెయ్యికి ౯౬ చొప్పుననూ, ౧౦౬ చొప్పుననూ పెరిగెను.

౧౯౩౧ వ సంవత్సరములో ప్రాణముతో పుట్టినది ౯౧ లక్షలు; మరణించినది ౬౬ లక్షలు. అనగా వెయ్యికి ౩౪ గురు పుట్టుట, ౨౫ గురు మరణించుట. ఇంగ్లాండు వేల్సులో ౧౦౦౦ కి ౧౨.౩, జర్మనీలో ౧౧.౨, యునైటెడ్ స్టేట్సులో ౧౧.౧, న్యూజిలేండులో ౮.౩ చొప్పున చనిపోయిరి. కొన్ని సంవత్సరములలో పుట్టినవారి సంఖ్యకన్న గిట్టినవారి సంఖ్య ఎక్కువ. ౧౯౧౮ లో పుట్టినది ౮౪ లక్షలు, చనిపోయినది ౧౫౯ లక్షలు, తరువాత సంవత్సరములో పుట్టినవారి సంఖ్యకన్న మరణించినవారిసంఖ్య ౧౦ లక్షలధికము. ౧౯౦౮ లో కూడా మరణించినవారి సంఖ్య ౧౦ లక్షలు ఎక్కువ. ౧౯౦౪-౨౪ లో ౧౯౧౨, ౧౯౧౩, ౧౯౧౪, ౧౯౧౬, ౧౯౨౨, ౧౯౨౭, తప్ప ప్రతి సంవత్సరములోను ఏదో ఒక రాజధానిలోనైన పుట్టినవారిసంఖ్యకన్న చనిపోయినవారిసంఖ్య ఎక్కువగానుండెను. మనదేశములో నెక్కువమంది చనిపోవుట ఎక్కువమంది పుట్టుట యొక్క కారణము. ౧౯౩౧ లో మనదేశములో ౧౦,౦౦౦ కి ౩౪౩ ఇంగ్లాండు వేల్సులో ౧౫౮, ఫ్రాన్సులో ౧౭౪, జర్మనీలో ౧౬౦, స్వీడెనులో ౧౪౮ పుట్టిరి. హిందూదేశములోపుట్టిన ౯౧ లక్షలలో ౧౬ లక్షలు నెలలపిల్లలుగానుండగనేచనిపోయిరి. మొత్తము చనిపోయినవారిలో పసిబిడ్డలుగా నుండి చనిపోయినది నాలుగవవంతు. ఆసంవత్సరములో ప్రాణముతో పుట్టిన ప్రతి ౧౦౦౦ శిశువులలో నెలలపిల్లలుగా నుండియే ౧౮౦ మరణించిరి. ౧౯౧౮ లో షుమారు ౨౬౦ మంది చనిపోయిరి. ౧౯౩౧ లో ఢిల్లీకెంటస్మెంటులో ౧౦౦౦ కి ౫౯౪, కమయుట్‌లో ౪౭౦, విశాఖపట్టణములో ౨౭౮ చనిపోయిరి. ఈక్రింది పట్టిక వల్ల మన దేశములో శిశుమృత్యువధికమని స్పష్టమగును.

| దేశము | ౧౯౩౧లో పుట్టిన శిశువులలో ౧౦౦౦ కి నెలల పిల్లలుగానుండి చనిపోయినది |
|---|---|
| బ్రిటిష్ ఇండియా | ౧౮౦ |
| ఈజిప్టు | ౧౬౦ |
| జపాను | ౧౩౨ |
| జర్మనీ | ౮౩ |
| ఫ్రాన్సు | ౭౬ |
| ఇంగ్లాండు, వేల్సు | ౬౬ |
| యునైటెడ్ స్టేట్సు | ౬౨ |
| ఆస్ట్రేలియా | ౪౨ |
| న్యూజిలేండు | ౩౨ |

ఏడాదిలోపున విశేషముగా చనిపోవుటే గాక, ఏడాదిదాటి పదునొకండవ సంవత్సరము రానివారిలో ౧౧,౭౯,౩౯౩ చనిపోయిరి. ౧౯౨౮-౧౯౨౯ సంవత్సరములలో మద్రాసు పబ్లిక్ హెల్తువారు పరిస్థితులను గమనించి తాడిపత్రిలోను, అనంతపురములోను ప్రసవించిన ప్రతి ౧౦౦౦ స్త్రీలకు ౩౯ బిడ్డ కానుపువల్ల మృతినొందినట్లు వ్రాసియున్నారు. తక్కువమందిపుట్టిన చనిపోవువారు తక్కువగా ఉందురు.

ఎక్కువమంది పుట్టుటవల్ల దేశములో ధనధాన్యాలభివృద్ధిచేయువారు తక్కువ. మనదేశములో ౧౯౩౧ లో ౧౦౦ కి ౨౫ గురు పదిసంవత్సరముల లోపు ప్రాయముగల పిల్లలు. పుట్టినవారి సంఖ్య తక్కువగానున్న ఇంగ్లాండువేల్సులో ౧౦౦ కి ౧౫.౮ మంది పదిసంవత్సరములలోపు ప్రాయము గలవారు. ఈపిల్లలు పెరిగి పెద్దవారైన ధనమార్జించిన, వారిని చిన్నవయస్సున పోషించుటకు వినియోగించినఖర్చు నష్టముకాదు. కాని మనదేశములో పుట్టినవారిలో ౧౦౦ కి ౫౬ మాత్రమే ౧౦ వ సంవత్సరము పూర్తిఅగువరకు జీవించెదరు. పశ్చిమదేశములలో నీవయస్సువరకు షుమారు ౮౦ మంది వుండెదరు. కనుక మనదేశములో ననేకులు నశించుటేగాక చాలాద్రవ్యము నష్టమగుచున్నది.

ప్రతిసంవత్సరము పుట్టువారిసంఖ్య తగ్గించవలెననుట నిర్వివాదాంశము. ఇది వివాహములు తగ్గించుటచేతగాని, సకటున ప్రతికుటుంబమునకు పుట్టుపిల్లల సంఖ్య తగ్గించుటవల్లగాని సఫలమగును. ౧౯౨౧ లో ఇంగ్లాండులో ౧౦౦ కి ౩౮ మంది స్త్రీలు పెండ్లియైనవారు. ౧౯౩౧ లో మనదేశములో ౧౦౦ కి ౫౦ మంది స్త్రీలు వివాహమైనవారు. ఇంగ్లాండులో స్త్రీలు ౧౫ మొదలు ౪౫ వ సంవత్సరమువరకు గర్భవతులగుదురు. మనదేశములో ౧౫ మొదలు ౪౦ వరకుమాత్రమే గర్భవతులగుదురు. గర్భము కాగలవయస్సులో నున్న స్త్రీలలో ఇంగ్లాండులో నూటికి ౪౯ మంది మాత్రము వివాహమై సంసారముచేయుచున్నవారు. మనదేశములో ౧౦౦ కి ౮౦ కన్న ఎక్కువమంది. ఎక్కువ మంది వివాహమాడుటయే గాక చిన్నవయస్సుననే పెండ్లియాడుచున్నట్లు యీక్రిందివిషయములు తెలుపును.

| వయస్సు | నూటికి వివాహముకాని స్త్రీలు | |
|---|---|---|
| | ఇండియా ౧౯౩౧ | ఇంగ్లాండు ౧౯౨౧ |
| ౦-౫ | ౯౬.౯ | ౧౦౦ |
| ౫-౧౦ | ౮౦.౭ | ౧౦౦ |
| ౧౦-౧౫ | ౬౦.౯ | ౧౦౦ |
| ౧౫-౨౦ | ౧౪.౯ | ౯౭ |

బాల్యవివాహములు మానిన జన్మించువారిసంఖ్య తగ్గును. కాని సంసారముచేయుటకన్న వేరువృత్తులు మనస్త్రీలకు లేనప్పుడు వయస్సుమీరునంతవరకు వివాహము చేయకపోవుట కష్టము. ఇప్పటికన్న ఆలస్యముగా వివాహముచేసిన జన్మించువారిసంఖ్య తగ్గును. కాని ౨౦ వ సంవత్సరమునకు తర్వాత వివాహము చేయనిచో పుట్టుకలసంఖ్య తగ్గుటకుబదులు హెచ్చునని బరోడా సెన్ససు కమిషనర్ వ్రాసినారు.

| పెనిమిటితో నుండుటకు మొదలిడినప్పటికి స్త్రీకివయస్సు. | పుట్టినపిల్లలు. |
|---|---|
| ౧౩-౧౪ | ౫.౭ |
| ౧౫-౧౯ | ౫.౮ |
| ౨౦-౨౯ | ౫.౨ |
| ౩౦, అంతకు ఎక్కువ | ౩.౫ |

స్త్రీ రజస్వలఅయినప్పటినుండియు షుమారు ౨౦ సంవత్సరముల వయస్సువచ్చువరకు సంతానము పొందుటకు తగినదారుఢ్యత క్రమముగా ఎక్కువగును; తరువాత క్షీణించును. ౨౦ సంవత్సరముల వయస్సు వచ్చువరకు ఆమె ఆరోగ్యము హెచ్చును. అందువల్ల ఆమెకు పుట్టినశిశువులలో మరణించువారు తక్కువగా నుందురు. ఇదియేగాక ప్రసవవేదనకు తాళగలశక్తికలిగి బిడ్డకాన్పువల్ల మృత్యువాతను బాలింతలసంఖ్య తగ్గును. బాల్యవివాహములు పోయి స్త్రీలకు సాధారణముగా ౨౦ సంవత్సరముల తర్వాత వివాహముచేయుట తటస్థించుటకు చాలాకాలము పట్టును. ప్రస్తుతపు ఆరోగ్య పరిస్థితులను పరిశీలించిన ౨౦ సంవత్సరముల వయస్సు గలస్త్రీ సహజముగా ౨౭ సంవత్సరములకన్న ఎక్కువ జీవించుట కష్టము. ఈవయస్సుగలపురుషులు ౩౦ సంవత్సరములకన్న ఎక్కువ జీవించుట సాధారణము కాదు. ఇంత అల్పాయుర్దాయులను దీర్ఘకాలము వివాహము లేకయుంచుట బహుకష్టము. ౧౫ సంవత్సరముల వయస్సు దాటినస్త్రీలలో ౧౦౦ కి ముగ్గురుకన్న ఎక్కువమంది వుత్తరమైనను వ్రాయను చదువను తెలిసినవారు లేరు.

వన దేశములో సరాసరిన మనుష్యునకు ౦-౮౮ ఎకరముల భూమి సేద్యమగుచున్నది. ఎన్ని ఫేక్టరీలు పనిచేయుచున్నను, విదేశములతో నెంత వ్యాపారమున్నను, ఎన్ని బ్యాంకులు పనిచేయుచున్నను, ఉత్పన్నమైనవానిని భేదము లేమియు లేక సమానముగా పంచినను మనుష్యునకు సంవత్సరమునకు షుమారు రూ ౬౦/ కన్న ఎక్కువసొమ్ము రాజాలదు. ఇంత బీదతనముతోను, విద్యావిహీనులుగాను చిన్న చిన్న గ్రామములలో నుండువారికి స్త్రీపురుష సంయోగము తప్ప యితర సౌఖ్య మేమియు లేదు. ౨౦ సంవత్సరముల ప్రాయము దాటినతర్వాత వివాహమాడుటగాని, అంతకు పూర్వము వివాహమాడి జితేంద్రియులై సంతానము పడయక యుండుటగాని దుర్లభము. జితేంద్రియత్వము వల్ల అనేకలాభములున్నను జన్మించుపిల్లలసంఖ్యతగ్గుట కొరకు వివాహమైన దంపతు లధికకాలము జితేంద్రియులై యుండవలెను. ఇది వైవాహికుల సౌఖ్యమునకు అనుకూలము కాదు. వివాహమైన యువకులు సంవత్సరమున కొకసారియైన రమించుటకన్న నెక్కువ జితేంద్రియత్వము తలంచుటకైన నసాధ్యము. ఇంత జితేంద్రియత్వమున్నను, ఆరోగ్యముగల స్త్రీ ౧౫ మొదలు ౪౦ వ సంవత్సరమువరకు గర్భవతికాగల కాలములో ప్రతిసంవత్సరమున్నూ గర్భవతిగానున్నూ పసిబిడ్డతల్లిగాను ఉండవచ్చును. అనగా పదునైదు, ఇరువదిమందిని కనవచ్చును. పశ్చిమదేశములలో మిగిలినవారికన్న ఎక్కువకాలము దాంపత్యవియోగముగల యుద్ధభటులును, ఓడలపై పనిచేయువారును, దీర్ఘకాలము పరస్థలములలో గడుపు వర్తకులును తక్కువ సంతానము కలవారు కారని అనేకగ్రంథములవల్ల విశదమగుచున్నది. వ్యాధులు, దుర్బలత్వము ఔషధములవల్ల మాన్పవచ్చును. కాని వ్యాధులు, దుర్బలత్వము ప్రారంభించకుండునట్లు చూచుట ఉచితము. తనకు వీలై, తనస్వాధీనములో నున్నపనిని విడిచి, యథేచ్ఛగా సంతానమును పొంది వారి సంరక్షణకై యితరులను పాటుపడమనుట అనుచితమేకాక నిష్ప్రయోజనము. గతించిన ఏబది సంవత్సరములనుంచి జనసంఖ్యకన్న ధనధాన్యములెక్కువ త్వరితముగా వృద్ధిపొందినను ప్రజలకు తగినంత ఆహారము లేదు. ఇకముందుకూడను ఇటులనే కావచ్చును. ప్రస్తుతపు ఆర్థికపరిస్థితులను గమనించగా నికముందు జనసంఖ్యకన్న ధనధాన్యముల ఉత్పత్తి అతిక్రమించినను అధికమృత్యువును నివారించుటకు తగినంత త్వరితముగా వృద్ధిపొందునని చెప్పుటకు తగిన ఆధారము లేదు.

కనుక గర్భనిరోధమువల్లనేగాని మరిదేనివల్లను అధిక సంతానమును తగ్గించ నలవికాదు. స్త్రీగర్భము ధరించి సుఖముగా ప్రసవించి, శిశువులనారోగ్యముగా తగు జాగ్రత్తగా పెంచగల శరీర దార్ఢ్యము కలుగువరకు గర్భవతికాకుండ తప్పించుకొనుటకును, పుట్టిన ప్రతి శిశువునకు మధ్య మూడు నాలుగుసంవత్సరముల వ్యవధియుండుటకును గర్భనిరోధమే అమూల్యసాధనము. గరుకు నేలపై నడుచునప్పుడు పాదము లరిగిపోయి బాధపెట్టకుండుటకు పాదరక్షల నుపయోగించెదము. ఎండగా నున్నప్పుడు శరీరసంరక్షణకై గొడుగునుపయోగింతుము. దృష్టిమాంద్యముగా నున్నప్పుడు కళ్లజోడు నుపయోగించుటవల్లనే సూక్ష్మవస్తువునైనను పరిశీలించవచ్చును. ఇటులనే ౨౦ సంవత్సరముల వయస్సువరకు గర్భవతి కాకుండుట కష్టమైనప్పుడు గర్భనిరోధమను వస్తువువల్లనే అధికసంతానమును దాని ప్రతిఫలమగు అధిక శిశు బాలమృత్యువును వేలకొలదిబాలింతరాండ్ర చావులను తగ్గించవచ్చును.


నే ఫోటో తీయించుకుంటా !!
నోరు మూసుకోండి
అయ్యో కంట్లో మెల్ల!
మొహం నిండా మచ్చలే
అంతా మాడిపోయింది
జుట్టు తెల్లగా పడిందేమి?
నీ మొగానికి ఫోటో కూడా వో అవతలవో!
ఫోటో ఒద్దు బాబూ జీవకళ పోతుంది.
KSB.

ఫోటో పిచ్చి




సుందరమూర్తి నాయనారుచరిత్రలోని యొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)




సంక్రాంతి ముగ్గు

ఆంధ్రమహాపురుషులు

# మోచర్ల రామచంద్రరావు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఇటీవల తీవ్రవ్యాధితో పోరుసలిపి విజయుడై, ఆరోగ్యవంతుడై ఈతడు తనబంధుమిత్రుల ఆతురపాటును అంతరింపజేసినాడు. మనపెద్దలలో నొకడైన ఈతడు తనగండమును గడచి మరల మనయందు మసలుచున్నందులకానందించుచు, ఈతని దీర్ఘాయువు నభిలషించుచు, ఇంచుక ఆలసించి అర్పింపదలంచిన పూవుచెండు నిపుడే ఈతనిపై విసరుచుంటిని.

హృదయము నుప్పొంగించు సుగుణములు కట్టెదుట కాంతిలినపుడే వానికి పుష్పాంజలి నీయ నాతురపడుదుము. విశాలదృష్టితో పరికించితిమేని రామచంద్రరావులో నిట్టి గానములు కొన్ని కానుపించకమానవు. కావుననే, ఆంధ్రమహాపురుషులం దీతనికి తావొసగితిని.

ఒకవ్యక్తిచరిత్రను విలోకించుతఱి కన్నుగట్టు గొనములను గ్రహింపవలెనని మక్కువపడుదుము. పుట్టుమచ్చలను, చిట్టిచొట్టికాటులను వెతుకదొరకొంటిమేని, కృష్ణపరమాత్మ జీవనమందుకూడ నట్టిసరుకు నెంతేని కాంతుము. మనుష్యజీవనమున నాశగొలుపు రక్తాభదశకే నామూడ్కులు పరతెంచును. రామచంద్రరావు సర్వసద్గుణములను మణిముకుటము చేసికొని, వేయికిరణములవేలుపువలె వెలుంగువాడుకాడు. కాని ఈతని జీవనమున కొంతకెంపుకాంతి కలదు. ఇట్టికాంతిని కాంచి హృత్తామరసము ప్రఫుల్లముఖము కాదా?

ఒకవ్యక్తి చరిత్రను చిత్రించుతఱి మనుష్యశక్తు లెట్టివో అవియెట్లు వృద్ధినందునో మనమూహింపవలెను. యోచన, సంకల్ప, భావనములను మూడుశక్తులకు మానవమానసము కేంద్రస్థలమయ్యు, సరిసముగ నివి ప్రతి మనుజునియందును వృద్ధిగనుట సకృత్తు. రవీంద్రునకు గలభావనాశక్తి గాంధికి లేదు. గాంధికిగల సంకల్పశక్తి రవికవికి లేదు. గాంధివలె రవీంద్రుడు సుదర్శనచక్రమునట్లు రాట్నమును త్రిప్పలేడు. రవీంద్రునివలె గాంధిజీ మంత్రశక్తిగలలేఖిని జేబూని రవిమరీచికలకెనయైన పద్యపంక్తులను వసుంధరపై చిమ్మి దిశాంగనల జేజేల నందజాలడు. ఇట్లనిన ఆతనివలె నీతడు ధన్యుడు కాడని కాని, ఈతనివలె నాతడు ఘనుడు కాడనిగాని తెలుపజెల్లదు. గాంధికి లెనిన్, జగుల్ పాషా, కెమల్ డివెలరా సన్‌యాట్‌సెన్ లవోలె కర్మవీరు లెట్లు మహాపురుషులో, రవీంద్ర, రాధాకృష్ణ, రస్సెల్, రోలండ్, మెటర్‌లింక్ నగోచీలవంటి మహావిజ్ఞానులును అట్టి మహాపురుషులే. కర్మవీరునకును, కళోపాసకునకును కావలసిన హృదయ సంపద ఒక్కటియేయయ్యు, వీరిగుణములు వేఱురీతుల వెలుగొందును. జగదీశుని తేజము ఒక్కొకపుడు సూర్యకాంతియట్లును, వేఱొకప్పుడు చంద్రాలోకమట్లును వెలారుచుండును కదా.

నాగేశ్వరరావు,పట్టాభిమున్నగు కాంగ్రెసునాయకుల మానసికగ్రథనమునకును, చింతామణి రామచంద్రరావులుపోలు లిబరల్‌నాయకుల హృదయనిర్మాణమునకును ఎంతేనివ్యత్యాస మున్నది. కాంగ్రెసు మహాంగణమున క్రియకు చోటెక్కువ; లిబరలుశిబిరమందో, వాచాలత్వమునకు ప్రదేశ మెక్కువ.

క్రియాంగణమునగాక, పఠనాగారములో విశేషపరిశ్రమచేయుటందు రామచంద్రరావునకు ప్రీతి మెండు. ఎట్టివిషయ మెంత గట్టిదైనను, పిడిగ్రుద్దుచే దానిని పిండిముద్దచేయగలదిట్ట ఈతడు. రాజకీయవేత్తకు వలసిన ప్రధానగుణములలో నిది యొకటి. సూక్ష్మపరిశీలనము, దూరదృష్టి, జ్ఞానపిపాస, మానసతత్త్వ పరిజ్ఞానము, క్రియాకౌశలము, నిరుపమానధృతి, త్యాగశక్తి నాయకున కుండవలయు ప్రధానలక్షణములు

వీనినన్నింటిని కలవా రెందఱో ఉండరు. దూరదృష్టి నెఱుగక, అహంభావమునుకూడ నెఱుగక ధైర్యసాహసములను, నిర్మలచిత్తమును, నిస్తులభక్తిని కలవ్యక్తి సైనికుడు మాత్రము కాజాలును. ఆంధ్రకేసరి ప్రకాశము ఇట్టివాడు. గట్టిమెదడునకుతోడు, పెద్దయోపిక గలిగి ధైర్యసాహసములందు శుద్ధపూజ్యుడైన మనుజుడు నాయకుడగుటకు తగడుకదా సైనికుని దాపుననైన నిలుచుట కర్హుడుకాడు. కాని ఈతడు నాయకున కక్కరైనవ్యక్తియని చెప్పకతప్పదు. నాయకునకు సమక్షమందుండునది క్రియాంగణము; యిందీతడుండడు. వెన్నతట్టున బంటు లుందురు; వీరియందును ఈతడుండడు. కుడివైపున సంగరక్షకులుందురు. వీరిలో నీతడు కానరాడు. ఎడమదెశ మంత్రులుందురు, వివిధవిషయపరిజ్ఞానమునకు వీరు నిక్షేపములు. ఈనిక్షేపములపై కన్నుంచియే నాయకుడు ముందంజ వేయును. రామచంద్రరా విట్టినిక్షేపము. రూజ్ వెల్ట్ మున్నగు నాయకులకుకూడ ఒక్కొకవిజ్ఞానశాఖయందొక్కొక్కమనీషి మంత్రియై నిలుచు టెఱుగుదుము. నాయకునకు దీర్ఘయోచనకూడదు. చేతికడ సరియైనసచివు లున్నపుడే ఆతనికి దీర్ఘయోచన తప్పును. రామచంద్రరా విట్టి సచివుడనుట నిస్సంశయము.

అర్థశాస్త్ర, న్యాయశాస్త్ర రాజకీయశాస్త్రాంశములందలి కొఱుకుపడని కొయ్యలను చేజిక్కించుకొనిన గట్టిఘటము కావున ముఖ్యమైనచర్చలం దీతడుండకతప్పినది కాదు. ఈరీతి ప్రజ్ఞ జూపినవారు భారతీయులందు కొలదిమందిమాత్రము కలరు. వంగదేశమున నీతని కెనయైనవాడు రమేశచంద్రదత్తు. మహారాష్ట్రమున నీతనికీడైన మహనీయుడు గోపాలకృష్ణ గోఖలేమాత్రమే! తమమాటలను తూచిగాని ఈమూవురువ్యక్తులు వెలువరింపరు. రమేశ రామచంద్రరావులు వక్తలుకారు. జనసామాన్యముచే తన్మయనృత్యము చేయింపజాలు వచఃకౌశలమును వీ రెఱుగరు. కాని దేశమును తఱచుగ ప్రతిఘటించు క్లిష్టసమస్యలు వీరివలనగాని వట్టివక్తలవలన చిత్తుకావు. కొండదొలిచి మూలబెట్టవలెననిన కండకావలెను, ఓపికకావలెను, పట్టుదల కావలెను. పులి నెదుర్కొనవలెననిన చక్కని ఉపాయము చేతి కందవలెను. తేటగీతలకును, ఆటవెలదులకును సభాంగణమున నెంతేని చో టున్నది. ఇవి మధురమంజుల కాలక్షేపముల వంటివి. పనిముగిసిన తర్వాతగాని వీనియెడల నెవ్వరికిని మక్కువ పుట్టదు. సరోజినీవాక్కులు గంధర్వులను మంత్రముగ్ధులను చేసి తీఱును. దివ్యపారిజాతమునుండి రాలుపూలవలె ధుక్కలీమెశిరమున జలజలరాలును. జటిలసమస్యలం దీమె కలస్వనము పనిచేయదు. శ్రీనివాసశాస్త్రి మంచిముత్తెములుపోలు పలుకులేరి శుభాక్షతలట్లు శ్రోతలచిత్తములపై వానిని చల్లి 'శభాస్!' అనిపించుకొనగలడు. ఈతడు కాపురముచేసినది సాహితీ వధూటితోడనే! సైన్స్‌బ్రెయిను గల తమిళులందు కళోపాసనమునకు వలయు హృదయవిభూతి ఇంచుమించుగ హుళక్కియని చెప్పిన జెప్పవచ్చును. అరవలం దమరుడై పుట్టిన ధన్యు డీత డొక్కండే! కళోపాసకుడన నమరుడని నే నర్థము చెప్పచుందును. కళోపాసకుడు సుకుమారి. కొండవంటి అర్థశాస్త్రమును శ్రీనివాసశాస్త్రి పిడికిట నిముడు కలకండముక్క గావించుకొనలేదు. చెమ్మటలోడ్చుట ఈతనిప్రకృతికి ప్రతికూలము. ఈతడేయననేల, భారత రాజకీయములందు ఆచార్యపీఠము నలంకరించిన సురేంద్రుడైనను ఇట్టి పరిశ్రమకు పూనుకొనలేదు. సురేంద్రుడు ప్రతిభాశాలియైన రచయిత; సాటిలేని మహావక్త. శాస్త్రవేత్తలం దీతడు ప్రధానప్రదేశము నాక్రమింపలేదు. మహాపండితులం దీతడగ్రస్థానము నందెనని చెప్పలేము.

ఒకప్పుడు కలకత్తాటౌనుహాలులో జరిగిన మహాసభయందు సురేంద్రరమేశులు ప్రధానవక్తలుగా నుండిరట. మేఘపంక్తియందు నుండియుండి, ఏలనో నేలరాలుటచేకాబోలు సహజకంఠస్వరమున గర్జించి సభాంగణము నీతడు ఘుమఘుమారావముచే ప్రతిధ్వనింపజేసినాడు!

నీలనీరదమునకు విద్యుల్లత ప్రియురాలుకాబోలు! ఆలింగనము నాసబెట్టి మేఘునిఘనహృదయమున నట్టె తోచి, తననైజగుణమును విడనాడలేక తటిచ్ఛల మంత

ర్షితయై దూరమునుండి దాగరమూత లాడుచుండును కదా! సౌదామినీ సంశ్లేషము నాశించియే కదా ఘనుడు మంజులరవ మొనరించుచు వర్ష గీతికల నాలాపించును! ఇట్లని యెఱిగియేకాబోలు మహాకవులు ప్రేమ ధారను, కరుణాధారను వర్షధారకు పోల్తురు!

"The quality of mercy is not strain'd,
It droppeth as the gentle rain from heaven
Upon the place beneath;

(Vide: Act IV; scene 1 Shakespeare's "Merchant of Venice")

మేఘుని గురుగుణములను స్మరించియేకదా తారకాంగనాపరివృతుడై హరిణాంకు డపుడపు డాతనిదాపున జేరుచుండును! దివినుండి జారిపడిన జలదము సురేంద్రుడంటినికదా! ఈతనిహృదయమును సాహితీవిహాయసమున మసలువిద్యోతము మాటిమాటికి తాకుటచేకాబోలు హృదయసముద్భవమైన ఈతనివాక్కులం దెన్నో మెఱుపులు దళ్కొత్తుచుండెడివి! ప్రియురాలిస్పర్శ ప్రియుని హృదయమున పులకలు లేపును. స్పర్శ బూదెవలె శరీరమునంటి నేలరాలును. అది అంతరంగమున జొచ్చి అపూర్వ అద్భుతభావమును సృష్టించును. స్పృశించిన వస్తువందలి భావ మెట్టిదో సృష్టినందినభావమును అట్టిదియే! సాహితీ వియత్తలమందలి సౌదామిని ఎవరు? ఇది కొండొక ఆధ్యాత్మికశక్తి. కళోపాసకులహృదయములను స్పృశించి ఇది దివ్యభావములను సృష్టించును. సురేంద్రునిశైలిని పరిశీలించితిమేని మన కిట్టి సృష్టి ఎంతేని గోచరించును. ఈ శైలియందే చుక్కలసొబగును, పండువెన్నెలను కాంతుము. సురేంద్రుని వాక్కులు? అవిరళవర్ష గీతికల ట్లివి ధారాళమైనవి కావా? సురేంద్రుడు గద్యయందు మాటలాడు మహాకవి.

కాని, కొంపకు నిప్పంటుకొన్నపుడు కవిత్వము పనికి వచ్చునా? మనసునంశి సెగలును పొగలును లేచునపుడు తేనెచుక్కలు గరళపు బొట్టులట్టులు కంధరనాళమందు పడవా? మహాకష్టము తలపై డుల్లిపడుచుండ గోవర్ధనమట్లు దానిని చిటికినవ్రేలిపై నిలిపియుంచక, జేలయైనగోపికవలె కవి తాను గగ్గోలుపడి ఒరులను కన్నీళ్లందు ముంచివేయును. ఎన్నెన్నిమాఱులో ఎందఱెందఱినో మంత్రముగ్ధులను చేసి వదలిన సురేంద్రుని వచోనైపుణ్యము నాటిసభయందు శ్రోతలమనసులకు పట్టపగటి భామకలాపమువలె బాధకలిగించినదట! వక్తకాని రమేశుడు మూడుబళ్ల లెక్కలను ఎంతో ఓపికతో మూటగట్టి తెచ్చి, వానిసాయమున నెదుటిసమస్యల కలరూపు సభ్యులకు చూపి, జటిలాంశములను అవటిపండ్లనట్లు ఒలిచి వారి మనసుల కందించెనట! ఆతురపాటుతో నిండినవారి మనసులకు రమేశునివాక్కులు వింజామరలైనవట.

కావున రమేశరామచంద్రరావుల పోలు పండితులు రాజకీయక్షేత్రములందు నిలువకతప్పదు. ఇట్టి మనీషులు లేకున్న, ఒక్కొకపుడు దేశము అల్లకల్లోలమందు బుడుంగున మునిగిపోవునని నొక్కి చెప్పుదును. వక్తకు కల యైశ్వర్యము ఆవేశము. దీనియం దుబుకు బుడగలు ఒక్కొకపుడు పదునాలుగు భువనములను గుటుక్కున మ్రింగివేయగలవు! రాజకీయ రంగమున మహావక్తయని పేరుపడసిన ప్రతి అదృష్టవంతుడును దూరదర్శియైన రాజకీయవేత్త (Statesman) యని చెప్పజెల్లదు. విమర్శించు తెలుగని బహుళసంఖ్యాకులు కమలభవ నర్తనుచుట్టు నాట్యమొనరించు వేల్పువెలప లందులట్లు వాగమృతధారలు కురిపించు వక్తచుట్టుచేరి తాండవనృత్యము సలుపుదురు. ఆడుచు పాడుచు ఒక్కొకపుడు ఉత్సాహస్రవంతియందు వీ రెందరో కొట్టుకొనిపోయి తుట్టతుదకు "అయ్యో!" అని దీనావ మొనరింతురు. వీరిపోకచూచి "అయ్యలారా! ఈరపరుగులును, ఈయుఱుకులును కూడవు." అని దూరదృష్టిగలవ్యక్తి యెవ్వడేని తొలుత చెప్పినయెడల నతడు పిఱికిపందగనో, పిచ్చివానిగనో, దేశద్రోహిగనో ఎన్నబడవచ్చును. మానవులందు నూటికి తొంబదుగురు మూర్ఖులనియు, తామే మేధావులమని యెంచి, పదుగురు విజ్ఞానులను మొఱుకులని పలికి, వారిని వీరు హింసపెట్టెదరనియు కాలము కడచినగాని నిక్కము తేలదని యూ, ఏసు, సోక్రటీసు మున్నగు మహనీయుల జీవన

చారిత్రములే ఈసత్యమును వేయినోళ్లుల జాటుచున్నవనియు జాన్ స్టూవర్ట్ మిల్ (Vide: J. S. Mill's "Utilitarianism") పలికినాడు. ఇట్లనిత సుత్సాహవంతు డెన్నడును తప్పుదారి త్రొక్కువాడనియు, ఉత్సాహము నెరుగక నిరంతరము తలపోతయందు మునుగితనీరువాడు కల్యాణపథము దెస కాలుకదపుననియు తలపరాదు. అతని కీతడు తోడుకావలెను; ఈతని కాతిడు తోడుపడవలెను. రెండురీతుల ప్రజ్ఞగలవా రెందరో ఉండరు. అట్టివారు లేనితతి అతడును ఈతడును అవినాభావసంబంధమున మెలగవలెను. తొలుతటి వ్యక్తి హృదయసంపదను, రెండవవ్యక్తి మేధస్సంపదను వ్యక్తపఱచును. అమ్మకు అయ్య తోడసునట్లు, అలికి మగడు జతయైనట్లు అతని కీతడు నెచ్చెలికావలెను. శ్రీనివాసశాస్త్రివంటి వక్త చెంగట రామచంద్రరావు పోలు పండితుడు తప్పనిసరిగా నుండవలెను. వీరిరువురకు సంకల్పశక్తిసమన్వితుడైన వ్యక్తి తోడుపడినపుడే వీరు క్రియాంగణమున చరచర సాగిపోజాలుదురు. మూడవశక్తిగల చెలిమికాడు వీరిదళమం దొక్కరుండును లేనందున నీమహాశయులు కురుక్షేత్రమున తమ తేరును నడుపజాలరైరి. తమ జీవనమును 'ధర్మక్షేత్రమైన కురుక్షేత్ర'మని యెంచువారు కాంగ్రెసుపక్షీయులని చెప్పకతప్పదు. "లిబరలుదళమం దిట్టివారు లేరా?" యని కొందరు ప్రశ్నింపవచ్చును. ప్రజాభ్యుదయమునకై ఆత్మజీవనములను బలిదానము గావించుటకు సంశయింపనివ్యక్తి ఒక్కడును ఇంకను ఈదళమందు ప్రత్యక్షము కాలేదనిన సత్యమునకు తలవంపులు రావు. ఇతరులమాటయటుండ మనదృష్టియందలి వ్యక్తికి ఈ యమృతశక్తి లేదు.

రాజకీయదళములందు మంచివిద్వాంసు లున్నారు. విద్వాంసులందఱు మహాపురుషులుకారు. వీరిలో పలువురు కాపురుషులుకూడ నుందురు. విద్యావిహీనుడైన కాపురుషునికంటె విద్వాంసుడైన కాపురుషుడు సంఘమునకు అధికారిష్టము కలిగించును. విద్యారహితుడు దుష్టుడగుచో తనదౌష్ట్యమున కాతడు మేలిముసుగువేయ నెఱుగడు. విద్వాంసుడు దుష్టుడగుతతి తన దురవృత్తికి గిల్టుపూతపూసి దానికి మోహినియా పొసగి ప్రజలందు దానిని విడచును. జగన్మోహినియని భ్రమపడి పలువురు దాని వెంటబడి దానినోటియందు గోరుముద్దలగుదురు. నీతి నిబంధనములను కలలోనైనమూడక సంఘజీవనముపై నిప్పులురాల్చు విద్యాధికులు మనదేశమం దీవఱలో నెన్నడును పుట్టియుండలేదు. మన రాజకీయ వేత్తలెవ్వరును దౌర్జన్యమునకు జేజేలు పాడలేదు. లిబరలు పక్షమువారైనను, జస్టిసుపక్షమువారైనను కత్తి చేబూని అభ్యుదయము నందవలెనని కాంక్షింపలేదు. అన్యదేశ చరిత్రలను విప్పిచూడుడు. అందలిపుటలు రక్తాంములైయుండ జూతురు.

కాని మన లిబరలు జస్టిసుదళములందలి మహనీయులలో స్వార్థముపై నెక్కువమక్కువ చూపునారున్నారు. ఏదోఒకవృత్తి నవలంబింపవలెను కదా యని ఈదళములందు ప్రవేశించినవా రనేకులున్నారు. వృత్తివలన పొట్ట నిండవలెను; పేరుపెద్దదికావలెను. ఈ రీతియున్నతి కాంక్షించువారికి స్వర్గమువఱకు నిలిచిన సోపానములు రాజకీయములందు గోచరించితీఱును. వీరి దేశభక్తి సభాంగణమందు కావలసినంతయుండును. ఈదేశభక్తిని తెరనెనుక స్వార్థదేవతకు వీరు నైవేద్యముగా నర్పింతురు! వీరి యుద్దేశములు సద్యోగర్భమును దాల్చి ముద్దుగొలుపుఫలములను వీరిచేతి కందించును. ఐహికోన్నతి ఆరాధ్యదేవతయైనపుడు ఆముష్మికజిజ్ఞాస అగ్నికుండములో చిటచిటలాడదా? ఇట్టి జిజ్ఞాసను చూచి పండ్లికిలించువా రనేకులు లిబరలు జస్టిసుదళములందు కోతికొమ్మచ్చు లాడుచున్నారు. వీరిలో కొందఱు మంత్రులు; మఱి కొందరు సామంతులు. వీరి గొప్పదనమును గుడిగోపురమని యెంచి దానికి కేలొగ్గుచున్నవారు గాంధియుగమున లేరు. జనసామాన్యము నేడు క్రొత్తకన్ను నందినది. పామరులు విజ్ఞానులు కాకపోవచ్చును; విమర్శకులు కాకపోవచ్చును. కాని వీరికన్నులకు కల కాంతి, వీరిమనసులకు గల వాడి కొందఱువిద్యాధికులకు కూడ లేదనుట కెన్నేని దృష్టాంతములున్నవి. వేషభాషలను

చూచి ఒకని విలువకట్టు దినములు సుమారు పదునే నేండ్లకుమున్నె చచ్చి స్వర్గమును చేరుకొన్నవి. స్వార్థమునకే తెగబలిసి అంకెలువేయు సెట్టికట్టిగిత్తనైనను చూచి "శ్రీ వేంకటేశా!" యని నే డెవ్వరును చేతులు మోడింపరు. స్వార్థరహితుని ప్రత్యక్ష దైవతముని యెంచి ప్రజ లాతని నేడు పూజించుచున్నారు. కనులు విప్పియే ఎదుటివిగ్రహముపై వీరు కదళీఫలమును విసరుదురని ఇటీవలి యెన్నికలు జగతికి తెలిపినవి.

రామచంద్రరావు చింతామణులపోలు లిబరలు వర్గజములు స్వార్థపరులని చెప్పజెల్లదు. వీరి కుద్యోగకాంక్ష లేదు. కాంగ్రెసు పుట్టినపుడు వీరు దానిచుట్టు జేరి లాలిపాటపాడినవారే! నాడు కాంగ్రెసు చర్చలందును, ఉపన్యాసములందును కాలము కడపుచుండెడిది. పరిస్థితులు మారినకొలది ప్రణాళికలు మారును; పద్ధతులు వేఱగును. కాలము చప్పచప్పన ముందంజవేయుచున్నను అర్ధశతాబ్దమునకు మున్నెతా నెందు నిలిచియున్నాడో నేడును రామచంద్రరావు అందే నిలిచియున్నాడు. పరిస్థితులు దురంతమై కట్టెదుట పైశాచిక నృత్యము సలుపుచుండ ముక్కుమూసికొని తారకమును జపించునాతడు పదుగురచే నేమనిపించుకొనును? ఇది మీనమేషములు లెక్కించుటకు పరిపడుసమయమా? లేచినిలువవలసినవేళ, నిలిచి ముందునకురుకవలయువేళ జటికిలపడియుండు మహాశయుడు శాంతమూర్తి యనిపించుకొనునా ? ఇట్టిశాంతము పిఱికితనమునకు పర్యాయపదము కాదా ? ఇది దౌర్జన్యముకంటె నిష్ఠురమైనది కాదా ? భారతప్రజలు కూడుగుడ్డలు లేక గగ్గోలుపడుచుండ మూడుదశాబ్దులకుమున్నె నెలకొనిన లిబరలుదళము చేసిన దేశసేవ యేమి ? ఏడాది కొకపర్యాయ మే మహాపట్టణమందో కూడుకొని సన్నాయినాదినంతన ప్రజలయిక్కట్టులు గట్టెక్కునా ? ప్రజలు మలమల మాడుచుండ లిబరలునాయకులు పప్పుభప్పశములు కొట్టుచుండుటలేదా ? కట్టగుడ్డలేక పేదలల్లాడుచుండ సీతాకోకచిలుకలట్లు రంగుదుస్తులందు వీ రెగయుచుండుట లేదా ? పల్లెలనుండి దీనారవములు వినబడుతటి మోటారులందు దొరలివలెనో, విమానములం దెగసియో వీరు రాయబారములు సలుపుదురు ! కూనిరాగములు తీయుచు ప్రభువులకు మహాజరు లందింతురు ! తమ పిటీషనులు, తమ డిప్యుటేషనులు కొరగానివని యెఱిగి వీరు క్రొత్తతెన్నును - శాంతియుతమై భారతప్రకృతికి, భారతసంప్రదాయమునకు అనుకూలమైన వేఱొకతెరువును పట్టిరా ? వెనుకటిపాటనే వీరు పాడుచున్నారు. వెనుకటిఆటనే ఆడుచున్నారు. డెమక్రసీనిగుఱించి కలస్వనమున రాగమాలిక లాలాపించుచున్నారు! రాజకీయములం దింకను జొరపడని రాధాకృష్ణుడే ఈరీతి డెమక్రసీకూత అడవిలోని ఈరెలుంగనికదా నిన్నగాక మొన్న నాగపురములో పలికినాడు! *

స్వరాజ్యసంపాదనము నిరుపేదలకు కూడుగుడ్డలిచ్చుటకేయని ఒకప్పుడు జవహరలాల్ పలికినాడు. నిక్కము. కాని, ఆర్థికసమస్యా పరిష్కారమునకు తోడు భారతోద్యమముకతన ననేకసమస్యలు పరిష్కారము కావలెను. మానవునకు వలసినది అన్నపుకబళమే కాదు" ("Man does not live by bread alone") అనికదా ఏసుక్రీస్తు పలికినాడు! ఏసుఅనుచరు లీ పాఠము నంతగా పాటింపలేదుగాని నేడు కూడుగుడ్డలకు కొఱవడిన భారతీయులే దీనిని పాటించుచున్నారు. శరీరమునకును, మానసమునకును, ఆత్మకును ఐహికజీవనమున సంబంధమున్నట్లు మానవుని ఆర్థిక, నైతిక, ఆధ్యాత్మికోన్నతికి దగ్గఱి చుట్టఱికమున్నది. ఈచుట్టఱికమును గుర్తింపక, కేవలము ఆర్థికోన్నతిమీదనే

*"So long as the masses of India are suffering, it is crying in the wilderness to talk of democracy. If they wanted to be true patriots, they should bring the essential conditions of civilised life to remove the miseries of masses... If they wanted self-rule, they must shake off demoralisation. "Vide Radhakrishnan's address delivered at the Morris College, Nagpur, on the occasion of its Golden Jubilee.

అధునాతనపృథ్వీజాతులు కన్నునిలుపుటచేతనే ఆసమస్య పరిష్కృతము కాకపోవుటేకాక, ప్రపంచమంతయు నేఁడు కార్చిచ్చుతోడను, విషవాయువులతోడను నిండియున్నది. పూతవారిని ఉపాసకుడు సూర్యున కర్ఘ్యమిచ్చులీల, భక్తిమెయి మానవు డుత్తమాశయములకు ఆత్మజీవనము నర్ఘ్యమీయ సమకట్టిననాడే "భర్గోదేవస్యధీమహి" యని ఈత డుచ్చరించినంతన జ్ఞానాలోకముతోపాటు ఆరోగ్యమును, ఆహారమును, ఆనందమును అవనియందు అవతరించితీఱును. ఆహారమునకై జరుగు పెనగులాట అంతర్హితమైననాడే వసుంధరయం దవలీలగ నాహారము లభించును. ఒకనిని దిగద్రొక్కి రెండవవాఁడు లేచుటే మనుష్యజీవనమందలి ప్రధానధర్మమనియు, నెగ్గినవాఁడే వీరుఁడనియు పాశ్చాత్యనాగరకత జలదగంభీరస్వరమున తెలుపుచున్నది. "Survival of the fittest" అను సిద్ధాంతమునకు భారతచరిత్రయందు చోటులేదు. పరగంగలవలె మానవులందు ఇష్టవిహారమునసలుపు దుష్ప్రవృత్తు లన్నిటికి గన్నతల్లి యగుచున్న రక్కసి ఈ సిద్ధాంతమే! పెనగులాటలో నెంద ఱెందఱు పడి చావరు? మనుజునందలి దైవతము శాంతిని కాంక్షించును; పిశాచము పోరు నభిలషించును. దైవముమీఁది మ్రొక్క అడుగంటుటచే ఎట్టిప్రతిఘటనము నెఱుఁగకవ పిశాచము నేఁడు పెచ్చిల్లి జగము నేల జూచుచున్నది. కండబలముగల జాతులు "Sermon on the Mount" పునశ్చరణ చేయుచున్నవి కాని, దాని నార్పివేయుట లేదు. క్రైస్తవబోధకులు భారతీయులకు నీతిపాఠములు కఱపుదురట! క్రైస్తవమతమునకు పీఠస్థానమైన రోమునుండియే ఇపు డాగ్నేయాస్త్రములు అబిసీనియాలోని నిరుపేదలపై పడుచున్నవి! ఈ దుర్దాంతదృశ్యము మాపుకొనవలెనని మానవసంఘమునుండి అంతర్హితమైన అనురాగము పునరుద్ధరణము నందవలెను. సూర్యతేజముకతన బహువిధ జీవరాసులు తలసూపు తెఱఁగున మానవమానసదిగ్వలయమున ననురాగము పొడసూపినంతన మనుష్యసంఘమున కనంతశోభనుచేకూర్చు సద్గుణము లెన్నో తలయెత్తును. ఆలోకము తోచినంతన నంధకారము పరతెంచునట్లు అనురాగము తోచినంతనే స్వార్థకాంక్ష పటాపంచలగును. * సంఘీభావము, త్యాగము, శాంతి త్రిమూర్తులై వసుపతినేలును. ఇవి నెలకొనవలెనని నాధ్యాత్మికదృష్టిగల మహోద్యమమొకటి పొడుపుకొండవలె పొడసూపవలెను. ఈదృష్టిగలది మహాత్ముఁడు నెలకొలిపిన మహోద్యమమొక్కటియే. ఈయుద్యమము మతమహత్త్వముపై నాధారపడినది. మతమనినంతన మండిపడువారును, ఉత్తమాశయములనినంతన కనుతెఱ్ఱచేయువారును కొందఱున్నను ప్రపంచమందలి మనీషులందఱు వీనికతనగాని శాంతి దృగ్గోచరముకాదని తెలుపుచునేయున్నారు. * గాంధిజీ విజయపతాక మెత్తినముహూర్తమందే ఐదుఖండములందును జయదుందుభులు మ్రోఁగునని రోలండు సండరులెండులు పలుపాశ్చాత్యవిజ్ఞానులే వాకొనిరి. గాంధిపేరెత్తకున్నను గాంధియుద్యమమునూ మెత్తకున్నను, రాజకీయములందు ప్రవేశింపని మనీషులును, తక్కుంగలవారును ఆతనిపూనికను వహించిన బలయుతభిత్తికలైన ఉత్కృష్టాశయములపై దృష్టిపఱపి, వీనిని భారతభావినాయకులైన నేటియువకు లలవఱుచుకొనవలెనని తెలుపుచున్నారు. వివిధవిశ్వవిద్యాలయస్నాతక మహోత్సవములందు రాధాకృష్ణపండితు డిట్టిభావమునే వ్యక్తీకరించినాఁడు. లక్నో అలహాబాదుకాన్వొకేషన్ సమయములందు రాధాకృష్ణుఁడు గాంధిప్రధానఅనుచరులలో

* రవీంద్రు డేమనినాఁడో తిలకింపుఁడు. "We have our greatest delight when we realise ourselves in others;' and this is the definition of Love."

*"Religion has become an agent of peace, because it has been an effort, at once ordered and mystic, toward all that is highest in human nature" Prof. Theodore Rienach

"Religion gives a man moral courage which loves and heals and blesses all "— Theodore Parker.

నొక్కనివలె, కాంగ్రెసుమహానాయకులలో నొక్కనివలె మాట్లాడినాడు. గాంధిమా తెత్తకున్నను, మానవునందలి పశువు నేలకూలినగాని, ప్రపంచశాంతికై మనుజుడు మహాత్యాగముచేయ సమకట్టినగాని అది చేకుఱదని పలుమా ఱాతడు జినీవామహాసభలో చెప్పినాడు. రాధా కృష్ణుడు వేదాంతి; శాంతికాామి. మనుష్యసుఖము నపేక్షించిన ప్రతిమహావ్యక్తి ప్రతియుగమందును, ప్రతిదేశమందును ఈతనివలెనే పలుకుచుండును. "May my name be accursed so that France be free" అనిన ఫ్రెంచిమహాపురుషుని వాక్కునందలి మహత్త్వమును గుర్తించితిరా? నిన్నగాక మొన్న అలహాబాదు విశ్వవిద్యాలయస్నాతక మహోత్సవ సమయమున నుపన్యసించిన భోపాల్ నవాబు మననేలయందు మరల నుత్కృష్టాశయములు కుసుమించి తమ దివ్యసౌరభముచే విశాలవిశ్వమును పూరించవలెననికదా వాకొనెను! *

వీరినుడువులం దెంతేని సత్యమున్నది. కాంగ్రెసున కవ్వలగల ఇతరవ్యక్తులే దీనిని గుర్తించియుండ కాంగ్రెసున కవ్వలగల భారతరాజకీయవాదులు దీనిని గమనింపకుండుట శోచనీయము. గాంధియుద్యమములోని ఆధ్యాత్మిక పటుత్వమును, గాంధిరవీంద్రుల దృష్టియందలి ప్రాపంచికశాంతిని గుఱుతించి ఆమహోద్యమమునకు వీరుబుజ మొడ్డియుండినయెడల భారతజాతికి స్వరాజ్యము చేకుఱియుండుటేకాదు సమస్తపృథ్వీజాతులకు నిక్కమైన అంతరంగికస్వరాజ్య మీవఱలోనే చేకుఱియుండెడిది. పృథ్వీరాజకీయముల నీవఱలోనే సంయమియు నడపియుండలేదు. రాజకీయములకు మతమును మూలబంధముచేసిన మహాత్ము డీవఱలో ప్రపంచమం దేకడనైనను పుట్టియుండలేదు. రాజకీయరంగమును నిమిత్తమాత్రము కావించుకొని మానవసంఘమున ధర్మమును ప్రతిష్ఠింప దొరకొని తనయుత్కృష్టాశయమునకు తనరక్తమాంసములను నైవేద్యముగా సమర్పించిన మహాపురుషు నెవ్వని ప్రపంచేతిహాసము లీవఱలో నెన్నడును చూపియుండలేదు. గాంధిపీల్చువాతావరణమందే మసలి, దానినే పీల్చునదృష్టము తమకు చేకుఱినందులకు రవీంద్రాదులుమురిసిపోవుచుందురు. సూర్యకిరణముల నుష్ణిమము గావించుకొని తేజరిల్లు మహాత్మునియుద్దేశములపై పలువురుపాశ్చాత్య మనీషులు ముత్తెపుసేసలు చల్లుచుందురు. మనదేశదౌర్భాగ్యముకాబోలు, మనలిబరలునాయకులును, జస్టిసుసోదరులును గాంధియుద్యమమందలి మహత్త్వమును గుర్తించిరి కారు. అతనికి చేయూత నిచ్చుటకు వీరిమనసు లొప్పినవి కావు. మిన్నకొనిరైన నుండక వీరిలో పల్వురాతని యుద్యమముపై కస్సుబుస్సులు పోసి, పెద్దపాగాలుచుట్టి పెద్దయుద్యోగములకై పరుగులెత్తిరి. ఈపరుగులందు తాను పాల్గొనకపోయినను, దేశభక్తులు చొరవలయు క్షేత్రమందు ప్రవేశించుటకు రామచంద్రరావు ఆతురపడినాడు కాడు. సరియగు క్షేత్రమందు పెరిగి పెంపొందు కుసుములత తనజీవమును సార్థకము కావించుకొనును. ఇది యెడారియందు నిలుచుచో దీని సౌందర్యసౌరభములు నిభృతమందే కడతేరును కదా! రామచంద్రరావువంటివ్యక్తి మహాత్ముని మంత్రులలో నొక్కండై యుండవలసినది. ఇత డట్లుండలేదు. పండితు లీతని నెఱుగుదురుగాని అసంఖ్యాకు

* "Our contribution to the general happiness of mankind will be great if we can show that it is possible for human beings differing from each other language race and religion to live together as one people united in the service of their motherland. I look forward to the day when from our country, which has ever been the home of religions and philosophies, there will again go forth into a distracted world, for the second time in our long history, that gospel of love and mutual toleration which alone can heal the wounds caused by recent conflicts and bring lasting peace to suffering humanity" Vide "The Tribune" 6th December 1935.



ఇరువదిటన్నుల బరువుగల బుద్ధవిగ్రహము. ౬-వ శతాబ్దినాటిది
రాయల్ అకాడెమీయందు గల చీనాశిల్ప సముదాయమున నిదియొకటి

లైన సామాన్యప్రజ లీతని నెఱుగరు. ఈతని జూచి "Full many a flower is born to blush unseen" అనుకొనుచుండును. కోటిలింగక్షేత్రమందుండ వలసినలింగము ధారుయెడారిలో ప్రవాసము సలుపుచున్నదని చింతిలుచుండును.

గాంధీకి కైవారము కావింపకున్నమానె, ఆతని యాన తలదాల్పకున్నమానె, ఆతని యనుచరులలో నొక్కండై వారివలె కారాగారమున ప్రవేశించి, భారతాంబకై కన్నీళ్లొల్పకున్నమానె, స్వాతంత్ర్యమంత్రమును జపింపకున్నమానె, Constructive Programme కై మహాత్ముడు సూచించిన నిబంధనలను పాటించి ఖద్దరుధారణమునకును, అస్పృశ్యతానివారణమునకును, హిందూ ముసల్మాను సమ్మేళనమునకును రామచంద్రరావును, ఆతని లిబరలుసోదరులును నాడు—యేనాడు గాంధిజీ ఢిల్లీలో నిరువదియొక్క నాళ్లు ఉపవాసము చేసినాడో ఆనాడు కడంగి కార్యరంగమున నడుముగట్టియుండినచో గాంధియుద్యమము నూతనబల మందెడిది; ఆతనియనుచరుల బక్క పేగులపై లాఠీదెబ్బలు చెళ్లుచెళ్లున రాలకుండెడివి; నేడు త్రిశంకుస్వర్గమువంటి ఫెడరలువిధానము భారతీయులపై నావిర్భవింప దలపడకుండెడిది. గాంధిజీపలికిన విధానములో గాక ఆఱునెలలలో నాతనియుద్యమము విజయకేతన మెత్తియుండెడిది. నేడు ప్రపంచ రాజకీయములు వేఱురూపు నందియుండెడివి. తన నైపువారిలోని కొందఱు ప్రబుద్ధులవలె నీతడు లాఠీదెబ్బలను కొలుపలేదు. సుగుణము. ఇపుడిపుడు రామచంద్రరావు గాంధివాక్కులం దొక్క పదమును నోటబూని "హిందీ నేర్చుకొను"డని అనుపల్లవి పాడుచున్నాడు. ఈపాటి కూనిరాగము మధురమంజుల స్వరాజ్యగీతమునందు కలియనేరదు.

నిరుపేదల ఉద్ధరణమునకు సంబంధించిన సహకారోద్యమముతో కొంతకాలమునుండి రామచంద్రరావు జోక్యముకలిగించుకొన్నాడు. ప్రపంచమందంతటను శాఖోపశాఖలుకల మహోద్యమ మిదియొక్కటియే! ప్రత్యేక దేశపరిస్థితుల ననుసరించి ఇది ప్రత్యేక ప్రాముఖ్యము నందును. రోకడేలుపయనీరుల నాటగోలె ఆంగ్లప్రజలు దీనికతన నెంతేని యభివృద్ధినందిరి. సంయుక్తయత్నముకతన డచ్చివారు పాలుమీగడలను విరివిగ వసుంధర కందించుచున్నారు. పాశ్చాత్యసీమలందు పురుషులతోపాటు స్త్రీలీయుద్యమమున విశేషకృషి సలుపుచున్నారు. ప్రతీచీసహకారోద్యమమున రైఫిసిక్ పదము పవిత్రవంతమైయున్నది. ఉల్ఫ్ మున్నగు మహనీయు లీయుద్యమమునకై తమ జీవనముల నంకితముచేసిరి. మనదేశమం దీయుద్యమ మింకను అంతప్రాముఖ్యము నందలేదు. భారతసీమ నిప్పచ్చరమున గ్రుంకులిడుచున్నందున మునిగిపోవురైతునకు తెప్పవలె అప్పు అక్కఱైయున్నందున, పరపతిభాగముందే ఈయుద్యమము మన దేశమున కొంత వృద్ధినందజాలినది. పంజాబుతర్వాత సహకారమున నంజవేయగలిగినది మనరాష్ట్రమే. పరపతికి సంబంధించిన ఆర్థికాంశములను రామచంద్రరావు రామదాసువలె కడు శ్రద్ధతో పఠించినాడు. చెన్నపురి భూమితనఖా బ్యాంకునకు అధ్యక్షుడై దానిపాలనమున నెంతోచాకచక్యము చూపినాడు. ఇట్టి సంస్థలను నెలకొలుపబూనిన ఇతరరాష్ట్రీయుల కీబ్యాంకు మేలుబంతియైనది! బ్యాంకువ్యవహారమం దీతనికి గల ప్రజ్ఞను గుర్తించియే పాలకు లీతనిని రిజర్వుబ్యాంకు డైరెక్టరులలో నొక్కనిగావించిరి.

పరపతీతరభాగమున మననేలయందు సరియగు కృషి జరుగకుండుట శోచనీయము. నాయకుని దేశభక్తిని, త్యాగశక్తిని పరీక్షించున దీభాగమే! మేదస్సునకు తోడుహృదయసంపదగల వ్యక్తియే ఈ భాగమున కృషిసలిపి పల్లెవాసులకు తలలో నాల్కకాజాలును. ప్రజల ఆర్థికాభివృద్ధి ఈ వ్యక్తిచేతియందు సంపూర్ణముగ నిమిడియున్నదని తెలుపజాలము. ఇది ప్రభువుల చేతియందును, సాధారణ ప్రాపంచికార్థిక పరిస్థితులందును గలదు. ప్రజలందలి దురాచారములను మాపుచేసి వారి దుర్వ్యయమును కడముట్టించి వారి విద్యాబుద్ధులకు తగువ్యవస్థలు నిలిపి సహకార నాయకుడు వారికి

కొంత తోడుపడగలను. తీయని ఉపన్యాసములవలన దురాచారము తెగసిపోవు. మతావేశముగల రామదండువలె సహకారప్రచారకులు గ్రామములందు మసలి సత్యాగ్రహము సలిపిరేని, దురాచారములు వీరి దీక్షాగ్నియందు మాడిమాడి బూడిదయగును. సహకారులిట్టిత్యాగమును సలుపగడంగిననాడే వారియుద్యమము బహుసంఖ్యాకుల సానుభూతినంది విశేషప్రాముఖ్యమును పడయగలదు. ఇట్టిదీక్ష, యిట్టిత్యాగము, యిట్టిసత్యాగ్రహము పాలకులపట్ల నెన్నడో నెగ్గదో చెప్పజాలను కాని, ప్రజలపట్ల, తోడియభాగులపట్ల నది నెగ్గితీరునని కంఠమెత్తి చెప్పగలను. సహకారమన వ్యవహారమేయని తలంచువారి సంఖ్య నేడు తెగబలిసియున్నది. ఇది వ్రతమనియెంచువారు సకృత్తు. ఇట్లనియెంచువారు కొలదిమంది గోచరించిననాడు సహకారోద్యమము దేవపత్తమును పూరింపగలదు. వట్టివ్యవహర్త ఎన్నినివేషములు వేయగలడు. రాత్రివేళ నీతడు కోయిలకాగలడు; పగటివేళ దివాంధము కాజాలును! ఏకారణముచేనేమి ఈయుద్యమము మనరాష్ట్రమందిపుడు అట్టిట్టులాడుచున్నది. అపజయము దీనినొసలున వ్రాయబడియున్నదని ఈవఱలో సహకారశాఖయందు రిజిస్ట్రారుగానుండిన స్ట్రాతీగారే చెన్నపురి విశ్వవిద్యాలయమున నుపన్యసించుచు పలికిరి. స్థానికసంస్థలపై పులుగులవలె వ్రాలు లోపములు సహకారసంస్థలపై వ్రాలుటలేదని చెప్పలేము.

సహకారోద్యమమనుడు, రాజకీయోద్యమ మనుడు, ప్రజాభ్యుదయమును దృష్టినిడికొనిన మఱేమహోద్యమమనుడు సదాశయసందీప్తహృదయుల సారథ్యమందినపుడే గమ్యస్థానమును చేరుకొనగలదు. నీతినియమములు రబ్బరుసాగునట్లు సాగువస్తువులనియు, స్వార్థమునకు ధక్కా తగులునపుడు జీవననిబంధనలకు "తూనాం బొడ్డుంజాల్" అనవచ్చుననియు, ఉత్తమాశయములను చిత్తమువచ్చినదిశకు త్రిప్పివేయవచ్చుననియు, సద్భావములనడుమ చక్కనిహంసపాదులను చొప్పింపవచ్చుననియు, తెరయవ్వల భామవేషము నభినయించి తెరయివ్వల వెక్కిరింతబ్రదుకు కీడ్వవచ్చుననియు, ప్లాటుఫారముమీద సద్బుద్ధులుపాడి, బుద్ధులుచెప్పి, అందుండి మరలినంతన, మంచెనుండి దిగి చేనిలోనివారిని తూలనాడిన ఉజ్జయినీ విప్రునివలె నపసవ్యక్రియను కడంగవచ్చుననియు, పేరుపెనగులాటకు పెడబొబ్బలుపెట్టి పెద్దలమనిపించుకొనగలమనియు అపోహపడువారు ఏయుద్యమమునకైన తీఱనిచెఱుపు దెత్తురు. సహకారోద్యమమును కేవలము వాణిజ్యదృష్టితో చూడక దానియందలి ఆధ్యాత్మికమహత్త్వమును గుర్తించి, నేడుద్యమాంగణమున పెరిగిన కలుపు నూడపెఱుకుట రామదాసు రామచంద్రరావులవంటి నాయకుల ప్రధానకర్తవ్యమని పలుమాఱు నొక్కి చెప్పుదును. ఈ మహోద్యమముతో సన్నిహితసంబంధము కలవాడను కావున నిది గెలుపుసిరి మెత్తు శుభదినము నెదురు చూచుచుందును. ఒరుల మేలుకై ఒళ్లు కోసి యీయగలశక్తిని సహకారులలవఱచుకొనవలెను. ఇట్లలవఱచుకొనిననాడే దేశమంతయు వీరికి వింజామరలు వీచును. ఈశక్తి గెలుగని విద్వాంసునకు, అతడు మహానాయకునివలె కట్టెకుట సాక్షాత్కరించినను, అదిపువ్వులరథముకట్ట సముకట్టదు. రామచంద్రరా విట్టిపూలతేరు నెన్నడు పొందగాంచునో కదా!

రాజకీయములందు నలుదిశల బరికించుట రామచంద్రరావు అలవాటు. బ్రిటిష్‌రాష్ట్రములందలి రాజకీయములేకాక నేటివ్‌స్టేట్సులలోని రాజకీయములు ఒకప్పు డీతనిదృష్టి నాకర్షించినవి. వీనిపట్ల శ్రద్ధవహించిన ప్రధానరాజకీయవేత్తలు ఈతడును, చింతామణియు మాత్రమే! ఆ జెండ్లనుండి వీనిమాటెత్తక రామచంద్రరావు మౌనముద్ర దాల్చినాడు. ఎక్కడో ఏమో జరిగినదని కేరళపక్షి పలుకుచున్నది!

అచిరములో ఫెడరలువిధానము అవతరించునని కొందఱు నేడు చంకలుకొట్టుకొనుచున్నారు. మొన్నమొన్ననే మదరాసు మాడరన్‌కాఫెలో శ్రీనివాసశాస్త్రి ఫెడరేషనునుగుఱించి చక్కనిస్వాగతగీతము నాలాపించినాడు. రాబోవురాజ్యాంగవిధాన మెట్టిదో కనుల బడకమున్నే క్రొత్తక్రొత్తకట్టడముల నిర్మాణ

మునకై ఇపుడేర్పాటులు జరుగుచున్నవి. పుట్టబోవు బుల్లెమ్మకై మంగళసూత్రములపూసకూయింపు ముగిసిపోయినది! నూతనరాజ్యాంగవిధానములలో బ్రిటిష్‌యిండియాలోని రాష్ట్రములును, నేటివ్ స్టేట్సును కవలల్లు కలిసిపోవలెను! నేటివ్ స్టేట్సులోని అధిపతులు నిరంకుశత్వమును చలాయించుచున్నారు. రేపు ఫెడరల్ అసెంబ్లీకి పోవువారు 'స్వతంత్ర రాష్ట్రము (నేటివ్ స్టేట్సు) లందలి ప్రజాప్రతినిధులుకారు, నిరంకుశాధికారులు పంపువారే! తమనిరంకుశత్వమునకు 'భళాభళి' యనువారినే వీరట్లు పంపెదరని విప్పిచెప్పనక్కరలేదు. వీరికిని బ్రిటిష్‌రాష్ట్రములనుండి చను ప్రజాప్రతినిధులకును పొందు కలియుటెట్లు? ఉజ్జీకలియనివ్యక్తులు ఒప్పులకుప్పనాడగలరా? నేటివ్ రాజులు పుత్తెంచిన పెద్దమనుష్యులకు భారతపాలనావిధానమున జోక్యముండును. కాని బ్రిటిష్‌రాష్ట్రములనుండి వచ్చు ప్రతినిధులకు నేటివ్‌రాష్ట్రపాలనమున జోక్యముండదు. రాజ్యాంగవిధానమున సముచిత పరివర్తనములు జరుగుటకు ప్రజాప్రతినిధులు నడుములు కట్టెదరు. నేటివ్ రాజులు ముందంజవేయుదురని చెప్పుటెట్లు? వారిముందు అపుడే బలి గీయబడలేదా? ఈ రాష్ట్రములును, ఆరాష్ట్రములును కలిసినగాని ఫెడరేషన్ - ప్రతిమ పరిపూర్ణముకాదు. ఫెడరేషన్ ఆశయము గొప్పదే! కాని ఈ యోజయము మన కింకను పెక్కామడలదూరమందున్నది. బ్రిటిష్‌రాష్ట్ర ప్రజలును, నేటివ్‌రాష్ట్రప్రజలును ఫెడరల్ లెజిస్లేచర్‌లో కలిసికొన్నపుడే సంఘీభావ మేర్పడి భారత జాతీయత్వము దృగ్గోచరమగును; నాడే ఫెడరేషన్ సరియైనరూపు నందజాలును. లేకున్న నది యొకబోదకాలుతోడను, ఒక మంచికాలుతోడను నిలిచి వికృతముగ దూపట్టును. సైన్యపుసమస్యను, పైకమును గురించిన సమస్యను, కేంద్రప్రభుత్వాధికారమును గురించిన సమస్యను దేవుడెఱుగును, కన్నులకఱవుదీర ప్రత్యక్షము కావలయు స్వరాజ్యముమాట దేవరయెఱుగును, పుట్టువులోనే వికృతాంగియై పుట్టు రాజ్యాంగవిధానము మనకేలయని మనము దేవులాడుచుండుటలేదా? "ఎవరేమనుకొన్నను, ఎన్నినోళ్లులేచినను ఫెడరేషన్ వచ్చిపడు" నని శాస్త్రిగారుపలుకుచున్నారు. ("It now seems fairly settled that notwithstanding a few voices raised here and there against it, we are going to have a federation of the Indian States and what is called British India ") బ్రిటిష్‌రాష్ట్రములలో కమ్యూనిజమును, ఇండియన్ స్టేట్సులో ఆటోక్రసీయును బలసినయెడల వీనికాళ్లకు తిమ్మెరలెక్కించి మఱొకపార్టీ చక్కగ విజృంభించును! "కావలసిన కారణాంతము లవంబును తప్పదు." ఈయూచిక్కులదెస కన్నునిలిపి, వీనియందు విహితమైన జటిలాంశములను హృదయంగమము గావించుకొనజాలువారి సంఖ్య మిగుల నల్పము. ఈసమస్యలను కడుశ్రద్ధతో పరిశీలించిన పండితుడు రామచంద్రరావు. 'స్వతంత్ర' రాష్ట్రప్రజల యిక్కట్టులదెస మరల జూడక్కత్రిప్పి, వారికృతజ్ఞతకును తక్కంగలభారతీయుల కృతజ్ఞతకును ఈతడు పాత్రుడు కావలెనని నా వాంఛ.

రంగారు బంగారు తలపులతో స్వప్నము లల్లుట రామచంద్రరా వెఱుగడు.

స్వప్నములల్లుట భావనావేశముకల అదృష్టవంతునకేసాధ్యము. వసుంధర నిద్దురయొడియందు ముసుగుదన్నియుండ నీతడల్లన నందనములోనికి కదలిపోయి అందలి పొదరిండ్లయందు పవ్వళించి యేమేమో తలపోసి లేచి గంపెడుపూలు ప్రోగొనరించుకొని తీయని తీవలతో కెంపుదారములతో మాల గ్రుచ్చి చరచర సాగిపోయి కులుకుచు సాహితీసీమంతినికి దానినప్పనమొనరించి "నన్ను నీచేతివీణె జేసికొనుముతల్లీ !" అని యామెను వేడుకొని మనోరథసిద్ధి నందును. మంచుకొండకొననుండి అల్లన స్రవించు సురశైవలినీధారయట్లాత డాలాపించు గీతిక కవితాహర్మ్యశిఖరమునుండి మెల్లగ పాఱును. కళోపాసకునిజీవన మెంత చిత్రమైనదో కాని అతనిరక్తమాంసము లవనియందే నిలిచినను, అతడు మల్లోకములందు విహరించును. అతడు

సర్వాంతర్యామికాదు, కాని సర్వాంతర్యామికంటె నదృష్టవంతుడందును. సర్వాంతర్యామి కదలుటకు చోటేది? బ్రహ్మాండమందంతటను అతడు నిండియుండువాడు కాడా? మంచిచెడుగులు, సుఖదుఃఖములు సుగంధదుర్గంధములు చీకటివెలుతురులు అతనికట్టెదుట కానుపించును. ఈదృశ్యమును విలోకించి ఆత డొకకంట బొగిలి, రెండవకంట నానందింపవలెను. కళోపాసకుడో, ప్రతికూలసంఘటనములదెస పోడు. పోయినచో, ఏమిబీజాక్షరము లీతడుచ్చరించునోకాని ముండ్లకంపలుపోలు పరిస్థితు లీతని ప్రేమల చిరునవ్వులు రాలుచుపూవు లతలగును! సెగలును, పొగలును అతని కనుల బడినంతనే, మకరందభారలై వానికి పాదప్రక్షాళనము కావించును. కళోపాసకుడు నిప్పులు ద్రొక్కినను, అనిహాలాస్తుగనిత్యములైలై జగన్మోహినికాళ్లబడిమురియు నిలింపులట్లు మురిసిపోవును. కసుగాయయై ఈతడెన్నడేని వాపోయినను, వరూధినివలె కలస్వనము తోడనే యిచ్చును. అజపులును, చెఱపులును పండితునకు తనునేమోకాని కళోపాసకునకు కాదు. సుత్తెదెబ్బలవలె, సమ్మెట పోటులపగిది మనసుపై మాటలు పడెనేని, ఫిరంగుశబ్దమున రిపువమను పిట్టయట్టులు ఈతడెందేనియెగసిపోవును. ఈతనిగుండె పూవురేకుకంటె మృదువైనది. అబలవలె నున్న నేమి? అక్కరగునపో నీతని యెడంద వజ్రాదపికఠోరమగును. చల్లనితల్లి పార్వతి మహిషాసురమర్దని కాలేదా? పిడుగుల నీతడు గోళీలట్లాడగలడు! భయంకర మేఘములను చింతగింజలట్లు గుప్పగలడు! బడబానలమును త్రిచూర్ణము చేసి నొసలునదాల్పగలడు! మహోదధులను పురిషిట బ్రోలగలడు! కళోపాసకుని ప్రజ్ఞాప్రతిభలు కావలెననిన అబ్బునా? బడులందు చేర్చుకొనిన నవి యలవడునా? నరనారాయణులట్లు దివ్యబదరికాశ్రమమున బహుయుగములు తపసుచేసిన మహాత్ముడే కళోపాసకుడు కాజాలును. ఈ ఈమహాత్ముడే శ్రీనాథుడనిన "సుర్భర కరుణాధురీణయగు ప్రాణము"వలె తనయద్భుత సృష్టినుండి " పెరుగును, వంటకంబు, వడపిందియలం గొనితెచ్చి" విజ్ఞానడింభకుల కిచ్చును !

కళోపాసకున కిట్టి యద్భుతశక్తి నిచ్చునది ఆతని యావేశమే! ఈ యావేశము వట్టిపొంగుఅనివదోషమునుడీ! ఇది కొనుదుబిండెలోని సరుకా? త్రిమూర్తులును, యక్షగంధర్వ, కిన్నర కింపురుషులును అనంతకాలము గ్రుంకులిడు నాకమానస సరోవరమునుండి యుబుకు మహత్తరపూర వీయావేశము! తెలికెరటాలమీది తళుక్కులం బాగాను ప్రభాతకిరణశాబకములట్లు ఆవేశతరంగములనుండి వెడలు తలపుతుంపురులు మనశ్చక్షువునకు మిణుమిట్లుగొలుపును! నవకలనములపుంజమట్లు, ఏడురంగులబంతిలిల, సర్వకావతులకందుకముకైవడి గుండచేయబడి నిండుచెండువలె తోచు ఇంద్రధనువు చంపమున నీతలపుగుంపు మనోహరమై, ఆత్మచే తన్మయనృత్యము జేయింపదా? హృదభ్రమునుండి కుంభవృష్టిగ భావములు కురియుచుండ, తనబిడ్డ వడముడిని తన చేతులందు మోయజాలని కుంతివలె కళోపాసకుడు తనతలపులను తనమాటలందు చేర్పజాలకపోవును; కాని పరమహంసపగిది గంతులు వేయును! అద్భుతభావము మనసునందు కుమిలికుమిలి యుండనేరదు. సూర్యచంద్రులు మేఘగుహలందు కైదీలై యుందురా? కళోపాసకుని భావము దివ్యభావముకావున ప్రకాశము నందితీరవలెను. మాటల కదియందనపుడు రాగాలాపనమందును, నృత్యమందును, చిత్రలేఖనమందును అవతరించును. జగదీశుడు దశావతారము లెత్తిగాని ఆత్మప్రకాశము గావించుకొనజాలకపోయినాడు. ఆత్మప్రకాశ మొనరించుకొనుటకై కళోపాసకుడు సహస్రావతారములెత్తిన నెత్తును.

కళోపాసకుని దొంతరిబ్రదుకు కాదు. వానికి నలువురుసైదోడు లున్నారు. ప్రవక్త, మహాప్రియుడు, మహాత్ముడు, పరార్థజీవి యనువారే కదా వీరు. ద్రౌపది యట్లావేశ మీయేవురను వరించినది! ప్రపంచేతిహాసములను వెతకుడు; నిక్కముగోచరించును. నెపోలియన్‌చే అప్పినైన్ కొండలను పుటబాలులట్లు తన్నించిన దీయావేశమేకదా! మహమ్మదుప్రవక్తచే మహాద్భుత ధృతిని విజృంభింపజేసిన దీయావేశమేకదా! కళావ్రతునిచే తారకలను మల్లికలట్లు త్రుంపించి సాహితీజగతిపై జల్లిం

చుచున్న దీయావేశమేకదా! మహాత్మునిచే బ్రహ్మాండము పుటికీలుకొట్టించుచున్న దీయావేశమేకదా! ఈయావేశములేనివాడు సారస్వతక్షేత్రమందుగాని కురుక్షేత్రమందు గాని ఉండవగదు; అతడుండనేలేదు; ఉండనేయుండడు.

కవియును, యోధుడును తమపైదోడుల వలెనే తమయావేశమును చిత్తమువచ్చినట్లు పాఱనీయరు. గట్టులనడుమ ప్రవహించు సరిల్లాముమే కలరవ మొనరించునట్లు నియమబద్ధమైన పంక్తుల నడుమ పాఱుఆవేశమే మనసును తనుపు మధురస్వన మొనరించును. కవితావనియందు కట్టల నేర్పఱచునది ఛందస్సు. ఛందోబద్ధమైన పంక్తులు నది కవ్వల నివ్వల గల గట్టులువంటివి. ఈగట్టులే కవిత్వ మనుకొనువారు నదీపూరమని మన్ను నోటగొట్టుకొను మోఱకులు పోలువారు. కదనాంగణమున నొక వ్యూహమేర్పఱచుకొనియే మహావీరుడు ఆహవమునకు దొడరును. లక్షణసూత్రములచే నిర్మింపబడిన పంక్తులట్లు, ధనీకూలములందు గట్టబడిన గట్టులట్టులు రణోర్వియందలి వ్యూహము ఎంతేని నేర్పును సూచించును. ఈ కౌశలము భావఝురి కాదు, వారిపూరము కాదు, శౌర్యవాహిని కాదు. బాహ్యావరణమైన శరీరమును చూచి "ఇదియే మనుష్యు" డనువా డెట్టి బుద్ధిమంతుడు?

రామచంద్రరావున కించుకంతైన నావేశము లేదు. కావుననే ఈతడు వక్త కాడని, ప్రవక్త కాడని, నేత కాడని, వ్రాతకాడు కాడని ఋజువు చేసితిని. ఈతడు క్రియోర్వియందు గోచరించు మహాశూరుడు కాడని తొలుతనే చెప్పివేసితిని. శూరునకును, సాహితీప్రవక్తునకును కడుపులో నుండు సరుకు ఒకే రకమైనది కావున నీతడు సాహిత్యోపాసకుడు కాడని వేఱుగ చెప్పవలెనా? ఈతనికి సాహితియందు అవగింజంతైన నభిరుచి యున్నట్లు తోచదు. ఇతని జ్ఞానము లెక్కలకును, డోకడాలకును సంబంధించినది గాని సహజసాహితీ సృష్టికి సంబంధించినది కాదు. ముద్దులను మూటగట్టి తన రచనయం దీతడు నిలుపలేదు. ఇతని మాటయందు నవ్వుగాని, పువ్వుగాని లేదు. ఇతడు సూనవనమందు మసలు సుకుమారి కాడు. కటికిరాళ్లయందు చెమటలోడ్చు గట్టిఘటము. ఇతడు పండితుడు కాని కళోపాసకుడు కాడు. "Style is the man" అన్నాడు Newman; "Style is psychological" అన్నాడు Dequincey. రామచంద్రరావు శైలిని పరికింపుడు. మెఱపులను మెఱుగులను తళుక్కులను బెళుక్కులను ఆశించువారికి ఆశాభంగము కలిగితీఱును.

పురుటింటిలోనే ఇతడు మోడరేటుప్రకృతి నలవఱుచుకొన్నాడు. పెద్దయెత్తులు, పెద్దయాశలు, ఈతని ప్రకృతికి ప్రతికూలములు. ఉఱుకులనిన నీతడులికిపడును; పరుగులనిన గడగడలాడును. తుపానువీచుచున్నను 'నన్ను కావ'న్నట్లీతడు మెల్లగ తానెన్నుకొనిన తెరువునుండి నడచిపోవును. ఈతని నిఘంటువున విజృంభణ మను శబ్దమునకు చోటు లేదు. అడుగడుగునకు బావుటానెత్తవలె నని ఈత డభిలషింపడు. విద్యార్థిజీవనమున రామచంద్రరావు అచ్చంపు జాతిరతనమనిపించుకొనలేదు. న్యాయవాదవృత్తిపై మూడిక్కనిగిడించినాడు. చెన్నపురిలోనే ఒక సుప్రసిద్ధ ఆంగ్ల న్యాయవాదికడ వృత్తిశిక్షణము నెఱపినాడు. నగరజీవనము ఈతని కన్ను గుట్టలేదు. సొంతయూరరిగి బల్లకట్టినాడు.

"Child is the father of man" అనిపించుకొన్నాడు. ఎంతో ఓపికతో కేసులు చదువువాడు. జిల్లాకోర్టులో కావలసినది ఓపికయే కదా! విద్యా విజృంభణమునకు కడంగు వాచాలున కందు చోటేలేదు. తన ప్రకృతికి సరిపడిన వాతావరణమందు నిలిచి ఏలూరు, రాజమండ్రి న్యాయవాదులలో రామచంద్ర రావు తానొక్కడ ననిపించుకొన్నాడు. కాని తక్కుంగల న్యాయవాదులట్లు తనకోర్టే తన యిహమునియు తన పరమనియు నీతడు తలపక స్థానిక రాజకీయములందు విశేషకృషి సలిపినాడు.

స్వపరిపాలనమును చేతి కందీయకున్నను, ఇందు భారతీయుల సత్తువ కొలుచుటకు కాబోలు పాలకులు

రిప్పన్ ప్రభువునాటనుండి స్థానికసంస్థలను నెలకొలిపిరి. ఈ సంస్థలు స్వరాజ్యభవనమునకు అక్కరైన మెట్లని రామచంద్రరావు అపోహపడినాడు. ఈతని యపోహ ఎండమావువంటిదే యైనను, స్వరాజ్యవ్రతుల కీ సంస్థలు పూజామందిరములు కాకపోయినను, వీనియందీతడు తొలుతనందిన శిక్షణము భావి రాజకీయజీవనమున నీతనకి చక్కని యూతకోల యైనది. మ్యునిసిపలు సంస్థనుండి తాలూకాబోర్డునకును, అందుండి జిల్లా బోర్డునకును, అందుండి రాష్ట్రశాసనసభకును, అందుండి భారతశాసనసభకును ఇత డల్లనల్లన సాగిపోయినాడు. క్రమశిక్షణము, క్రమనిష్ఠ కీతని జీవనము చక్కని యొరవడి.

ఈరీతి శిక్షణము అమెరికనుల జాతిసంప్రదాయము. నీచవృత్తి యనియు, కొద్దిపనియనియు భారతీయులు త్రోసివేయు క్రియను అమెరికనులు తమ జీవనమందలి ప్రధాన కర్తవ్యమని యోజింతురు., మెట్టునుండి యెక్కి, యే అంబరవీథిని ముద్దు కొను మేడలను వారెక్కిరి. మనుష్యవృద్ధి కిని, ఆత్మసంయమమునకును, ఇట్టికృషి అనివార్యమైనది. ఈ కృషికతననే సుమారు నాలుగువందలయేండ్లకు మున్ను మాత్రమే ప్రజలకంటబడిన అమెరికనుఖండము ఐశ్వర్యమున నఘునాతనవసుంధరయం దగ్రస్థానము నందినది! ఒక ఫ్యాక్టరీయందు కూలిపని చేసినవాడే ఆ ఫ్యాక్టరీకి కాలక్రమమున నధిపతియగుటయు, ఒక యోడయందు మరలను తుడుచుటకై నియోగింపబడిన వ్యక్తియే ఆయోడకును అట్టియోడలు పెక్కింటికిని అధిసాథుడగుటయు, ఒక సైన్యమందు సాధారణసైనికు డైనవాడే పదంపడి సేనాధిపతి యగుటయు పాశ్చాత్యసీమయందు సామాన్యదృశ్యములు.

క్రమమై, పుంఖానుపుంఖమైన శిక్షణమున ఆటితేటిన భారతమహాపురుషులలో రామచంద్రరావునకు నిక్కమైన చోటుకలదు. పని మొదలిడిన పరక్షణమందే కనక పళ్లెరమందు స్వర్గము ప్రత్యక్షము కావలెననియు, తొమ్మిదిగడియలలోనే తమ:భరతుడు పుట్టుకొనిరావలెననియు నాశపడి అట్లుజరుగనితటి 'హతోస్మి' యని నేలగూలువారి సంఖ్య మనదేశమం దధికమైయున్నది. "తపయుము" అని మిల్టన్ మహాకవి తన్నుద్దానుద్దేశించి వాకొనినట్లు (Vide Milton's "On gteah et gahis arrivinof twenty three") వాకొను మహనీయులు కొందఱు కట్టెదుట దోచినపుడే భారతీయుల తుందురుగుణమును, తత్తరపాటును కడతేఱును. ఇట్టి మహనీయులందీ యాంధ్రమహాపురుషు డొక్కండని కంఠమెత్తి చెప్పుదును. ఈతనితోడ్పాటు ప్రతి రాజ్యాంగసభయందును, ప్రతి కమిటీయందును తప్పనిసరియైన దనుటలోను, ఈతడు లేని ఆలోచన సభ కర్ణధారిలేని నావవలె అట్టిటు లాడెడిదని చెప్పుటందును అక్కఱ యుండదు. లిస్టన్ స్కీన్ కమిటీలందీతడుచూపిన ప్రజ్ఞ అనల్పము. డిబేటులందును, ఉపన్యాసములందును ఆటితేటిన పెద్దలు అనుభవవిజ్ఞానములందు తమకంటె పెద్దయని రామచంద్రరావులకు వంగి సలా మొనరింతురు. "Knowledge is Power" కదా! రామచంద్రరావు విజ్ఞానమే ఆతనికి సత్తువ నిచ్చినది. శాసనసభయందు జిన్నా, కృష్ణస్వామి అయ్యరు మున్నగు హేమాహేమీలకు ఈత డొక బెత్తెడెత్తుగానే గోచరించునాడు.

ఈతని ప్రజ్ఞను గుర్తించియే లిబరలువాదులు, కొలదియేండ్లకు మున్ను కలకత్తాలో జరిగిన తమ మహాసభ కధ్యక్షుని గావించిరి. పాలకు లీతని చేవచూచి తొండుటేబిలుమహాసభకు శాస్త్రితో కూడ నీతని నాహ్వానించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు ఆంధ్రప్రముఖులం దొక్కండని యెఱిగియే మూడేండ్లకు మున్ను తమ స్నాతకమహోత్సవసమయమున రామచంద్రరావును ప్రధానోపన్యాసకునిగ నాహ్వానించిరి.

రామచంద్రరావు మహాత్యాగి కాకుకాని బహుసద్గుణములు కల మహనీయుడు. పబ్లిక్ లైఫ్‌లో నీతినియమములను లెక్క చేయువారు నూటికైదుగురు కంటె లేని దుర్దినములలో దొంగయెత్తులు వేసి ముందులకు వచ్చి మాటలుపన్ని మహామహుల మనిపించుకొ

నువారి సంఖ్య దురదృష్టవశాత్తూ బలియుచున్న గడ్డు రోజులలో ఆడంబరరహితుడై, శాంతమూర్తియై, నిష్కళంకచిత్తుడై నిర్మలవర్తనుడై నిలిచిన మహాపురుషుడు రామచంద్రరావు. తనయంతరంగమిత్రుడుచింతామణివలె నీతడు నీతినియమముల నారాధించు మనీషి. అక్కరగు ముహూర్తములందు వేషములువేసి, నాటకములాడుట తనజన్మమం దీత డెన్నడు నెఱుగడనుటకన్నేని దృష్టాంతము లున్నవి. ఒకప్పు డీతడు గవర్నరుగారి కార్యనిర్వాహక సభయందు లామెంబరుగా ప్రవేశింపవలసి యుండెను. ఏమి జరిగినదో కాని ఈతడు సుమ్మములో నడుగుపెట్టకముందే ఆపదవి కెవ్వమని ఈతనిచంకనుండి రాలిపడినది! ఇచ్చగించినచో "నిది నాబిడ్డ" యని ఇతడు దాని నక్కునజేర్చుకొనజాలి యుండును. మరల నాసుమ్మములో నడుగుపెట్టనన్నాడు రామచంద్రరావు. వేదిక నెక్క జాలు తరుణము లీతని కన్నేని లభించినవి. చూడవలసిన ముత్తైదువుల నీతడు చూచియుండినయెడల నొకరు నొసలున కళ్యాణపు తిలకమును దిద్దియుందురు. మఱొకరు బుగ్గను చుక్కపెట్టి "చిలకతల్లీ!" రమ్మని ఈతని పాలకియం దెక్కించి యుందురు. "ఈ సౌభాగ్యమూ ఈ వైభవము నాకేల" యని ఇతడు దూరముగ తొలగిపోయినాడు. మెత్తపడవలసిన సమయములందు 'సనేమిరా' యనువ్యక్తి సామాన్యుడు కాడు. కాంగ్రెసు పద్ధతులం దీతనికి సానుభూతి లేకపోయినను, లేనట్లే ఈతడున్నాడు. లాభసాటి బేరమని రాహుకాలము దాటినతర్వాత గాంధిటోపి ధరించి, ఖద్దరు గుడారములో ప్రవేశించుట ఈత డెఱుగడు. నలుగురూ "తొండ! తొండ!!" యనినప్పుడు ముదిరి ఈత డూసరవెల్లి కాలేదు. రంగుపూసుకొని రాగాలాపన మొనరించు టెఱుగడు కావున నీతని కక్కరలేని గౌరవము లభింపనే లేదు. దొరటోపీ చల్లు శుభాక్షతల కీతడు కొంగు యొడ్డియున్నయెడల ఢిల్లీ శాసనసభయందలి గద్దె నధిష్ఠింప గలుగువాడు. ఉపకునీటి బొట్టు లీయక్షతలని తలపోసి కాబోలు ఇతడు దూరమందే నిలిచిపోయినాడు. కాంగ్రెసు విభూతిని కొంత చేతబట్టి, శైవబ్రాహ్మణునివలె నొసలున చక్కగ పిండికట్లు దిద్ది, కలశము చేబూని ఓట్ల సమయమున నీతడు పంక్తిలో నిలిచియుండినచో నియోగికావున సంభావనయనక ఫలప్రదానమని ప్రజ లీతనికి ఓటు నిచ్చెడివారు. కాని, రామచంద్రరావు తన పందిరిలోనే తాను నిలబడినాడు.

ఒకప్పుడు తీవ్రకాంగ్రెసువాదులై సమయమునకు మోసపేటు పార్టీదన బండి మళ్లించిన మహానీయులు కొందఱు మన దేశమందు పుట్టిరి, గిట్టిరి. వీరిలో సురేంద్రు డొకడై యుండుట దుఃఖకరము. ప్రజలచే ముకుటములేని రాజన్యు డనిపించుకొనిన మహానీయుడే మంత్రిపదవికై ప్రాకులాడి దానినంది ధన్యుడనిపించుకొన్నాడు! 1906, 07,08 లలో మేఘగంభీరస్వరమున "స్వాతంత్ర్యము! స్వాతంత్ర్యము! స్వాతంత్ర్యము!" అని ముమ్మారుచ్చరించి, భారతభూమిని ప్రతిధ్వనింపజేసి, తాను బ్రహ్మసమాజికుడైనను పల్వురు వంగీయులచే గంగయందు స్నానము చేయించి "అమ్మకు ముక్తి వచ్చువఱకు విప్పవల" దని వారి మణికట్టులకు బిగువుగకంకణములు కట్టిన మహావీరుడు బిపిన్ చంద్రపాలే చచ్చి స్వర్గమును చేరుటకు ముందు దురంత దుస్సహ దుర్దాంత దారిద్ర్యముచే కాబోలు తన గట్టిపూనికనుండి సుభాలున గూలిపోయినాడు! కాంగ్రెసు మహోద్యమాంగణమందు జయవిజయులట్లు రణభేరి మ్రోగించినవారే తుదకు కాళ్లు ముడుచుకొని కలుగులలో దూరిరి. ఇంతకంటె దేశదౌర్భాగ్య మేముండును?

రామచంద్రరా వొకప్పుడు మహోత్సాహముతో నృత్యము చేయలేదు. వేఱొకప్పుడు 'డగ్గుత్తికతో మహాభయముతో నా కంపితాంగంబుతో' వెన్కకు తరలలేదు. ఒకరిమాటలకు వీనులొగ్గి తనకోటు నీతడు మార్చుకొనడు. దివినుండి 'జేజెమ్మ' దిగివచ్చి చెప్పినను ఇతడు తన యభిప్రాయమును మార్చుకొనడు. పరుపుపై నిటునటు దొరలు తెవులుగొంటువలె రాజకీయవాది ఒక పార్టీనుండి వేఱొకపార్టీకి తరలు నని ఛార్లెస్ లేంబ్ వాకొనినాడు. (Vide: "Essays of Elia") రామచంద్రరా వీరీతి తెవులుగొంటు కాదు.

తన దళములోని పెద్దల కీతడు చేతులు జోడించును గాని అన్నప్పుడు వారిసెనక్కనీతడు 'భళాభళి' యని తాళము వాయించడు. ౧౯౧౯ లో కలకత్తాలో జరిగిన మోడరేటు మహాసభలో అధ్యక్షుడు శివస్వామి తోడను, ఆతనికి పైచేయియై నిలిచిన సురేంద్రునితోడను సరిసమముగ ప్రతి ప్రసంగమందును ప్రతి వాయింపగ జంకుగొంకులేక తన ప్రత్యేకాభిప్రాయము నీతడు వ్యక్తపఱుచుట నేనెఱుగుదును. రామచంద్రరావు కఠినచిత్తుడు కాడు. మఱి ధీరమనస్కుడు. గర్వమెఱుంగక తఱచుగ నీతడు మౌనముద్రదాల్చును. ఈతనికి శత్రువులు లేరు. పారపొచ్చెములు పొడసూపినను మంచి గంధపుచేచనమువలె తన మంచిగొనముచే వాని నీతడు చల్లబఱుచును. పేరుకై మేజువాణి చేయు పురుష భామామణుల కీతడు దూరస్థుడు. పలుకుబడిపై మనసు నిలుపక, తాను నమ్మిన తలపునుండి తన చిత్తమును చెదరనీయక, అక్కరగువో అడలుపాటు లేక అపయశమున కీతడు జోలియొగ్గ జాలును! తన యశమును నీతడు తడబడనీయడు. తమ యుద్దేశములను పల్వురు అవగాహన మొనరించుకొనక, దురవగాహనము గావించుకొను దుఃఖకర దృశ్యమును మహాపురుషు లెందఱో చూతురు. వీరియందొక్కరుండై, మీద సుంకులు రాలుచున్నను, తలపై బురద పడుచున్నను, పదస్ఖలన మెఱుగక రామచంద్రరావు తన ఫిరంగుకడ తాను నిలిచి యుండును. కన్నుగుట్టు కర్మవీరుడు కాకున్నను, తన బరితానుదాటక తానుతలంచిన కర్తవ్యమును తన మనసునకు వచ్చినరీతిని శిరమెత్తక అల్లన జరుపుకొనిపోవు నిష్కాపరు డితడు. ప్రపంచమందలి రాజకీయవిజ్ఞానులలో నితడెవ్వరికిని తీసిపోడు. అన్యదేశమున పుట్టియుండినచో నీతడుండలమం డధిష్ఠించియుండును. ఇపుడు పునర్జన్మనందిన ఈ యాంధ్రమహాపురుషుడు భారతరాజకీయములందు కొంగ్రొత్తరూపు దాల్చగలడని నా యాశ.

నిన్నగాక మొన్న రామచంద్రరావునకు సర్ బిరుదము చేకుఱినది. ముదిమిని పుట్టిన బిడ్డ నీతడు ముద్దుకొనుచుండుట లేదుకదా! ఇట్టి బిడ్డను తొట్టెయందు బెట్టి భారతీయులు జోలపాడరు. నేనాక్షేత్రమున నెవ్వాని జీవనము పండిన పంటయై తమ కనులబడునో, వాని కురగల వసంతోత్సవము నెఱపి కనదురు కాంతులనీను బిరుదము నొందు దండయని ప్రజ లాతని కంధరసీమయందు వేతురు! శతాబ్దులు కడచినను ఈ మాల వాడిపోదు! తిలక్ దివి కరిగినను లోకమాన్యుడను బిరుదుసరము నేడును గంధబంధురమై భూతలమున నొప్పుచు, జనవితానమును మాతృపూజకు నాహ్వానించుట లేదా? చిత్తరంజను డిపుడు నాకమందే నివసించి యున్నాడు. కాని భారతమాత గళసీమయందు సహస్రసూర్యుల కాంతి గల శమంతకమట్లు తేజరిల్లుచున్నది దేశబంధు కాదా? పాంచాలమున నీ వ్యాసము వ్రాయుచు, పాంచాలకేసరి పవిత్రనామము పాంచాలవాసుల రసనములపై నెట్లు నృత్యముచేయుచున్నదో ఆంధ్రసోదరులకు నేను విపులముగ తెలుపవలెనా? గర్భాలయమందు ప్రతిధ్వనించు గంభీరవేదఘోషవలె నేటి వసుంధరయందు మహాత్మశబ్దము ముఖరితమగుచుండుట లేదా? రామచంద్రరావు పూతనామధేయము గల అదృష్టవంతుడు. ప్రజల కష్టనిష్ఠురములను పంచుకొనిననాడు, నిరుపేదకు సన్నిహితుడైననాడు, నీడలేనివారి కరచేతిని గొడుగు చేసిననాడు, నిర్భాగ్యులకు నిక్కంపు చుట్టమైననాడు, అభాగుల నక్కున జేర్చుకొనిననాడు, కృషికులకు తలలో నాల్కయైననాడు, సేవకులకు సేవకుడైననాడు, దుఃఖితులను కడుపున బెట్టుకొనిననాడు, దిక్కులేనివారికి దిక్కైననాడు, దీనులకు బంధువైననాడు భారతీయు లీతని దీనబంధువని పూజింతురు. నక్షత్రపుంజమట్లు కాలవియత్తలమున కాంతిలు ప్రపంచమహాపురుషులందు నాడే ఈతడు చక్కనిచుక్కయై వెలుగొందును!




అమెరికా సంయుక్తరాష్ట్రములు స్వాతంత్ర్యమును స్థాపించుకొనినపుడు 1884 సం. ప్రాన్సు దేశమువారొసగిన శిలావిగ్రహము. ఈ విగ్రహము 150 అడుగుల ఎత్తుగలది. వేదిక 155 అడుగుల ఎత్తుయున్నది. ప్రపంచమునకంతయు వికాసమునుకలుగజేయు స్వాతంత్ర్యజ్యోతిని జూపుచున్నది.



గుంటూరుజిల్లా రేపల్లెతాలూకాలోని నల్లూరు గ్రామమున స్థాపింపబడిన గాంధిమహాత్ముని విగ్రహముగల ధ్వజస్తంభము స్వాతంత్ర్యోద్యమస్మారకచిహ్నము.

# అబ్బి ఎంకన్న

కొమఱ్ఱాజు వినాయకరావు
(నవ్యసాహిత్యపరిషత్తు)

౧

"వోరే ! ఎంకన్నా ! యెక్కడున్నావురా ? ఏంతగలెడ్తున్నావురా? ఎంత అరచినా మాట్లాడవేంటోయ్ !"

'ఆ ! అమ్మగోరు ! యీడ దీపాలు తుడుస్తున్ననండి'

"నీ మొహంమల్లేనే అవీ ఉన్నాయి, యేడుస్తూ ! ఎంతసే పాయేడ్పు ? — ప్రొద్దూకి యెంత సేపయిందో — యింకా తుడుస్తూ కూచ్చున్నావ్ !"

'ఐపోయిందండమ్మగోరు' వస్తున్ననండి!

"ఛీ, వెధవా ! ఎంతసే పారావడం ? యీపాళంగాలే ! వెళ్లు ; నీళ్లక్రింద మంటెయ్యి. అయ్యగారు స్నానాని కొచ్చే వేళైంది."

'వస్తున్ననండి, యింకోలాంతర తుడ్చి. అయ్యగోరు సుందరరావునాయుడిగో రింటికి వెళ్లిర్రు. ఇం కోఅర్ధగంట కొస్తనని సెప్పిర్రు.'

"ఎప్పుడొస్తే నీ కేమొరిగిందిలే గాని!— పని దబ్బున్నకానీ ! యింతనచ్చుగా చేస్తే ఐనట్టే!— తిం డెక్కువైం దైనా వెధవకి!"

అతికోపంగా మొహం చిట్లించుకుని, చరచరా సామానుకొట్టువిడిచి వెళ్లింది విశాలాక్షమ్మ,— వకీలు అప్పారావుగారిభార్యామణి. ఎంకన్న నాల్గులాంతర్లూ, వొక పెట్రోమాక్సులైటూ వొక బ్రెడ్రూము దీపం— అన్నిట్లోను కిరసనాయిలుపోసి, తుడిచి తయారుచేసి ఉంచి, ఓచింపిరిపేలికను కిరసనాయిల్లోముంచుకుని నీళ్లక్రింద నిప్పు రాజేసేటందుకని స్నానాలకొట్లోకి వెళ్లాడు ఉరుకులమీద పరుగులమీద.

"వోరేయ్! నీబొంద ఆమం టేమిటిరా? కొంప తగలడేటట్టేఉంది మొత్తానికి."

'నీళ్లు కాగొద్దమ్మా'

"నీశ్రార్ధం ! ఎక్కడేనా అంతనూనె పోసుకుంటార్రా పొయ్యిలో?—తగలెట్టే!"

'ఎబ్బే, అమ్మగోరూ ! కొద్దేనండి
పోసింది కిరసనోలూ.'

"కొద్దే ! కొద్దే ! కొంపగుంటమే యిట్లాగైతే. నే నివ్వాళ చూడబట్టి తెలిసింది. ఎవళ్లెట్టా మంటెడుతున్నారో నాకేం తెలుస్తుంది! రోజూ యింతే సేమో నిప్పెయ్యడం."

'లేదండమ్మా కాస్తంతే
కిరసనోలేస్త.'

"ఊ ! తెలిసింది ! చెప్పనక్కర్లే! యిక లేచిపో. మేడమీద ఆరుబైట అయ్యగారికీ,

నాకూ, పిల్లలకీ పక్కలెయ్యి దబ్బున; చంటిది లేస్తుంది, యెత్తుకుని ఆడిద్దుగాని."

'సిత్తం, అమ్మగోరు.'

... ... ... ...

... ... ... ...

ఆరుబయట సోల్పుగా పక్కలు పరుస్తున్నాడు యెంకన్న, — మొదట అయ్యగారిపరుపు, దానిపక్కనే అమ్మగారిదీ, దాన్ని ఆనుకుని ఆఖరున కుఱ్ఱాళ్లదీనూ. చాకలి కణ్ణెయమ్మ అప్పాళే తెచ్చిన మల్లె పువ్వుల్లాంటి తెల్లనిదుప్పట్లు మడుపులను విప్పి, చక్కగా చదునుగా పరుస్తున్నాడింకా—యెంకన్న. మేడమెట్లమీద కాళ్ల చప్పుడయింది గబగబా. ఎంకన్న మెడ వొంచి చూశాడు. సంతోషంగా కేకలేసుకుంటూ రొజుకుంటూ రొప్పుకుంటూ అమాంతంగా వొచ్చిపడ్డారు పక్కలమీద అప్పారావుగారి సంతానం, — ఆనందం, సుశీలాను, యెంకన్న దుప్పట్లింకా సాంతం పరచకముందే! పడి వొకరికింకొకళ్లు కితకిత లెట్టుకుంటూ కిలకిల వెఱ్ఱిగా నవ్వుకుంటూ, గాలిలోకి కాళ్లెత్తుకుని తన్నుకుంటూ, అటు నుంచి యిటు, యిటునుంచి అటూ పొర్లింతలు వేయడం మొదలెట్టారువాళ్లు. ఎంకన్న కెక్కళ్లేని

సంబరంపుట్టుకొచ్చింది, పిల్లల పొర్లింతలవల్ల పళ్లన్నీ బయటపడేటట్టు యికిలిస్తూ నకిలించాడు.

అట్టా తెల్లదుప్పట్లన్నీ తొక్కెయ్యకండి బాబు! అయ్యగోరు కొడ్తారు బాబూ!

ఆనందం—ఏవ్వాహోయ్ యెంకాయ్! గింకాయ్! ఉంకాయ్!

సుశీల!—నాన్నగారు కొట్టట్టా మన్నీ!

ఆనందం—మన్ని కాదే అక్కోయ్! వాణ్ణే దంచుకుంటాగ్లే నాన్నగారు; మనకేం?

సు—పాపం! మనం తొక్కెయ్యడమూను, యెంకన్న దెబ్బలుతినడమూనూనా! వాణ్ణి కొట్టించావంటేనా!—మాస్కో యేం జేస్తానో.

ఆ—ఏంజేస్తావేం? మహా! ఎథవ్వోం కన్న మామంచివాడేం? నువ్వంటే ఆవెధవకి ఎక్కువాపేక; మరి నేనంటేనో? ఎప్పుడూ నీకేదో మిఠాయీ కొనిస్తూనే ఉంటాడు. నాకిచ్చాడూ?

సు—ఛా కుంకా! పాపం, యెంకన్న ఎంతమంచాడురా! నిజం చెప్పు. నీకు మిఠాయి కొనియివ్వలే?

ఆ—(గాలిలో కాళ్లెగరేసుకుంటూ) ఊఁ, ఊఁ, యిచ్చాళ్లే—మహా! రెండుసార్లు. మరీ, నీ కవ్వాళ రంగులసబ్బుపెట్టెలు యిచ్చాడా; చెప్పు. నాకేదీ?

సు—ఛీ, సిగ్గులేదురా? మొగాళ్ల కెందుకో సప్పెట్టె! అమ్మాయివా నువ్వు?

ఆ—అదుగో, అమ్మాయిని చేస్తున్నావ్ నన్ను. మొగ్గాణ్ణి నాకేం?

సు—ఐతే నప్పెట్టలెందుకు ?

ఆ—పెన్సళ్లూ, కలాలు, చాక్లేట్లు, పిప్పరమెంట్లు, డబ్బులూ దాచుకోవద్దూ మరీ !

సు—అట్లాగైతే యిప్పిస్తాన్లే.

"లెగండి ! లెగండి ! బాబూ లెగండి ! అమ్మాయిగా రేదుస్తఉండది కింద; అయ్యగారొచ్చి(న్రు." అన్నాడు ఎంకన్న పళ్లికిలిస్తూ.

ఆ—ఏడ్చావ్లేవ్ యెంకన్న ! మేం లేవం; ఏంజేస్తావ్ ?

ఎంకన్న—లెగండి బాబయ్యగోరు; నప్పెట్టి యిస్తాగా.

సు—నాకో!

ఎం.—లెగండమ్మా! మీకూయిస్తా.

సు—నరేగాని — మరే — ఓమంచి బుల్లికథ చెప్పే? చెప్తానంటే లేస్తా.

ఎం.—లెగండమ్మా! పక్కలేసి చెప్తా.

సు—వొట్టు!

ఎం.—వొట్టు, ఆట్టాగే, లెండమ్మా.

... ... ...

"బోయ్!"

క్రింది వసారాలోనుంచి బిగ్గరగా కేక వేశారు అప్పారావుగారు. గబగబా మేడ మెట్లు దిగిపోయాడెంకన్న.

"పక్కలేశావురా ?"

"ఏశానండి."

"సీకో ఉత్తరం వొచ్చిందిరా వెధవా!"

'సిత్తం, బాబు! సదివిసెప్పండి బాబు!'

"వేరే - యేం - పన్లే సుశీలతో చదివించుకో పో!"

'సిత్తం.'

డాబామీద వెన్నెల పిండారబోసినట్టు కాస్తోంది. షుమారు రాత్రి తొమ్మిదయ్యింటుంది. చుట్టుపట్ల వచ్చిపోయే ట్రాములూ మోటార్ల మోత సద్దుకు పోతూంది.

బుల్లిఅమ్మాయిని చంకనెట్టుకుని, ఒక చేతిలో తనకొచ్చిన కార్డును పట్టుకుని ఆదుర్దాతో ఎంకన్న మేడమెట్లెక్కాడు.

ఓమూల నక్కికూర్చుని; కులాసాగా యేవో కబుర్లు చెప్పుకుంటున్న సుశీలను, ఆనందాన్ని చూశీ చూడడంతోటే కెవ్వుమంది యెంకన్నచంకనున్న శీత. ఆ బుజ్జి యేడ్పు విన్నారోలేదో? ఆనందం, సుశీలాను కబుర్లు వెంటనే కట్టిపెట్టి బోయివాంకకు తిరిగారు నవ్వుకుంటూ. సుశీల దబుక్కున లేచివచ్చి యెంకన్నచంకలో బుజ్జిని లాక్కుంది అమాంతంగా తనచంకలోకి!—కాకిగనక ఏగారెనో తన్నుకుపోయినట్టు. బుజ్జి అక్కచంకలో యేడ్వకుండా ఎంచక్కా తనబుల్లికాళ్లాడిస్తూ కూచుంది. 'నాబంగారు తల్లి! నాబుల్లితల్లి!' అని మురిసిపోయి ముద్దు ముద్దుగా ముద్దులు వర్షిస్తోంది సుశీల, ఆచిట్టితల్లిపొంగారు పాలబుగ్గలమీద. బోయియెంకన్న ఆవశంగా సుశీలమ్మదగ్గరికి వెళ్లి,—

'సుశీలమ్మగోరూ! ఈకార్డు కొంచెం సదివిపెట్టరు?'

"ఎక్కణ్ణుంచిరా?"

'ఖమ్మంనుంచి.'

"ఖమ్మ మేమిటీ?"

'మా వూరుపేరు.'

" సరే, ఏదాకార్డు."

ఆత్రుతతో ఎంకన్న తన చేతిలోని నగం నలిగున్న కార్డును అందిచ్చాడు అమ్మాయిగారికి; సుశీల చంకలోని చిట్టితల్లిని క్రింద కూలేసి, లాంతరువెల్తురులో ఆవుత్తరం చదవడం మొదలెట్టింది తడబడుతూ. ఎంకన్న ఆదుర్దాతో చెవులునిక్కబొడుచుకుని వింటున్నాడు.

"ఖమ్మం. క్షేమం.

మ-రా-రా-శ్రీ కడియాల ఎంకన్న అన్నయ్య గారికి, మీతమ్ముడు కడియాల కామన్న రాసుకొన్న క్షేమనగా—అనేక నమస్కారములు. మీవొద్దనుంచి బొత్తిగా జాబులు రావడంలేదు. వొదినగోరు చాలా భయంపడుతున్నరు. మీవోళ్లు కుషీగా ఉన్నరా? ఆనడుమ రాసిన కార్డులో సుంకెదవ పుట్టినట్టునూ చెప్పియుంటిరి. డాకటేరుకి సూపించుకోలేదా? వొదిన యెప్పుడూ నీవొంటి కులాసా సుంచే అనుకుంటది. వొంటివిషయం జాగ్రత్తపుచ్చుకొని డాకటేరుకి సూపిచ్చుకో. చెన్నపట్నంలో ఓదర్మాసుపత్రి ఉందని మొన్న యీనడుమ యీడకొచ్చిన పోలూరి లింగమయ్య చెప్పిండు. అక్కడ సూపిచ్చుకోరాదా? రిచ్చాబండి లాగే ఉద్యోగం అప్పలుమానేసుకుని, యింకెక్కడైనా యింకోనౌకరీ కుదుర్చుకుంటే నీవొంటికి మంచిదని వొదినఅంటది. నాకూ నీవు అట్లాచెయ్యాలని ఉద్దేశం."

చదవడం నగంలో ఆపేసి ఓకొంటెనవ్వు నవ్విసుశీల—



లాంతరువెల్తురులో ఆవుత్తరం చదవడం మొదలెట్టింది తడబడుతూ.

"ఒరేయ్! నీ భార్యపేరేమిట్రా?"

'.............................' (యికిలింపు)

"చెప్పు మరి! చెప్తేగాని మిగతాఉత్తరం చదవను."

'ల—చ్చి' (సిగ్గుతో)

"మరి అరేయ్! లచ్చిని తీసుకరావేంరా; నీనొంటెనిగురించి బెంగపెట్టుకుంది పాపం!"

'పబ్బేదమ్మా లచ్చిని తోలుకరావడానికి? ఏంజేస్తుందదో! లచ్చి!'

సుశీల మళ్లీ గబగబా మిగతాజాబు చదవనారంభించింది—

"మీరు మొన్నమనార్డరు చేసిన పదకొండు రూపాయిల ఎనిమిదణాలు అందినై. ఈడ సంగతులు ఏమీ బాగాలేవు. అప్పులోళ్లు మమ్మల్ని చడ చంపుకు తింటున్నారు. మొన్న పేటనుంచి సాహుకారుగుమాస్తా సుబ్బారావుగారొచ్చి డబ్బుకు చాలా వొత్తిడి చేశిను. అయ్యగారి కాళ్లట్టుకుని కుయ్యోమొఱ్ఱోఅంటే, రెండ్నెల్లదాకా వాయిదా పెట్టాను. అప్పట్లోగా వడ్డీతోసహా యిరువైరెండు రూపాయీలు చిల్లిగవ్వతోచేర్చి చెల్లించకపోయేటట్టయితే మన గొడ్లూ గోదా, ఉన్న ఎకరన్నరపొలం సాహుకారు కట్టుకుపోతాడు. ఇంతపూ కష్టకాలం వచ్చింది.

ఏంచెయ్యాల్లో మాకేమీ తెలీటంల్లే. పాపం! అయ్యకు పెద్దతనం బాగావచ్చిండె; రానురాను కళ్ల మసకలు ఎక్కువౌతుండై. అమ్మవొంటిసంగతి అంతకంటే అధ్వాన్నం. అయ్యా, అమ్మ నిన్నెప్పుడూ తలుసుకుని యెక్కి యెక్కి యేడుస్తరు. నువ్వు పట్టణాన నౌకరీకుదిరి యిప్పటికప్పుడే మూడేళ్లపై చిల్కపోతుంది. మీదొరోరివద్ద ఓనెల సెలవుపుచ్చుకుని యీడకొచ్చి అయ్యనూ, అమ్మనూ సూసిపోతే బాగుంటది. నాఆలోచనకు నువ్వేమనేదీ తిరుగుటపాలో రాయగలవు. జరూరు.

విలాసం—కడియాల కామన్న కిచ్చేది. ఎలిమెంటరీ తాలూకా స్కూలుటీచరు, ఖమ్మం. (మొగలాయీ)"

అని కార్డుసాంతం చదివి వినిపించడం మానేసింది. ఎంకన్న బిక్కమొహంవేశాడు. అతని గుడ్లల్లోనుంచి దుఃఖాశ్రుబిందువులొకకొన్ని జాలువారి సుశీలచేతులమీద పడినవి; పడీపడటంతోటే సుశీల ఖంగారుగా బోయివైపు తిరిగింది. దిగాలబడి కంటతడిబెట్టుకునిఉన్న ఎంకన్నదీనమూర్తి ఆమె కంటబడింది; బోయి అట్లా అవడానికి కారణ మేమిటో ఆ అమాయిక యెరిగింది కాదు. ఆమె పలచని, చక్కని కోల మొహం సహజశోచిస్సు, సానుభూతి సూచకంగా విచారజీమూతసంఛాదితం అయింది. అమాయికంగా ఆఅమ్మాయికూడా ఏడ్చింది 'ఆ — ఆ — ఆ' అంటూ ఆక్కుండా, గుక్కతిప్పకోకండా, ఎందుకో, కారణమేమీ తెలీకండా. ఇప్పటిదాకా పిల్లిమొగ్గలు వేసుకుంటూ గడబిడచేస్తున్న ఆనందమూను అల్లరికట్టిపెట్టి నోరుతెరచుకుని దిగాలబోయి ఎగాదిగ చూడటం మొదలెట్టాడు ఇద్దర్నీ—అక్కనూ, ఎంకన్ననూ. కాళ్లుచేతులు లెగ కేసుకుంటూ పొట్టమీద దేకుకుని వస్తోన్న బుజ్జి శీత కూడా దేకడంమానేసి కెవ్వున యేడ్వసాగించింది.

"అరేయ్! ఎంకన్నా! ఏమిట్రా — ఆ రణగొణధ్వనంతా? పిల్లలేడుస్తున్నారేంరా —వెధవా! వాళ్లని మేడదించి తీసుకురా!"

వంటింటి ముత్తలోనుంచుని అథారటీ చెలాయిస్తూ కోపంగా చీదరించుకుంటూ వక్కీలుగారి పడుచుపెళ్లాం బోయివెంకన్నను చివాట్లెట్టింది.

౨

కడియాలవెంకన్న స్వగ్రామం ఖమ్మం నైజాంలో. మహాబీదస్థితి నిజంగా అతనిది; ముసలితల్లీ తండ్రీ! ఎకరన్నర పొలం; ఓ చిన్నగుడిసె; యిదే యావదాస్తి. పైగా వందలఋణం! ఆఋణమే యిప్పటికి అయిదు వందలపై చిల్లరకు పెరుక్కొచ్చింది. ఎంకన్న జ్యేష్ఠుడు; అతని కిద్దరు తమ్ములు; అందులో కొద్దో గొప్పో విద్యాగంధం అబ్బిన దొక్క కామన్నకే! కామన్న ఖమ్మంలోనే ఎలిమెంటరీస్కూలు టీచరుపని చేసుకుని నెలకు ఓ 'పది' సంపాదించుకుంటున్నాడు. కనిష్ఠుడు రాజన్న కూలీ నాలీ చేసుకుని తన పొట్ట తాను పోసుకుంటున్నాడు కష్టం మీద.

ఎంకన్న కిప్పుడు షుమారు నలభైవపడి దాటిఉంటుంది బహుశః. ఐదార్గురుపుట్టిపోయీ రతనికి పాపం! పెద్దకుటుంబమాయె! తిండికి తిప్పలే ప్రతిపూటాను. పైగా షాహుకారుకు బోలెడుఅప్పు! మూడుకాళ్ల గుడ్డి అవ్వా అమ్మాను చాకిరీకి. ఎంకన్నకుయేం చేసేందుకూ తోచిందికాదు యిలాటి క్లిష్ట పరిస్థితుల్లో చుట్టుప్రక్కలవాళ్లెందరో చెన్నాపట్నానికి ధనసంపాదనార్థం వలస పోయి, కొన్నేళ్లతర్వాత నగదుమూటతో రావడం తరుచు చూచాడు; ఏవో బంగారుగను లున్నట్టూ, వెళ్లి త్రవ్వుకొనిరావడమే తడవైనట్టూ భావించి చెన్నాపట్టణం చేరుకున్నాడు యెంకన్న ఐదేళ్లక్రితం! ఊరుకొత్త, మనుష్యులుకొత్త, మాటకొత్త, నీళ్లుకొత్త! అంతా కొత్తే ఎంకన్నకు. అష్టకష్టాలూపడి, మూడుచెరువులనీళ్లూ త్రాగి, మొదటిరెండేళ్లలాగైతేం గడిపాడు అతను; ఓ ఆర్నెల్లు వొక అయ్యంగారింట్లో, మరో యేడు ఓకిరస్తానీ మిసియమ్మ రిక్షాలాగుతు, యింగతా ఆర్నెల్లు కట్టెలబల్లీడ్చి కూలీపుచ్చుకుని. సరే వొక్కచోట నౌకరీలో కుదుటబడి మూడేళ్లయింది; ఎక్కడా కాదు; వక్కీలు అప్పారావుగారింట్లోనే! నెలకు 'పదిహేను' జీతం; దమ్మిడీ రూపాయెత్తుగా చూచుకునేటువంటి అష్టదరిద్రతలో పిసుక్కుంటూన్న నైజాంవాళ్లకళ్లల్లో యెంకన్నకొచ్చే 'పదిహేను' ఓ పదిహేను వరహాలలా అనిపించాయంటే ఓఆశ్చర్యంలో చేరినవిషయం కాదు. ఐతే, నిజంవిచారిస్తే ఎంకన్నకున్న చాకిరీకి తగ్గదికాదు. చచ్చేటంతపని, ప్రొద్దున్నుంచి మాపు నడిజాము దాకా! బోయికి వొక్క రిక్షాయీడ్చే ఉద్యోగమేకాదు! చిల్లరమల్లర పనులు చెప్పరానన్ని! తెల్లారకట్టే లేచి స్నానాలకొట్లో నీళ్లపొయ్యికింద మంటెయ్యాలి యావత్తు కుటుంబం నీళ్లుపోసుకునేందుకని; బంగళా చుట్టూ కించిత్తయినా పెంటకుప్ప లేకండా

వూడ్చి, నీళ్లుచల్లి శుభ్రపరచాలి; అంతట్లోకే వీథిలో పాలబ్బి 'సామిపిళ్లె' కేక! పరుగెత్తుకుని పోయిగుడ్లగూబమల్లే దృష్టిఅంతా సామిపిళ్లె పాలగొట్టాలమీదే అణచిపట్టాలి, కుళాయీనీళ్లన్నీ పాలల్లో కెక్కకుండా. అప్పటికి తెల్లారుతుంది; సరే, పిన్నపెద్దల పడకలెత్తి చుట్టి ప్రత్యేకింపబడ్డ కొయ్య 'స్టాండు'లో వాటిని అమర్చడం; అంతట్లోకే అయ్యగారి గొంతుక! గబగబా ఉరికి అప్పారావుగారి తోకవెనకాలే చెంబట్టుకుని 'పాయిఖానా'వరకు వెళ్లి, అది గుమ్మంలో పెట్టి, అయ్యగారు మళ్లీ యేఅరగంటకో బయట సాక్షాత్కరించే వరకు ఒంటికాలిమీది కొంగలా తపస్సుచేసుకుంటూ, బుజ్జగోక్కుంటూ నిల్చునిఉండడం; ఇక చంటిపిల్లశేతని చంకనేసుకోవలసినపని, సరే, ఉండనేఉందెప్పుడూ. ఎనిమిదిన్నరకల్లా అమ్మాయీ అబ్బాయీ పుస్తకాలతో నప్పెట్టెలుమ్మకుని స్కూలుకు వెళ్లేందుకు హాజరౌతారు. ఇద్దరిస్కూళ్లు కూడా తిరువళిక్కేణిలోనే ఉండడంచేత కొంచెం తెరపిఅనిపించేది యెంకన్నప్రాణాలకి! ఒకర్ని 'హిందూహైస్కూల్లో'నూ, యింకొకర్ని 'లేడీవిల్లింగ్‌డన్'లోనూ దిగబెట్టి మళ్లీవచ్చి, కాటావేస్తే సరిగ్గా నూటతొంభైతొమ్మిదిపై చిల్లర పౌండ్లబరువుతూగే రుబ్బురోలుప్రాణంవంటి వక్కీలు అప్పారావుగార్ని ఆయన ప్లీడరీసరంజామాతో సహా షుమారు మూడునాల్గుమైళ్లదూరంలో ఉన్న హైకోర్టుభవనాలకు యీడ్చి, అక్కడ అతన్ని దిగుమతి చెయ్యాలి. ప్రొద్దునమల్లేనే సాయంకాలమున్నూ. అయ్యగార్నీ పిల్లల్నీ యింటికి చేర్చింతర్వాత యెంకన్న చెయ్యవలసినపను లన్నీ తెలిసేఉన్నాయి.

## 3

"బోయ్! బోయ్!"

వక్కీలు అప్పారావుగారు పిల్చారు, ఆఫీస్‌గదిలో మెత్తని బాలీసుల కుర్చీలో ఠీవిగా చతికిలబడి! ఒకసారి!—రెండుసార్లు! మూడు సార్లు? పిలుపునకు యెప్పటిలా "వొస్తున్న బాబు!" అనే బదులు లేదు. వాకిట్లోనుంచి నీరసంగా మూల్గుడుమాత్రం వినవచ్చింది. కోపంతో మండిపడి చివుక్కున లేచి 'వరాండా'లో ప్రవేశించారు వక్కీలుగారు.

"వినపళ్లే, నిన్నే, పిలుస్తోంటే? ఇదేమి ట్రోయ్ ముసుగెట్టుకుని పడుకున్నావ్?—యిప్పుడేం నిద్ర!"

"... ... ... ..." (మూల్గు)

"జరంరా?"

"ఊఁ! ఊఁ!" (మూల్గు)

"బోయ్! ఏమిటీ గొడవ?"

'గుండెదడండి బాబు!'

"బాగుపడ్డట్టే! వచ్చిందీ మళ్లీ. ఎన్నిసార్లు చెప్పాన్రా జనరలాసుపత్రిలో చూపించుకొమ్మని."

'అబ్బ! అమ్మ! చూపించుకున్నా బాబు!'

"ఏడ్చినట్టేఉంది నీనౌకరీతనం! ప్రతిరెణ్ణెల్లకీ వొక వారం పడకేయ్యడం! మాయివ్వాళేం జెయ్యాలి? పిల్లలు స్కూలు మానుకోవలసిందే—నేను కోర్టు మా—"

'లేదు బాబు! 'మారిముత్తు'ను పెట్టానండి నాల్గు రోజులకి. నాకొచ్చేజీతం వాడి కియ్యండి బాబూ. ఆసపత్రిలో చేర్తానండి.'

"సరే! యేదోవొకటి చేద్దాం! నీ సంగతేం బాగాలేదు."

*　　*　　*

*　　*　　*

*　　*　　*

"బోసు! ఎల్లావున్నావ్?"

'అట్టాగేనండి బాబు!'(మూల్గు)

"ఇంకెన్ని రోజులుండాలిట?"

'వారం ఉండమన్నారు పెద్ద డాకటేరుబాబు!'

"అనుకున్నట్టే అయింది! ఏ పదిహేనురోజులో నెలో పోతుంది



అప్పారావుగారు నోటసు తగిలించబడున్న 'చార్టు'తీసి చూచారు



ఉదకమండలమున సరస్సు    C. G. J.

నీ విల్లు చేరుకునే టప్పటికల్లా. జబ్బేమిటన్నా[రా ?”

‘ఏమోబాబు! యిక అస్సలు ‘రిచ్చా’ లాగడం మానెయ్యమన్నారండి. లేకపోతే సచ్చిపోతనన్నారు బాబూ!’

“సరే! నిన్నడిగే దేమిటి. నా తెలివీ సరే; గోడకున్న ‘‘చార్టు’ చూస్తే తెలుస్తుంది.”

అప్పారావుగారు గోడకు తగిలించిఉన్న ‘చార్టు’తీసి చూచారు అదేఘోరణిగా వొకనిమిషం. ఎందుకో, వొకటి రెండుసార్లు ఆయన నొసలు చిట్లించి, బొమలు ముడిచారు. ఏదో భయంతో జలదరించాడేమో అన్నట్లు కనిపించాడు వొక్కత్రుటి. కొంచెం ఆదుర్దాతో కూడుకున్న విసుగుదలతో మొహం చిట్లించి—

“బోయ్! నీకథంతా చూస్తే ఇంకా పదిహేను నెలరోజులైనా అన్యోలా కనిపిస్తుంది. ఈ “పర్నీషస్ ఎనీమియా” కుదిర్! — నీవు బాగుపడి!— నౌకరీచేసి! — ”అంటూ ‘జనరల్’ ఆసుపత్రి ‘బీదలవార్డు’ తాలూకుగది వదిలి వెళ్లిపోబోయారు. అంతట్లోకే, యింకా అప్పారావుగారు గదిగుమ్మం దాటకముందే రొప్పుతూ, ఉరుకులమీద గదిప్రవేశించారు సుశీలా ఆనందాలు. వాళ్ల వెనకాలే బుగ్గలు సొట్టపడేలా తియ్యనినవ్వులు వొలకబోస్తున్న బుడ్డిశీతను చంకనెట్టుకుని చక్కావచ్చాడు రిక్షాఅబ్బి ‘మారిముత్తు’. అప్పారావుగారి కేంచెయ్యాలో తెలిసిందికాదు. వాళ్లని రిక్షాలోనే ఉంచి రానీయవద్దని మారిముత్తుతో ఘట్టిగా చెప్పివచ్చాడే యింతకుముందే.ఐనా, వీళ్లకి ఫలానా ‘వార్డని’ ఎట్లా తెలిసిందో? ఏ అల్లరిచేష్టలుచేస్తారో యిక్కడ? కోతులూను, కొండముచ్చులూను ఆయెపిల్లలు! అప్పారావుగారు గుమ్మంఅవతలికి నడిచి మారిముత్తును ఓమారు చురచురాచూచి, చరచరా వెళ్లిపోయారు ‘రమ్మని’ మారిముత్తుతో ‘సంజ్ఞ’ చేసి.

* * *

సుశీలా ఆనందం గబగబా పరుగెత్తుకుని వెళ్లి వెంకన్నమంచాన్ని ఆనుకుని నిల్చున్నారు, అప్పుడే ముసుగెట్టుకున్న వెంకన్న కేసి వెఱ్ఱిగాచూస్తూ. అలవాటుపడ్డ గొంతుకలాయె! పోల్చుకున్నట్టున్నాడు వెంకన్న; చటుక్కున బిగించిన ముసుగుకాస్తా ఆత్రుతతోతీసి కూర్చో ప్రయత్నించాడు. పాపం! ఏం కూర్చోగలడు ? కూర్చోలేక ఆయాసంతో పడకలోకే పడిపోయాడు. సుశీలకళ్లల్లో నీళ్లు గిఱ్ఱునతిరిగినాయి! అపరిమితమైన ఆపేక్ష బోయిఅంటే సుశీలకు! పాపం! నిజంగా వెంకన్నే? యీపడిపోయి యిట్లా మూల్గుతోంది! ఎంతనీరసించిపోయాడో! కళ్లల్లో కళేలేదు; ఉబ్బెత్తుగాఉండే దవడలు యెంతలోతుకు పీక్కొనిపోయినాయి! పీనుగుమల్లే భయంకరంగా, పుడకలా నన్నగాఉన్నాడు బోయి. ఏమిటిదంతా? పొట్టిఅమాయిక సుశీల కేమీ పాలుపోలేదు.

ఐనా! సుశీల కేంజెబుతే యేం తెలుస్తుందని! పట్టుమని ఎనిమిదేళ్లైనా యింకా దాటలేదాయె. అప్పుడే యీ ప్రపంచసంగతులేం తెలుస్తాయి, పాపం! అయితే యిదిమట్టుకు తెలుసుననుకుంటూ ఆ అమాయికకు; బోయి యెంకన్న కేదో పెద్దజబ్బుచేసిందని మాత్రం. ఎంకన్న యెంతమంచివాడు! తన కెన్నిసార్లు యెన్నెన్ని రంగురంగుల సప్పెట్లిచ్చాడు; యెన్ని 'పిప్పరమెంట్లు' కొనిపెట్టాడు! అన్నిటికంటె అతనికథలు! అబ్బో! ఎన్నికథలు! సుశీల కథలంటే చెవులు కోసుకుంటుంది. డాబామీద వెన్నెట్లో బోయి అప్పుడే పరచిన పక్కలమీద దొర్లుతూంటె, యెంకన్న యెన్ని, యెలాంటి కథలు తనకు చెప్పాడు?

ఒకరోజు నాన్న అమ్మమీద కెందుకో గాని వొక స్వల్పవిషయంలో పట్టుదలమూలాన్ని వొంటికాలిమీద లేచి చివాట్లు పెడుతుంటే, తాను అమ్మకు అడ్డపోయి నాన్నను కోబ్బడింది; నాన్న అమ్మమీది కోపమంతా చివాలున తనమీదకిదూకించి ఫెళ్లున తనను లెంపకాయ కొట్టాడు; అంతట్లోకే యిదంతాచూస్తూ ముక్కుమీద వేలుఉంచుకుని అక్కడే నిల్చునిఉన్న యెంకన్న అమ్మాయిగార్ని అయ్యగారు కొట్టడం చూళ్లేక పరుగెత్తుకుని వొచ్చి సుశీలా అప్పారావుగార్ల నడుమ నిలబడ్డాడు. కళ్ల వెంబడి నీళ్లు కారుస్తూ "మా అమ్మాయిగోర్ని కొట్టొద్దుబాబు! నన్ను కొట్టండిబాబూ!" అని జాలిఉట్టిపడేలా మొరపెట్టుకున్నాడు. అప్పుడు నాన్న మండిపడుతూకళ్లెఱ్ఱజేసి "ఛీ, వెధవా! నీవెవడ్రా నడుంగా! నడూ! యీమట్టుకు," అని ఉఱిమాడు. అన్నీ వొక్కమ్మడి గిఱ్ఱున తిరిగిఉంటాయి సుశీలమన



ఆమెన యెక్కణ్ణించి పుట్టుకొచ్చిందో!—

న్నులో! లేకపోతేయేమీ యెఱుగని సుశీల అట్లా యెడతెగకుండా యెందుకేడుస్తుంది?

ఆనందం అస్సలు కుర్రాడూ! ఏమీ బోధపడినట్లు అగుపించలే అతని బెదరు వైఖిరినిబట్టి చూస్తే!—అస్సలు, బోయి యెంకన్నేనా ఆపడుకుంది? అయితే యిట్లా ఉన్నాడేం?—ఏదో భయంకరంగా పళ్లన్నీ వెళ్లుకొస్తూ, ఏపిశాచంనుల్లేనో! సంశయంతో ఆనందం దూరంగా నిలబడ్డాడు చేతులు వొత్తుకుంటూ.

సుశీలమాత్రం నిర్భయంగా, నిస్సందేహంగా బోయి మంచందగ్గిరసా ఉన్న కుర్చీలో కూచుని అతన్ని ఏమిటో ప్రశ్నిస్తోంది. ఎంకన్న ఆమె చిన్న అంద



[illegible] తెగకుండా యేడుస్తోంది.

మైన కోలమొహంకేసి అతిదీనంగా చలించ కండా చూచాడు; బాధపడుతూ — ఒక్క నిమిషం! మరోనిమిషంలోకల్లా అతనికళ్లల్లో నీళ్లు గిఱ్ఱుమన్నాయి; అవి చెంపలమీాదుగా చాళ్లుకట్టి ప్రవహించి, సుశీల లేతచేతుల్ని తడిపివేశాయి. చేతులు తుడుచుకుని గద్గద కంఠంతో సుశీల—

"యెంకన్నా!"

'అమ్మాయిగోరు!'

"ఎట్లాఉందిరా? నొప్పా?"

"........" (మౌనము)

"మళ్లీ యింటికెప్పుడూ రావడం?"

'ఏమోనమ్మా! బగమంతుడికెఱుక'

"అట్లా మూల్గుతున్నావేంరా?"

'నొప్పి, అమ్మాయిగోరూ! నొప్పి, బత్కుతనో, సస్తనో?'

"ఛా, వెధవా! అట్లా అనొద్దురా, నా కేడు పొస్తుంది"

'...........' (మూల్గు)

"ఒరేయ్! మరిచిపోయా, నీకోఉత్తరం వొచ్చింది, నీపెళ్లాందగ్గర్నుంచి."

అదోమోస్తరుగా నవ్వింది సుశీల, వొక కొంటెనవ్వు, కన్నీటిమసకతెరలగుండా, వానలో యెండకాసినట్టు! "ఆ! ఆ!" అంటూ ఆదుర్దాతో లేవబోయాడు బోయి. సుశీల అతన్ని లేవనియ్యక కుర్చీ మరీ దగ్గిరకీడ్చుకుని, అతని కళ్ళలోకి వంగిచూస్తూ, 'సప్పై'లో నుంచి వొక నలిగిన కవరుముక్కతీసి వినిపించ మొదలెట్టింది.

"ఖమ్మం క్షేమం,

మ॥ రా॥ రా॥ శ్రీ కడియాల ఎంకన్న అన్నయ్యగార్కి మీతమ్ముడు కామన్న రాసుకునేది- అనేక నమస్కారములు. మీవొద్దనుంచి యీానడమ అస్సలే ఉత్తరంముక్క అన్నమాట లేదాయె! వొదినగోరు మిమ్మల్ని గురించి చాలా భయపడుతున్నారు. వొళ్లు కుషీగా ఉండదని అనుకుంటాను. వెంటనే తిరుగుటపాలో మీ క్షేమసమాచారం రాస్తేనే నే నిక్కడబతకడం! లేకపోతే వొదిన నాప్రాణం నిలువునా తీస్తది. ఈ నడమ పట్నంనుంచి వొచ్చిన పసువులయిలమంద మనూళ్లో 'ఎంకన్న వొక అరవత్తిడమనిషిని మరిగిం'డని పుకారు పుట్టించిండు. ఊళ్లో యిరోధాలే యిందుకు కారణం. నే నమ్మలేదుకాని, వొదిన పాపం, పిచ్చి తల్లి! అనుమాన పడ్తొంది. నేనెంత సముదాయించి చెప్పినా వినక, యేవేళా దిగులుబడి ఉంటున్నది. అప్పుడప్పుడు ఉత్తరాలురాస్తుంటే నీకేంపోతుంది! అశ్రద్దమనిషివి; యీాఅశ్రద్దే అన్నివిధాలా మనకొంప కూలుస్తున్నది.

అయ్యా, అమ్మ మంచంపట్టిన్రు; బహుదొంకి చాలా ఖాయిలాస్థితిలో ఉన్నరు. ఎప్పుడూ నిన్నే తలుసుకుని యేడుస్తరు. నీ వొకపారి అయ్యగారిదగ్గర సెలవుచ్చుకుని యీాడకి వొచ్చిపోతే బాగుంటది. అన్నిసంగతులూ కనుక్కొని సరిదిద్దిపోవచ్చు. అప్పులోళ్లబాధ పడటానికంటే, నిజంగా, యే గొయ్యో, నుయ్యో చూచుకుంటే బాగుంటది. వారంక్రితం వాళ్లు పెట్టినవాయిదా దాటిందనీ, అయిదువందల రూపాయిల నగదు చిల్లిగవ్వతోసహా రెండుమూడు రోజుల్లోగా చెల్లించనట్లయితే యిల్లూ, పొలం, గొడ్లూ, గోదా అన్నీ కట్టుకపోతామనీ షావుకారుగారు పేట నుంచి గుమాస్తా సుబ్బారావుగారి బంట్రోతు ద్వారా కబురు పంపారు. ఏంజెయ్యాలో పాలుపోవడంలే! డబ్బువిషయంలో షావుకారుగారు ఆఖరుకి పిసరైనా

వదిలేమనిషికాడాయె. ఈ రెండుమూడు రోజుల్లోగా అయిదువందలు నగదు యెక్కణ్ణుంచి యెట్లా వొస్తుంది? నా తాలూకు వడ్డీకిచ్చిఉంచిన ఏ రెండువందలోఉంటే, ఆమొత్తంకాస్తా మొన్న స్వయంగా పేటకువెళ్లి షాహుకారుగారి ముందరపెట్టి కాళ్లట్టుకుని కడుపట్టుకుని యేడుస్తే మిగతాపైకం చెల్లించడానికి యింకో పది రోజులు గడువిచ్చాడు, బహుకష్టంమీద, తిట్టుతూ వినకుండటూను. కాలం ఏమీ బాగాలేదు. వానలు లేవు. పంటలు పోయేటట్టున్నాయి. ఇక్కడ స్థితిగతులెంతమాత్రం బాగాలేవు. నాకేంచెయ్యాలో తోచ టంలే. నీవు వెంటనే బయలుదేరి రావలసింది. 'టెలిగ్రాము' యిద్దామంటే పైసాలేకపోయింది. తక్షణం బయలుదేరిరా."

చదవడం ఆపింది సుశీల; ఉలిక్కిపడ్డాడు బోయివెంకన్న; బిక్కమొహం వేశాడు. లోతుకు గుంజుకుపోయి ఊపిరిలేనట్టు నీరసంగాఉన్న అతనికళ్లల్లో దుఃఖాశ్రువులు వాహినులుకట్టి అనర్గళంగా ప్రవహింపమొదలెట్టాయి, అతని శుష్కితగండభాగాల్ని తడిపివేస్తూ. యెంకన్న యేడుస్తుంటే సుశీల చూడలేకపోయింది. ఆమెకు యెక్కణ్ణుంచి పుట్టుకొచ్చిందో!—యెడతెగకండా యేడుస్తోంది. ఆనందం ఏమీ అర్థంకాకండా తెల్లమొహం వేశి బిక్కపోయి నుంచుని చూస్తున్నాడు. అంతలో గిలకలా నవ్వుతూన్న శీతను చంకనెట్టుకుని చక్కావొచ్చి "అయ్యా! పిల్తాన్రు!" అన్నాడు మారిముత్తు. సుశీల తడికళ్లతో కుర్చీనుంచి దిగి, బోయిని విడిచి పోలేక పోలేక, "యెంకన్నా! వెళ్లొస్తాన్రా" అన్నది వొణికిపోతూన్న కంఠంతో. పడుకున్న యెంకన్న గబుక్కున కప్పుకున్న దుప్పటికాస్తా విదిల్చి లేచి కూచుని, పోబోతూన్న అమ్మాయిగార్ని దగ్గిరకు లాక్కుని అక్కునకు అద్దుకున్నాడు వొణికిపోతూ, ఆ వేదనతో—ఉద్రేకంతో—కన్నీళ్లతో!

---

## తన్మయత

కళానిధి

మధురనక్షత్రవీణారవాభరామృ
   తంబు తమి తీర నాస్వాదనంబు సలిపి
విశ్వనీరవ సంగీతవీచికలను
పొరలి కెరలితి నన్నె నే మరచిపోతి.

గాఢధాత్రికదంబవృక్షప్రశాంత
శీతలచ్ఛాయలను తమిఁజేరి సాంద్ర
చంద్రికాసారభంబుల సౌఖ్య మొనసి,
మురిసిపోతిని నన్నె నే మరచిపోతి.

వలపువెన్నెలసందిట నిలిచి పొలిచి
ముగ్ధమోహానదరహాసముకుళవకుళ
సూనసౌగంధ్యబాంధవశోభనంబు
లారసికొనుచును నన్నె నే మరచిపోతి.

లలితకవితావిలాసినీహాస్యకలన
మాలకించుచు నుడుపథప్రాంగణాప్ర
శోభిజీమూతనర్తన ప్రాభవంబు
మననసేయుచు నన్నె నే మరచిపోతి.

# అభాగ్యుఁడు

శ్రీ పిఠాపురము యువరాజు

విహగకూజితపరిశుద్ధవిశ్వగాన
ముదము భాస్కరరశ్ముల కాంతి యొసఁగె
వివిధపుష్పసముచ్చయవికసనంబు
మందమారుతముల కెంతో యందమిచ్చె
శ్రేష్ఠఫలజాతమధురససేచనంబు
స్వచ్ఛనిర్ఝరవారికిఁ జవులనిడెను
వింతశోభల వనమెల్ల వెలయుచుండె.

* * *

పాంథుఁ డొకఁ డప్పు డావనవాటియందు
మందహాసము చిగిరింప మసలినాఁడు.

అస్తమించెను భాస్కరుం డంతలోన
గాఢజీమూతసంఘంబు గగనవీథిఁ
గప్పివైచెను గాఢజీఁకటులు గ్రమ్మఁ
గర్ణపుటభేదియగు మేఘగర్జనంబు
మెఱపుఁదీఁగెలగములతో మేళవించె
ఘోరమారుతభీకరఘోషణంబు
వర్షధారలహోరుతోఁ బంతమాడె
విశ్వగానము మాఱెను విశ్వరోద
నముగఁ; గాలవాహినిలోనఁ గ్రమత దప్పె
విప్లవ మదేమొకో మిన్ను విఱిగిపడెనొ
లేక, ప్రళయకాలపుఁ బెనుఢాకయేమొ
కాక, నరదేవదానవఘర్షణంబొ
లేక, రుద్రునితాండవలీలయేమొ
కాక, గోళంబులన్నియుఁ గదిసెనేమొ
యేద యెటులైన విప్లవమీదృశంబు
జగతినంతను నుఱ్ఱూఁపఁజాలదొక్కొ?

* * *

పాంథుఁ డప్పుడు కన్నీళ్లు పాఱుచుండ
నేమియును జేయఁగాలేక యేడ్చినాఁడు
ఇంటి కేగంగ నాతని కిల్లెలేదు!
మిత్రుఁ డొకఁడును దోడ్పడ మిగులలేదు!
శ్రమకు నోర్వఁగ నతనికి శక్తిలేదు
ఎక్కడకుఁ బోవవలయునో యెఱుకపడదు.

* * *

అశనిపాతాలయలజడి యతిశయింప
భీరుఁడై యాతఁ డిట్టటు పాఱినాఁడు
ఏడ్వ నేడ్వఁగఁ గన్నీళ్లు నిండిపోవ
నేడ్వలేకయె మనసులో నేడ్చినాఁడు.

* * *

వర్షములు లేక యెట్టులో బ్రదుకవచ్చుఁ
గాల్వ లెండిన మఱియెట్లొ గడపవచ్చు
సూర్యకాంతియు లేకున్నఁ జూడవచ్చు
నిదుర రాకున్న రాత్రులఁ బాదలవచ్చు
నవ్వు లేకయె జీవము నడుపవచ్చు
సౌఖ్యమే లేక కాలము జరుపవచ్చుఁ
గాని, యేడ్పువచ్చిన యప్డు కంటినీళ్లు
తోడు రాకున్న బ్రదుకుట దుర్భరంబు!

* * *

దుర్భరంబైన నేమైన, దుర్లభంబు
బ్రహ్మ వ్రాసిన వ్రాఁతను రద్దుసేయ;

అనుభవించియె తీరును మనుజుఁ డెపుడుఁ
గర్మవశమునఁ జేసి దుఃఖంబొ సుఖమొ.

* * *

పాంథుఁ డెప్పుడు చేసెనో పాపకర్మ
మిట్టి యిక్కట్ల నొక్కుల రట్టునొంద!
ధీరుఁ డయ్యును గష్టాల భీరువయ్యె
శమము గల్గియు శ్రమకోర్చు శక్తి పోయె
రాయఁగా రాయఁగా నెంత ఱాయియైన
క్షీణతనుబొంద మనుజుఁడే చిక్కిపోఁడె!

* * *

పంచభూతములుం గూడి పంతగించి
యట్టహాసములను జేయునట్లు తోఁప
బాధ కోర్వంగలేక యాపాంథుఁ డపుడు
మొఱ్ఱవెట్టెను "దైవమా! మోక్ష" మంచు

* * *

వాని మొఱ్ఱకె కాఁబోలు వసుధయంత
కంపమొందెను భీకరాకార యగుచుఁ
గాని తత్కష్టమోక్షంబు కలుగలేదు!

* * *

ఈశ్వరుం డేమి తలఁచెనో యెఱుఁగలేక
పాంథుఁ డేమేమొ యెలుఁగెత్తి పలవినాఁడు
కష్టకాలాన రక్షణ గాంచలేక
యలసి యాత్మహత్యను జేయఁ దలఁచినాఁడు
ఆత్మఖడ్గము పైకెత్తి యఱచినాఁడు
"నన్ను హింసించునో భూతనాథులార!
యింక నాకేమి మీ సేయుహింసతోడ?"

* * *

ఆ సుతీక్ష్ణదుర్వారఖడ్గాగ్ర మపుడు
మృదుతరంబైన యాతనిహృదయసీమఁ
జీల్చివైచెను రుధిరమ్ము చిందిపోవ
బొందెయును నేలపైఁ బడి పొఱలునట్లు.

* * *

వానికై యప్పు డెవరును వగవలేదు
వగపుతో వాని కప్పుడు పనియు లేదు
కాని, యారాత్రి యెచటనో గగనవీథిఁ
బుట్టె నాక్రందరావంబు బోరుమనుచుఁ
గానిపింపదు దానికిఁ గారణంబు
కానిపింపనికరణమె కారణంబొ!

* * *

నిలిచిపోయెను వానయు నీరులేక
మేఘములు లేక యుఱుములు మెఱుపులడఁగ
నంత నాపెను జీఁకట్లు నంతరించెఁ
గాలచక్రము దొరలెను జాలమాఱు
లైనఁ దచ్ఛోకరావము మానకుండ
వినఁబడెను జాలఁగాల మీవింత యేమొ!

# నక్షత్రమండలము

(యువసంవత్సర పుష్యమాసము)

గో॥ బొబ్బారు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను. ఇందున్నట్లు

1936 జనవరి 8 తేదీని రాత్రి 8-50 గంటలకును, జనవరి 15 తేదీని రాత్రి 8-22 గంటలకును
,, 22 ,, ,, 7-54 ,, ,, 29 ,, ,, 7-28 ,,
ఫిబ్రవరి 5 ,, ,, 7- ,,
నక్షత్రాదులు కనబడును.]

Two men stood looking through the bars,
One saw the mud the other saw the stars.
All nature is but art unknown to thee,
All chance, direction which thou canst not see;
All discard, harmony not understood;
All partial evil, universal good.

ఇద్దరు మనుష్యులు-జాలకట్టిలలో నిల్చి చూచుచున్నారు! అధోదృష్టితో నొకడు భూమిని, భూమి మీదిమట్టినే చూచుకొనుచున్నాడు! ఇంకొకడు పైన ఆకాశముమీది నక్షత్రములను చూచి విస్మితుడగుచున్నాడు.

"నాయనా! నీవు గమనించి తెలిసికోజాలనిదంతయు హఠాత్తుగా జరిగినదని అనుకొని పొరబడుచున్నావు; కుదిరి గోప్యముగానున్న పొందికను సమన్వయించుకోజాలక విభిన్నత నారోపించుకొనుచున్నావు; విశ్వము మేలుకొఱకే జరుగుచున్న సంఘటనలు కీడని భ్రమసి బెదురుచున్నావు; ఆమర్మములు భేదింపజాలక అంతయు నయోమయమని దిగులొందుచున్నావు; విశ్వమంతయు కళాప్రపూర్ణముసుమీ!"

౧౯౩౬ సంవత్సరము జనవరి ౧ వ తేదీనుండి ఫిబ్రవరి ౧ వ తేదీవఱకు రాత్రి తొలిజామున నగపడు గ్రహనక్షత్రాది ఖగోళవిశేషముల గమనింతము.

ఈ మాసము హేమంత శిశిరఋతు సమాగమ విశేషముచే నొప్పుచున్నది. వాల్మీకి చక్కగా వర్ణించినట్లు హేమంతఋతువునందు,

"నీహారపరుషో లోకః పృథివీ సస్యశాలినీ,
జలాన్యనుపభోగ్యాని సుభగో హవ్యవాహనః,
మృదుసూర్యాః సనీహారాః పటుశీతాస్సమారుతాః"
ఆరణ్య. ౧౬-౪-౧౧.

చలిబాధకు లోకము ఉహుహూఅని వణుకుచున్నది; అగ్నిహోత్రుడు ఇష్టమగుచున్నాడు; సూర్యకిరణములు ప్రియమగుచున్నవి. శీతలాధికతచే నీరు పీడాకరమగుచున్నది. శిశిరఋతువునందు చలి తగ్గి మనోజ్ఞముగానుండును. అట్టి పుష్యమాఘమాసములందు

పాలవెల్లి
(Milky way)

"భోగికంకణు తలపూలదండ" అననొప్పు నీ ధవళదృశ్యము ఆగ్నేయమున నౌకామండలము నుండి వాయవ్యపుశ్యామసీమలవఱకు, అచ్చటచ్చట సన్నగిలుచున్నను మొత్తముమీద విస్తరించుచు, శ్వాన పూర్వశ్వానమండలముల మధ్యబడి, ఆర్ద్రినంటుచు, బ్రహ్మహృదయమునకు వారగాపోయి భృగుపరశుమండలముం గడచి అప్సరసలందఱుపుచు ఉర్వశీపురూరవసులందాటి వాయవ్యమున నదృశ్యమగుచున్నది. ఆగ్నేయమునందుకంటె వాయవ్యమున నది మూడింతలు విరివి గలిగిన ట్లగపడుచున్నది. రుద్రదైవత్యమైన ఆర్ద్రినక్షత్రమును, మృగవ్యాధరుద్రుని అంటుచు పోవుచున్నయీ ధవళదృశ్యము ఇపుడు 'భోగికంకణుతలపూలదండ' అనుట ఎంతయు ఒప్పియున్నది. పాలవెల్లిలో మందరగిరిని చుట్టియున్న వాసుకి సమీపమృగవ్యాధరుద్రుని చేతికి కంకణమనుటయును ఉచితమనిపించుచున్నది.

తేజోవిషయమున నగ్రగణ్యము లైన
నక్షత్రరాజములు

ఇరువదింటిలో ఈమాసమున తొలిజామునందు ౧౧ మాత్ర మగపడుచున్నవి. అవి యేవేవి యనగా:—

౧. పడమట అస్తమింపబోవుచున్న ఇంద్రద్యుమ్నుడు. (Fomalhaut)

| | | | |
|---|---|---|---|
| ౨. | దక్షిణాకాశమున | శంతనుడు | (Acherner) |
| ౩. | ,, | అగస్త్యుడు | (Canopus) |
| ౪. | మధ్యను | మృగవ్యాధ | (Sirius) |
| ౫. | ,, | పూర్వశ్వాన | (Procyon) |
| ౬. | ,, | స్తంభమూర్తి | (Pollux) |
| ౭. | ,, | ఆర్ద్ర | (Betelgeaux) |
| ౮. | ,, | రోహిణి | (Aldebaran) |
| ౯. | ,, | రిగెల్ | (Rigel) |

౧౦. ,, బ్రహ్మ హృదయము (Capella in Auriga)
౧౧. తూర్పున ఇప్పుడే ఉదయించుచున్న మఘ-(Regulus)

## గ్రహములు

ఈమాసములో ముఖ్యమైన గ్రహము లన్నియు రాత్రి తొలిజామున నగపడవు. కుంభరాశియందున్న శని సూర్యాస్తమానము కాగానే కొన్ని నిమిషములపాటు కనబడినను, తరువాత అస్తమించును. జనవరి ౮, ఫిబ్రవరి ౮ తేదీలు పున్నమతిథు లగును. జనవరి ౮ వ తేదీని గొప్ప చంద్రగ్రహణము రాత్రి పదిగంటలకుపట్టి ఒంటిగంటన్నరవరకు నుండును.

## ఉత్తరమున

చిన్న యెలుగుతోక చివరను ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకలో కశ్యప, మహేంద్రు లున్నారు. తోకమూలను అగ్నియు, అగ్నికెదురుగా మిత్రుడు నున్నారు. అగ్ని, మిత్ర నక్షత్రముల కెదురుగా ఈశాన్యక్షితిజమునకు వ్రాలినట్లున్నారు ధాత, విధాతలు. ఈచుక్కలకు ఉదయాస్తమానములు లేనేలేవు. ధ్రువుని కొంతచుట్టివచ్చుచు, ధ్రువక్షితికడ్డుగా వాయవ్యమునకు వ్రాలి శార్వశీపురూరవసుమండలము పాలివెల్లిలోనికి వ్యాపించియున్నది. ఈశాన్యమున సప్తఋషులలో క్రతు, పులహ, పులస్త్య, అత్రిఋషులు -ఋషిచతురస్రముమాత్రము ఉదయించినది. ఆచతురస్రమున కీవల లంబోదరముతో విఘ్నేశ్వరు డుదయమైనాడు. అతని వాహనమైన మూషకమును ఆప్రక్కనే ఉన్నది. ధ్రువక్షితికిని పాలవెల్లికిని మధ్య కల్పవృక్షమున్నది. ఈకనకనగసీమ, ఈ కల్పవృక్షమునీడనే అప్సరసలు చక్కని చుక్కలై మెఱయుచున్నారు. వాయవ్యక్షితిజమున శ్వా 1-శ్వా 2-అను కుఱుతులతో శ్వానసీమలు రెండును చూపబడియున్నవి.

## పడమట

కుంభరాశి అస్తమించినది. పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర నక్షత్రములతో పేద్వఘూశ్వము(The Square of Pegasus) పడమటకు వ్రాలియున్నది. మీనరాశిలో చేరిన 'మత్స్యద్వయం' రెండుచేపలలో ఒకటి పేద్వఘూశ్వముదిగువ కానవచ్చుచున్నది. ఆదిగువ ఇంద్రద్యుమ్నమహారాజు తనమిత్రులు - నాళీకజంఘ బకము, యుగంధరకమఠము, ప్రావారకర్ణఘూకము - వీరితో త్వరలో నస్తమింప సమకట్టియున్నాడు. ఇంద్రద్యుమ్నుని మిక్కిలి కారించిన మకరము 'రవిజొచ్చి' పోయినది. జలగ్రహపీడవదలి ఇంద్రద్యుమ్నుడు 'విష్ణురూపుడగుచు వెలుగుచు' మనకు పడమట, ఆనందము కూర్చుచున్నాడు. ఇత డస్తమించినవెనుక పడమట తేజోవంతములైన నక్షత్రములులేక ఆదిశ చిన్నవోయినట్లు కనబడును.

## దక్షిణమున

'దైపీమ్ నావామ్' అని ఋగ్వేదమున వర్ణింపబడిన నౌకామండలము దక్షిణక్షితిజముపై పొడచూపి మెఱయుచున్నది. ఈనౌకకు చుక్కాణికడనున్న గొప్ప నక్షత్రము అగస్త్యుడు. శ్రీమద్రామాయణమున వాల్మీకి "ఆశ్చర్యాణాం బహూనాంహి నిధిః పరమకోభవాన్" అని అగస్త్యుని చక్కగా వర్ణించియున్నాడు. మన సూర్యునికంటె నలువదియేడువేలరెట్లు తేజోధికుడగు నీ అగస్త్యుడు ఆశ్చర్యములకెల్ల నిధి యని చెప్పుట పరమసత్యముకదా?

అగస్త్యునికి పడమటదెసను అద్రిక, వల, శంతనుడు వరుసగా కానవగును. రిగెల్ చుక్కసమీపమున పుట్టినట్లున్న యమునానది, ఎన్నోవంకలు తిరుగుచు, ఉపరిచరవసుమీదుగా శంతనుకడ దృష్టి కగోచరమగుచున్నది.

## తూర్పున

మఘనక్షత్రము ఉదయించినది. పల్లకీబొంగు, లేక కొడవలివంటి వంపుకలిగి యగపడు చుక్కలన్నిటిలో (Regulus) మఘ మిక్కిలి తేజోవంతమైనది. మఘకు దిగువ 'ఓ' అక్షరమువంటి వంకరతో ఆశ్లేష చుక్కలును చక్కగా ఉదయించినవి. వాటి కావల కర్కాటకరాశి మెఱయుచున్నది. అందులో మధ్యను పొట్లపూవువంటి రిక్కమబ్బున్నది. అదియొక వెండి కంచమనియు, దానికి రెండుప్రక్కలను రెండు గాడిదెలు గడ్డి తినుచున్నవనియు పాశ్చాత్యగాథ లున్నవి.

## మధ్యను

పాలవెల్లి యిప్పుడగపడు ఖగోళమును రెండుభాగములు చేయుచున్నదని చెప్పవచ్చును. అందు ఈశాన్య భాగము చిన్నది; నైరృతిభాగము పెద్దది. దిక్చక్రము నంటియున్న చుక్కలను చూచితిమి. ఇక పాలవెల్లి కిరుప్రక్కలనుగల ముఖ్యనక్షత్రములను పరిశీలింతము. మీనరాశికిని, యమునకును మధ్య శింశుమారపుచుక్కలు మిణుకుమిణుకు మనుచున్నవి. ఇవి పాలవెల్లికి దూరముగా నున్నవి. పాలవెల్లికి తూర్పు దెస ధ్రువక్షితి దిసవ కల్పవృక్షమును గమనించియున్నాము. ఆవృక్షమున కెగువ సారథిమండలము కలదు. అజశాబకములదిగువ (Capella) బ్రహ్మహృదయనక్షత్రము ధవళకాంతులతో మెఱసిపోవుచున్నది. పుష్యమికి, పాలవెల్లికి మధ్య మహామీనమువలె పునర్వసుచుక్కలు చక్కగా మెఱయుచున్నవి. పూర్వశ్వాన, శ్వానములమధ్య పాలసముద్రము మథింపబడుచున్నట్లును, దానిని మథించునపుడు తేలు నురుసు, బిందు పాలబొట్లువలె చిన్నచిన్నచుక్కలు ఆచుట్టును చెదరినట్లును చక్కని దృశ్యము ఆప్రాంతములందు గోచరించుచున్నది. పాలవెల్లికి పడమటగా Orion యోధుడు — వృత్రాసురుడు జగంబులమింగ నప్పళించుచున్నట్లు వెలుగుచు గగనమధ్యరేఖను సమీపించుచున్నాడు. వాని పటకావలె గొల్లకావిడి చుక్కలు మెఱయుచున్నవి.

పునర్వసుచుక్కలకును, ఆర్ద్రకును మధ్య చుక్కలు-మిథునరాశిలోని చుక్కలు కశ్యప, పరాశర, మను నక్షత్రములని కేత్కారుపండితులు జ్యోతిర్గణితపటమున వ్రాసియున్నారు.

Orion యోధుని కుడిబాహువు ఆర్ద్రానక్షత్రము; ఎడమబాహువు (Bellatrix) పరివృత్త; ఆపైని మాయమృగశిరస్సు చుక్కలుమూడు. వీటికి పడమట ఎద్దుకన్నువలె మెఱయు రోహిణి కలదు. ఆప్రక్కనే పిల్లలకోడిచుక్కలు, శ్రీనాథుడు వర్ణించినట్లు "పూచిన కోలవిపూపొదరిల్లు" లాగున మెఱయుచున్నవి. కృత్తిక నుండి ఉత్తరముగా భృగుపరశుమండలము వ్యాపించియున్నది. ఆదిగువ గ్రుడ్డు మిటకరించుకొనుచు (Algol-the blinking demon) పులోమరక్కసుడున్నాడు.

కృత్తికకు శింశుమారమునకు మధ్య భరణియున్నది. భరణి కావల అశ్వినినక్షత్రములున్నవి. అశ్వినికి పడమటగా రేవతిచుక్కలు చేపవలె మిణుకుమిణుకు మనుచున్నవి. మీనరాశిలోని రెండవచేప ఈ రేవతి; ఉత్తరాభాద్రకు అశ్వినికి నడుమనున్నది. రెండుచేపలకును పరస్పరము సంబంధము కలుపుదారము- నాడా- అనదగునట్లు కొన్నిచుక్కలు ఆరెంటిమధ్య చిత్రముగా నిల్చియున్నవి. (They are called the ribban or thread connecting the two fishes of the Pisces)

### భృగువు-పులోమ-పులోముడు- చ్యవనుడు- సుకన్య-అశ్వినులు-ఇంద్రుడు

వీరినిగూర్చి పురాణగాథలు-వేదగాథలు పెక్కు గలవు. మహాభారతారంభమున భృగువంశకీర్తనమున్నది.

సీ॥ "భృగుడనువిప్రుండు మనువంబులోమయన్
దాని గర్భిణి దనధర్మపత్ని
నగ్నిహోత్రమునకు నన్నులు విహరింపు
మని పంచి యభిషేచనార్థ మరుగ
నంత బులోము డనఁ వింతరక్కసు డగ్ని
హోత్రగృహంబున కొయ్యవచ్చి
యత్తన్వి జూచి యున్మత్తుడై యెవ్వరి
సతి యిది చెప్పుమా జాతవేద
యనగ నగ్నిదేవు డనృతంబునకు విప్ర
శాపమునకు వెఱచి శాపభయము
దీర్చుకొనగబోలు........."

అని విచారించి యప్పరమపతివ్రత భృగుపత్ని యని కలరూపు జెప్పిన నప్పులోముండు నిది నాకు దొల్లి వరింపంబడినభార్య, పదంపడి భృగుండు పెండ్లియయ్యె నని వరాహరూపంబున నాసాధ్వి నతిసాధ్వసచిత్త నెత్తికొని పర్వంబర్వ దద్గర్భంబుననున్న యర్భకుండు కరం బలిగి కుక్షిచ్యుతుండై చ్యవనుండునా బరగె..."
[ఆది. ౧. ౧౨౯, ౧౩౦, ౧౩౧]

ఈగాథలను చక్కగా సూచించు నక్షత్రపటము ఈప్రక్కనే కలదు. ఉత్తరాభాద్రానక్షత్రము గార్హపత్యాగ్ని [చూ. ఐతరేయబ్రాహ్మణము III 3-3౬.

అహిర్బుధ్న్యాయదగ్ని ర్గార్హపత్యో౽గ్నినా...]-[ప్రో యజుర్వేదము - నక్షత్రఇష్టి.] ఈగార్హపత్యాగ్నులు ష్ఠపదానక్షత్రం అహిర్బుధ్న్యః దేవతా అని కృష్ణ విహారింపుమని భృగుడు తనభార్య పులోమను పంచి



స్నానార్థమరిగెను. అంతలో పులోముడను వింతరక్కసు డగ్నిహోత్రగృహమునకువచ్చి ఉన్మత్తుడై "ఇది ఎవనిభార్య?" అని ప్రశ్నించెను. అగ్నిహోత్రు డూరకుండనేరక "భృగుపత్ని; పులోమ" అనిచెప్పెను. "సరే నేను పులోముడను; ఇది పులోమ. మొదట నాభార్యయే" అని ఆమెను బలాత్కారముగానెత్తికొని పరువులుబెట్టెను. గర్భచ్యుతిచే చ్యవను డుదయించి రాక్షసుని తీవ్రముగా చూచి భస్మముచేసివైచెను. ఇచట వరాహరూపదృశ్యము కలదని అనేకదేశముల ఖగోళ దృశ్యపటములలో కలదు.

## రెండవ గాథ

చ్యవనుడు తపముచేయుచుండగా సంయాతి యను రాజు సుకన్యయను కూతును, భార్యలను తోడ్కొని, వనమునకు సేనలతో విహారింపనరిగెను. ఒక పుట్టలో మిడుగురుపురుగులోయనునట్లు మెఱయుచున్న చ్యవనునినేత్రములు చూచి పురుగులనుకొని పాపమాబాలిక పుట్టత్రవ్వి చూచెను. చ్యవనుడు కోపించి సేనలకు బాధకలుగచేసి, తప్పు తెలిపి సుకన్యను భార్యగా బడసెను. సుకన్య పరమపతివ్రతయై, వృద్ధచ్యవనునే దైవముగానెంచి సేవించుకొనుచుండెను. అశ్వినులామెం జేరవచ్చి, "వృద్ధు భార్గవుని వరించి నీజవ్వనంబెల్ల వృథచేసితి వింకనైనను నీ వయోరూపంబులకుం దగినవరు నేము దెచ్చెదము వాని వరింపు"మనిరి. సుకన్య సహింపక భర్తకు వార లాడిన పలుకులెల్ల చెప్పెను. చ్యవనుండు దాని ప్రాతివ్రత్యమునకు సంతసిల్లి వారలపలుకుల కొడంబడుమని పంచిన నది పతిచేత ననుజ్ఞాతయై చని నాపతి నవయౌవనపరుం గావింపుండనిన నశ్వినులొక్కకొలను చొచ్చిరి. చ్యవనుండును వారితోడ సరఃప్రవేశంబుచేసె; నిట్లు మువ్వురు నవయౌవనులై సుకన్యకడకు వచ్చి నిలిచి మాయందు నీవలయువాని వరింపుమనిన నది తనపతియైన చ్యవనుని వరించె. చ్యవను డతిప్రీతుండై అశ్వినుల సోమపీథుల చేసెను. [అరణ్య 3-౧౭౬ to ౧౨౭.]

## 3-వ గాథ(భారత అరణ్య 3-౧౨౫ - ౧౨౭)

దేవవైద్యులైన అశ్వినులు సోమార్హులు గారని ఇంద్రుడు చెప్పినను వినక చ్యవను డశ్వినులకు సోమమిచ్చెను. ఇంద్రుడు కోపించి వజ్రమెత్తి చంపవచ్చెను. చ్యవనుడు తన తపోమాహాత్మ్యముచేత ఇంద్రునిభుజముల స్తంభింపజేసెను. అంతటితో నాగక చ్యవనుడు కోపించి, వేల్చి మదుడను రాక్షసుని పుట్టించెను. వాడు "దశ సహస్రయోజనాయామంబులైన బాహుదండంబులును, శతశతయోజనాయామంబులైన, చతుర్దంష్ట్రంబులును, దశయోజనాయామంబులైన దశనంబులును, శశిరవిమండల సదృశంబులైన నయనంబులును, దిగ్వ్యాపనభోభాగ సంపూర్ణంబైన శరీరంబును గలిగి భూమియందొక్క హనువును, దివంబున నొక్కహనువునుగా వదనగహ్వరంబుదెఱచి, జగజ్జనసంత్రాసనవ్యగ్ర సంచలనంబైన దీర్ఘజిహ్వానదరోష్ఠపుటంబునాకుచు నత్యుగ్రనాదంబున దిక్కులు ప్రయ్యనార్చుచు ఇంద్రుని పైకి వచ్చెను. ఇంద్రుడు వానింజూచి వెఱచి భుజములు స్తంభించుటచే నేమియుం జేయనేరక, చ్యవనునికి నమస్కరించి అశ్వినులు సోమార్హులగుదురని ఒప్పుకొని క్షమింపవేడెను. చ్యవనుని కోపము శమించెను. ఇంద్రుని గర్వమణిగెను. మదరాక్షసుడు మద్య స్త్రీ మృగయాక్షముల నాశ్రయించె.

ఈకథ మరొకరూపమున నవతరించిన వృత్రుని జన్మకథనమే యని వేరుగ చెప్పనక్కరలేదు.

ఇంద్రుని మదమణిగించిన చ్యవనుని కన్నతల్లి ఇంద్రమదహర్త మాత యనుటయు, కాలక్రమమున అంత్యాక్షరములుపోగా ఇంద్రమదగా వ్యవహరింపబడుటయు సహజము. పాశ్చాత్య గాథలలో ఈమె **Andromeda** రూపమున వెలసినది. చ్యవనుడును, అశ్వినులును సమరూపప్రతిభుజములుగా నుండుట గమనింపదగును. చ్యవనుని **Triangulum** అని పాశ్చాత్య సిద్ధాంతులు వ్యవహరింతురు.

చ్యవనునిప్రక్కనే సుకన్య కలదు.

ఈ వివరములన్నియు ప్రక్కపటములో చక్కగా చూడనగును. పాలసముద్రమున రాజహంస ప్రక్కనే గల కల్పవృక్షశాఖలును, ఆతరునీడల విహరించు నప్సరసలును ఈ నక్షత్రముల సమీపమున నుండుటచేత వాటినిగూడ ఈ పటమున చూపితిమి.

౧

ఢ్ఘాం ఢుకారా మంటూ నగారా మోత వినపడేటప్పటికి కృష్ణరాయడు కొలువు చాలించి అభ్యంతరమందిరం లోకి వేంచేశాడు. కట్టతెగిన చెరువు నీటిలాగ సభ్యులు అన్ని ద్వారాలనుంచీ బయటికి వచ్చి అక్కడక్కడ నిలిచి కొందరూ, నింపాదిగా నడుస్తూ కొందరూ కొంచెంవడిగా వెళ్ళిపోతూనే తారసపడినవారిని పలకరిస్తూనూ పలకరించినవారికి జవాబు చెబుతూనూ కొందరూ, ఎవరికోసమో కనిపెట్టుకుని కొందరూ భువనవిజయం ఆవరణఅంతా నిండివున్నారు. దూరాన పొగడచెట్టుక్రింద, శిష్యుడితో మాట్లాడుతూ నంది తిమ్మకవి నుంచునివున్నాడు.

శిష్యుడు—ఖండిత నాయికా, దక్షిణ నాయకుడూ, ఆపైని నారదమహర్షి - ఎంత కల్పనకేనా అవకాశం వుందనీ, తమరు దాన్ని పూర్తిగానే వినియోగ పరుచుకుంటారనీ-(అర్థోక్తి)

తిమ్మకవి—ఎవరి మాట అది ?

శిష్యుడు—ధూర్జటికవిగారిదండి దాని మీాద పెద్దయ్యంగా రందుకున్నారండి.

తిమ్మకవి—(ఆత్రంగా)వారేమన్నారూ?

శిష్యుడు — "తిమ్మకవిగారి సత్యభామ ఆంధ్రవాఙ్మయాని కొక విశిష్టత కూరుస్తుం దనీ—(అర్థోక్తి)

తిమ్మకవి—(చెయ్యి జాడిస్తూ) సెబాస్! మహామంచిమాట విన్నాను..........రచనలో కొత్తదారి తొక్కినవారు వారు. ఈ విషయం గ్రహించడానికి వారికే అర్హత వుంది.

శిష్యుడు —-తరవాత, వారు, నన్ను చూసి "మంచి గ్రామం యెక్కడుందో మీా గురువుగా రిప్పణ్ణుంచీ దర్యాప్తు చేసుకోవచ్చునోయీా" అన్నారండి.

తిమ్మకవి—బాగుంది.

శిష్యుడు—"తిమ్మకవిగారి పోకడలు బాగా గమనిస్తూ వుండం"డని తమ శిష్యులకు కూడా సెల విచ్చారండి వారు.

తిమ్మకవి—-(ఆనందంతో తలవూపుతూ) అలాగేం ?.........ఏమన్నా అనే వారే వారు. పారిజాతాపహరణం యిక ఆచంద్ర తారార్కంగా వుండిపోతుంది. ఏమీా సందేహం లేదు.

శిష్యుడు—కాని—(అర్థోక్తి)

తిమ్మకవి—-(ఉలిక్కిపడి) కానీ అంటే?

శిష్యుడు—అంతలో మహామంత్రి తిమ్మరుసయ్యంగారు కలుసుకున్నారండి,

తిమ్మకవి—వారితోకూడా యీ ప్రస్తావన జరిగిందా?

శిష్యుడు—జరిగిందండి. పెద్దయ్యంగారే నడిపారు.

తిమ్మకవి—ఎలాగా?

శిష్యుడు—"అంతఃపురంలో తిరుమల దేవమ్మగారి కెలాంటి పదవి వుందో, కవి మండలిలో తిమ్మకవిగారి కలాంటి-(అర్ధోక్తి)

తిమ్మకవి—(చిటికవేస్తూ) అదిగదీ మాట. కోట్లు విలవఅయినమాట అది. నేను తిరుమల దేవమ్మగారితో వచ్చిన అరణపుకవిని కనక నున్నూ, వొక కావ్యం అంకితంకూడా చేస్తున్నాను కాబట్టిన్నీ ప్రభువువారు నాకొక అగ్రహారం యెలాగా దయచేస్తారు. అయితే పెద్దయ్యంగారిమాట నా కంతకంటే పెద్ద సత్కారం అనిపించుకుంటుంది.

శిష్యుడు—కాని మహామంత్రులవారు-(అర్ధోక్తి)

తిమ్మకవి—(ఆదుర్దాగా) వారేం సెల విచ్చారూ?

శిష్యుడు—సావధానంగా నుంచుని, చిరునవ్వు నవ్వుతూ—(అర్ధోక్తి)

తిమ్మకవి—వారి మెప్పుపొందడం మాటల్లోది కాదు. అసలు, ఓపట్టాన, వారు పైకి తేలనే తేలరు.

శిష్యుడు—ఇప్పుడలాగే జరిగిందండి.

తిమ్మకవి—ఏం జరిగింది?

శిష్యుడు—మహాకవులరచనలలోవుండే మెళుకువలు చక్కగా కనిపెట్టే మహామంత్రులవారు అలా యెందు కన్నారోగాని—(అర్ధోక్తి)

తిమ్మకవి—(కంగారుఅదిమిపెట్టుకుంటూ) ఏమన్నారురా?

శిష్యుడు—"తిమ్మకవిగారు చాలాగొప్పవారే. నిజంగా, వారు వశ్యవాక్కులే. కాని-(అర్ధోక్తి)

తిమ్మకవి—(ముంగోపంతో) ఏం కానీ? నలిపినలిపి చంపుతావేమిట్రా?

శిష్యుడు—"కాని నేనిప్పుడొక రాచ కార్యంలోపడి కొట్టుకుంటున్నాను. ఎన్ని విధాల బుర్రచించుకున్నా దారీ తెన్నూ కన పడ్డంలేదు. ఈస్థితిలో భాషావిషయం; అందులోనూ శృంగారకవిత్వం — అసలు కవిత్వం అంటేనే నాతల కెక్కడు లెండి" అన్నారండి వారు.

తిమ్మకవి—(కొంచెం నిరుత్సాహపడి) ఏమిటీ? మహామంత్రులవారి మాటలాయివి?

శిష్యుడు—అవునండి. ఒక్క అక్షరమే నా విడిచిపెట్టలేదండి నేను. పెంపకంకూడా చెయ్యలేదండి.

తిమ్మకవి—(ఆలోచిస్తూ) ఈ మాటల కర్థ మేమిటీ? ఎన్ని తొందరపను లున్నా వారి బుద్ధి ఆరాటం యెరగదే? దానికి చల




మహాత్ముని శిలావిగ్రహము

మదరాసులో పైక్రాఫ్టువీథియందు "గాంధిశిఖరము"న కాంగ్రెసు సువర్ణోత్సవము నాడు ప్రతిష్ఠింపడినది. యం. డి. కన్నప్పగారు దీనిని చెక్కిరి (P. P. B.)



అమెరికా మొదటి కాంగ్రెసు మహాసభనుండి స్వాతంత్ర్యమును ప్రకటించిన స్వాతంత్ర్యమందిరము



బొంబాయిలో 1885 సం॥ మున ప్రథమ కాంగ్రెసుమహాసభ సమావేశమైన గోకుల్‌దాస్ కజ్‌పాల్ భవనము

నం అంటూ లేదే? పైగా యిది భాషావిషయమా? అసలు, కవిత్వమే వారి తల కెక్కదూ?

శిష్యుడు—ఇది విని పెద్దయ్యంగారు కూడా నిర్విణ్ణు లయిపోయారండి.

తిమ్మకవి—అదలా వుండనియ్యి. మహామంత్రులవారికి వొక రాచకార్యంలో దారి కనపడ్డం లేదూ? అలాంటి రాచకార్యం వొకటి నడిచే సమయంలో ప్రభువువారు అంత నిశ్చింతగా కవితావినోదా లెలా సాగిస్తున్నారూ?

శిష్యుడు—కొంపలు తీసే చిక్కులు వచ్చేదాకా ప్రభువులకు వినోదాలేకాదండీ?

శిష్యుడు—అలా కాదు. (కింద్దికిచూస్తూ) కృష్ణదేవరాయలవా రంత ప్రమత్తు లెప్పుడూ కారు.........(కళ్లు మూసుకుని) మహామంత్రికి దారిదొరకడం లేదూ? ప్రభువు కవితా వినోదాలతో కాలం వెళ్లబుచ్చుతున్నారా? ఆపైని నాది శృంగారకవిత్వమా? (నుదుట చెయ్యి ఆనుకుని) ఇకేదో చాలా పెద్దదెబ్బ .........మర్మస్పృక్కే. ఏదో విఘాతం కనిపెట్టుకుని వున్నట్టు కనపడుతోంది.

శిష్యుడు—జాప్యం చెయ్యక ప్రబంధం చక్కగా వినిపించెయ్యండి మీరు. ఆ రాచకార్యం యేదో విషమించకుండానే అగ్రహారం పుచ్చుకుంటే—(అర్ధోక్తి)

తిమ్మకవి—(విసుక్కుంటూ) మాట్లాడకురా.........ఇక నువ్వు యింటికి వెళ్లిపో. పుస్తకం యింటో యిచ్చి జాగ్రత్త చెయ్యమను.........వెళ్లు.

శిష్యుడు—చిత్తం (నుంచునేవుంటాడు).

తిమ్మకవి—వెళ్లుమరి. పెత్తనాలకు పోక తిన్నగా యింటికే వెళ్లు.

శిష్యుడు—చిత్తం. (గురువుకేసి నిదానంగా చూస్తూ అడుగులు లెక్కపెట్టుకుంటూ వున్నట్టు నడిచి వెళ్లిపోతాడు).

తిమ్మకవి—(నాలుగడుగులు ముందుకి వేసి) మహామంత్రి మాటలకు ఏమిటి అర్థం?......నాది శృంగార కవిత్వమా?... నాది మట్టుకే శృంగారకవిత్వమా? ఇందులో పెద్దయ్యంగారు మాత్రం యేం తక్కువ తిన్నారూ?......... దేశం అంతా నిష్కంటకంగా వున్న స్థితిలో-ప్రజ, అన్నవస్త్రాలకు లోటెరక్కుండా భాగ్యభోగ్యాలతో తుల తూగుతూవున్నప్పుడు శృంగారకవిత్వం కాక మరేం కవిత్వం వస్తుందీ? (ఇంకా కొంచెం ముందుకి నడిచి) ఇందులో యేదో పెద్దదెబ్బే వుంది.........ఏమీ సందేహం లేదు......... అమ్మాయినిచూసేసి, యింటికివెళ్లి, యిదేదో కనిపెట్టాలి.........ఇన్నాళ్లకి నేను ప్రబంధం చెయ్యడమూ, ప్రభువు అత్యుల్లాసంతో వింటూ వుండడమూ, పైగా పెద్దయ్యంగారి వంటి మహామహులు దాన్ని మెచ్చుకుంటూ వుండడమూ-ఇలాంటి సందర్భంలో యీచిరు మబ్బేమిటీ? (ఆలోచిస్తూ వెళ్లిపోతాడు.)

## ౨

తిరుమలదేవి నగరి ఆవరణ. ద్వారం యొక పదడుగుల్లో వుందనగా పెద్ద అశోక వృక్షం. దానికింద వొకఅరుగు. అరుగుమీంద తిమ్మకవి కూచునీ,కొంచెం యెడంగా తిరుమల దేవి దాది మంగ నుంచునీ వుంటారు. చీకటి పడుతూ పడుతూ వున్నసమయం. పక్షుల కిలకిలారావాలు కొంచెం తగ్గాయి. చెట్టు కొమ్మల చాటునుంచీ, తీగల చాటునుంచీ నగరిదీపాలు మిణుకూ మిణుకూ క న ప డు తున్నాయి. మధ్యమధ్య పరిచారికలమాటలు కూడా కొంచెం వినపడుతున్నాయి.

మంగ—అసలు, ఖండితనాయిక అంటే నే పురుషులు చెవికోసుకుంటారు. అందులో ఆనాయిక సత్యభామా దేవీ, నాయకుడు శ్రీ కృష్ణుడూనూ. ఆపైని, రచన తమదీ. ఇక ప్రభువు పరమానందపడుతూ వుండడంలో ఆశ్చర్యం యేమిటి బాబయ్యా?

తిమ్మకవి—అది నిజమే. నాకవిత్వం విని ప్రభువూ, ప్రభువుకంటే సభ్యులూ చాలా ఆనందిస్తున్నారు. అది చూసుకొని నేను పర వశుణ్ణే అయిపోతున్నాను; కాని రెండుగడి యల కిందట నావుత్సాహం అంతా పూర్వ పక్షం అయిపోయింది.

మంగ—(ఏమీ యెరగనట్టు) అదేం బాబయ్యా?

తిమ్మకవి—దానితో నాతల దిమ్మెక్కి పోయింది. రేపు, రాజసభలో, నేను నాకవి త్వం వినిపించగలుగుతాననీ, వినిపించగలి గినా, ప్రభువుని ఆనందపెట్టగలననీ నా కెంత మాత్రమూ ధైర్యం కలగడం లేదు.

మంగ—ఏం బాబయ్యా? ఏం వచ్చిందీ యింతట్లోనూ?

తిమ్మకవి— రాచకార్యాల్లో యేవో చిక్కులు వచ్చాయిట. మహామంత్రి నాకవి త్వం వింటూ వున్నట్టు లేదు. ఊరికే సభలో కూచుంటున్నారు; గాని వారి కీధ్యానమే వున్నట్టు కనపడ్డం లేదు.

మంగ—మహాప్రభువు నిరుత్సాహంగా వున్నట్టు గాని, యేదో ఆందోళనపడుతూ వున్నట్టు గాని కనపడదే?

తిమ్మకవి—అది కూడా నామనస్సుని గజిబిజి పెడుతోంది. మహామంత్రిని కంగారు పెట్టే రాచకార్యాలు మహాప్రభువుని మా త్రం చీకాకుపరచవూ?

మంగ—తమరు సెలవిచ్చేది నాకేమీ బోధపడడమే లేదు బాబయ్యా?......మన ప్రభువు, రాజ్యం మంత్రిఅధీనంచేసి విలాసా లలో మునిగిపోయేవారు కారే?

తిమ్మకవి—అంచేతే నాకు తూస్సా పడమరా యేమీ తెలవకుండా వుంది...... అదలా వుండగా - ఇక యిక్కడిసంగతి. సభలో నేను నా కవిత్వం వినిపిస్తూ వుండగా తెరవెనక వుండి అమ్మాయి కూడా ఆలకిస్తు న్నారు కదా. మహాప్రభువు చేసే ప్రశంసలు కూడా వింటూనే వున్నారు కదా. సభలో

నుంచివచ్చి నగరిలో రెండుగడియలుండినా—వొకనా డేనా ఆ విషయమే మాట్లాడరేం?

మంగ—(మొగం పక్కకి తిప్పుకుని) అమ్మాయికి తమతో లోకాభిరామాయణం చెప్పుకోడంతోటే సరిపోతోంది, యిక కవిత్వాన్ని గురించి మాట్లాడడానికి నవకాశం యేది బాబయ్యా?

తిమ్మకవి—ఇదివర కెప్పుడూ అమ్మాయి యింత మందకొడిగా వుండడం నేను చూడలేదు. అంతఃపురంలో అమ్మాయి గారంత చురుకైన మనిషి మరి లేరని కూడా ప్రసిద్ధి. ఏదేనా వొక పద్యం చదివితే అమ్మాయి, దాన్ననేకవిధాల సమన్వయించి భావం విస్తరిస్తారే? అలాంటి పండితురాలు ఇప్పుడు నాతో యేదో విధిలేక మాట్లాడుతూ వున్నట్టూ, నన్ను తొరగా పంపెయ్యడానికి మాటలు తెమిల్చేస్తూ వున్నట్టూ కనపడతారేం?

(మంగ, మొగం పక్కకి తిప్పుకొని పెద్ద నిట్టూర్పు విడుస్తుంది. దాంతో తిమ్మకవికి ఆరాటం మరింత పెరిగిపోతుంది.)

తిమ్మకవి—మాట్లాడ వేమే మంగా? నిదానించి చూడగా నువ్వుకూడా నిరుత్సాహంగానే వున్నట్టు కనబడుతున్నావేమే?

మంగ—(మొగం వంచుకొని) అమ్మాయిమనస్సేమీ బాగాలేదు బాబయ్యా?

తిమ్మకవి—(ఆదుర్దాగా) ఏం? ఏం వచ్చిందీ..........ఎక్కణ్ణుంచి అప్రియమైన వార్త ఏదీ రాలేదుకదా? మనవ్రాళ్లో అంతా బాగా వున్నారా?

మంగ—కారణం యిక్కడే ఏర్పడింది బాబయ్యా! మరెక్కణ్ణుంచీ పూడిపడలేదు.

తిమ్మకవి—ఏమిటదీ? ఎలా ఏర్పడిందీ?

మంగ—(మొగం పక్కకి తిప్పుకొని నిట్టూరుస్తుంది.)

తిమ్మకవి—నువ్వెందుకు జాప్యం చేస్తున్నావో తెలవడంలేదు. నువ్వు కాలయాపన చేసినకొద్దీ నామనస్సు మరింత చెదిరిపోతోంది.

మంగ—నామనస్సు బాగా లేక నేను చెప్పలేకపోతున్నాను. తమరు కూడా నాలాగే అయిపోతే యింకెలాగా? అమ్మాయి విచారం పోగొట్టడానికి నేను పడ్డ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీ రయిపోయింది. ఇక తమర్ని నమ్ముకుని వున్నాను నేను. తమరు వుంచే మనస్సు పాడుచేసుకుంటే—(అర్ధోక్తి)

తిమ్మకవి—నన్ను నమ్ముకుని వున్నావా?..............అయితే యిప్పటిదాకా చెప్పావు కాదేం?

మంగ—గడియకిందటే తేలిపోయింది నావల్ల యింకేమీ లాభం లేదని. రేపు పొద్దున్న తమ యింటికి వచ్చి అంతా మనవి చేసుకోవా లని యిప్పుడిప్పుడే నిశ్చయం చేసుకున్నాను.

తిమ్మకవి — అయితే, ఏదీ, త్వరగా చెప్పూ.

మంగ—ప్రభువు వారంరోజులనుంచి నగరికి రావడం లేదు. అమ్మాయి ఏం కానుకలు పంపినా స్వీకరించడం లేదు. నేనేం మనవి చేసుకున్నా వినిపించుకోవడం లేదు.

తిమ్మకవి — అబ్బా!..........ఇంత గొడవ వుందా?..........అయితే, దీనికి కారణం ?

మంగ—అది కారణం అనిపించుకోడానికే చాలదు; కాని అదేం పుణ్యమోగాని ప్రభువు, దానికేమిటేమిటో చిలువలూ, పలవలూ పెంచుకుని మనస్సు విరిచేసుకుని—(అర్ధోక్తి)

తిమ్మకవి—అసలేం జరిగిందీ?.........నువ్వు నానుస్తూ చెబితే నేను తాళలేను.

మంగ—మొన్నటి శుక్రవారం, రాజమహేంద్రవరంనుంచి వచ్చిన వేశ్య వీణ వాయించింది కాదూ ?

తిమ్మకవి—అవునుట.

మంగ—ప్రభువు పరవశులైపోయారు.

తిమ్మకవి—విన్నాను.

మంగ—వారిని తోడుకు వెళ్లడానికి వెళ్లి నేను కూడా బొమ్మ నయిపోయాను.

తిమ్మకవి—ఊహూ.

మంగ—ఈ కారణంవల్ల ప్రభువు నగరికి వచ్చాటప్పటికి అర్ధరాత్రి దాటిపోయింది.

తిమ్మకవి—సరే.

మంగ—ప్రభువు రాక అమ్మాయి యెరగరు.

తిమ్మకవి—(ఆలోచిస్తూ) అలా జరిగిందా ?

మంగ—అంతవరకూ బాగానే జరిగింది. ప్రుట్టి మునక తరవాతే సంభవించింది.

తిమ్మకవి—వివరంగా చెప్పు.

మంగ—భర్త వచ్చేదాకా నిద్ర ఆపుకోలేకపోతే స్త్రీలు కాళ్లదిక్కున శిరస్సు పెట్టుకొని పడుకోవడం మామూలే కాదూ?

తిమ్మకవి—అమ్మాయి అలాగే చేశారన్నమాట.

మంగ—అవును బాబయ్యా! అయితే: నేను అమ్మాయిని లేపుదామని బయలుదేరాను; గాని వద్దని ప్రభువు నన్ను వారించారు.

తిమ్మకవి—ప్రత్యుత్థానం—(అర్ధోక్తి)

మంగ—అదేమీ కాదు బాబయ్యా! అసలు కారణం ముందే వుంది.

తిమ్మకవి—నేను వినకూడనిదా?

మంగ—అలాంటిదీ కాదూ... అసలది కారణమే అనిపించుకోదూ.

తిమ్మకవి—నువ్వు డొంక తిరుగుడుగా (అర్ధోక్తి)

మంగ—చిత్తగించండి...ప్రభువు సెలవు పొంది నేను ఇవతలికి వచ్చేశాను.

తిమ్మకవి—ఊహూ.

మంగ—ప్రభు వేనా అమ్మాయిని లేప కుండా వొక పక్కగా శయనించారు.

తిమ్మకవి—బోధపడలేదు.

మంగ—ప్రభువు యథాపూర్వంగానే పడుకున్నారు.

తిమ్మకవి—అంటే అమ్మాయి కాళ్లు ప్రభువుశిరస్సుకేసీ, ప్రభువుకాళ్లు అమ్మాయి శిరస్సుకేసీ-(అర్ధోక్తి)

మంగ—అవ్వనండి.

తిమ్మకవి—రెండోది ధర్మంగానేవుంది. అమ్మాయి యెప్పుడూ ప్రభువు పాదాలు కొలుచుకుంటూనే వున్నారు.

మంగ—ఆవేళ అలా వచ్చింది కాని ప్రభువు మాత్రం అమ్మాయి పాదాలు-(సిగ్గుతో తల వంచుకుంటుంది.)

తిమ్మకవి—అది సరే లే.

మంగ—తాము మెళుకువగావున్నారు కనక ప్రభువు పుస్తకంలాగే పడుకున్నారు; కాని నిద్రలో పక్కకి వొత్తిగిల్లడంలో అమ్మాయి కాళ్లు ప్రభువు శిరస్సుకి—(అర్ధోక్తి)

తిమ్మకవి—తగిలాయా?

మంగ—తగిలాయంటే పూరిక్కే స్పర్శ మాత్రమే. తామరతూళ్లకంటె మెత్తనిపాదాలు—(అర్ధోక్తి)

తిమ్మకవి—ఇంత మాత్రానికే ఆగ్రహమా?

మంగ—ఆగ్రహం అంటే యిక యింతా అంతానా? ప్రభువు అమ్మాయి నగరి కేసి చూడడం కూడా మానుకున్నారు.

తిమ్మకవి—(కిందికి చూస్తూ ఆలోచనలో పడతాడు.)

మంగ—ఇంతకీ: స్పర్శవల్ల వెంటనే మెళుకువ రాగా, జరిగింది స్ఫురణకి రాగా, అమ్మాయి, వెంటనే ప్రభువు పాదాలు పట్టుకుని బతిమాలుకున్నారు. ఎంతో పశ్చాత్తాప పడ్డారు; కాని ప్రభువు వినిపించుకోలేదు. ఇక నుంచో లేదు కూడానూ

తిమ్మకవి—(చకితుడై) ఏమిటీ?

మంగ—ఈక్షణందాకా మరి నగరికి రాలేదు. అమ్మాయి ప్రార్థనాపత్రాలు పంపారు. నేను కాళ్లా వేళ్లా పడ్డాను. ప్రభువు వొక్కటే పట్టు—(అర్ధోక్తి)

తిమ్మకవి—పెద్ద గొడవే......అయితే నాకు ముందే యెందుకు చెప్పావు కాదూ?

మంగ—ఇంత ముదురుతుం దని యెవరికి తెలుసును బాబయ్యా?

తిమ్మకవి—(కిందికి చూస్తూ, నిట్టూర్పులు విడుస్తూ ఆలోచన ప్రారంభిస్తాడు).

మంగ—విచారంతోపాటు వుడుకుమోతుతనం ముప్పిరిగొనగా అమ్మాయికి—(అర్ధోక్తి)

తిమ్మకవి—(లేచి కొంచెం ఆవేగంతో) నాబిడ్డకు తిరస్కారమూ, నాకు సత్కారమూనా?

మంగ—అమ్మాయికి నిద్ర లేదు, హారం లేదు. రెండు గడియలకిందట కసిన్ని పాలు తాగించడం బ్రహ్మాండంఅయిపోయింది నాకు. రాత్రి యింకోమాటు తాగించగలనో లేదో (అర్ధోక్తి)

తిమ్మకవి—(కిందికి చూస్తూ, తల వంకిస్తూ) అదలా జరిగిందా?.........ఇదిలా జరుగుతోందా?.........నీవల్ల ఏమీ కా లేదూ?.........నే నిదేమీ యెరక్కుండా కవిత్వంలో పడి కొట్టుకుంటున్నానా? పైగా శృంగారకవిత్వం—(ఉలిక్కిపడి) బోధపడుతోంది.........బోధపడే పోయింది........ ఎంత దెబ్బ కొట్టారూ మహామంత్రీ? (జలదరించుకొని) బల్లెంలాగ గుచ్చుకుంటోంది ఆ మాట. (గుండెలమీద చెయ్యి పెట్టుకుని) హృదయం చిల్లులు పడిపోతోంది......నే నిక్కడెందుకున్నానూ?......అస లెందుకు వచ్చానూ?......నాప్రభువుకి నేనేం సమాధానం చెప్పగలనూ?......నన్ను అమ్మాయితో పంపుతూ "తల్లీతండ్రీమీరే"అన్నారు మహారాణీ. వారిమొగం నే నిక యెలా చూడగలనూ? (కొంచెం గబగబా పచారు చేస్తాడు.)

మంగ—(ఓరకంట చూస్తూ) బాబయ్యకి వేడి పుట్టింది. ఇక ఫరవా లేదు.

తిమ్మకవి—(పచారు చేస్తూ) రాయల వారు సభలో కనపరుస్తూవున్న మెప్పంతా వొట్టి బూటకం అన్నమాట. అది అమ్మాయిని మరింత పరాభవం చెయ్యడం అన్నమాట.

మంగ—బాబయ్యా, చీకటిపడుతోంది.

తిమ్మకవి—నా హృదయం అంధకారబంధురమే అయిపోయింది. ఆపైని గాలివాన-తుపాను—దావానలం—(అర్ధోక్తి)

మంగ—ఆవేశం పొంది కూచుంటే యేం లాభం బాబయ్యా?

తిమ్మకవి—(తల వంకిస్తూ) నిజమే...నిజమే.....పైగా ఆవేశం పొంది విసుకుదామంటే నేను పట్టింది గంటమాయె......(ఏదో స్ఫురణ అభినయించి) బాగుంది....చాలా బాగుంది......పుణ్యకాలం కాస్తా దాటిపోకుండా నేమహామంత్రులవారు నాకళ్లు తెరిచారు.........మంగా! బాబయ్య జీవచ్ఛవం కాలేదని చెప్పు అమ్మాయితోటి...వెళ్లు.

మంగ—చిత్తం. (చూస్తూ, నుంచునే వుంటుంది.)

తిమ్మకవి—ఇక వెళ్లు...నుంచోకు...వెళ్లిపో.

మంగ—ఇంటిదాకా వస్తాను బాబయ్యా!

తిమ్మకవి—వద్దు వద్దు. అమ్మాయిదగ్గిరికే వెళ్లు. అమ్మాయికి కాస్త ధారకంయిచ్చే ప్రయత్నంలో వుండు.........వెళ్లు మరి.

మంగ—ఎదురుచూస్తూ వుంటాము.

తిమ్మకవి— రేపీపాటికి...... తెలిసిందా? ఇంతకంటే కొంచెం ముందే కావచ్చు. సందేహం లేదు.

మంగ—సెలవు. (వెనక్కి తిరిగితిరిగి చూస్తూ వెళ్ళిపోతుంది.)

తిమ్మకవి—మంచిసమయంలో మహామంత్రి బల్లెంతో పొడిచి లేపారు......... తలుచుకుంటే సిగ్గుసిగ్గు. కవిత్వంలో—శృంగారకవిత్వంలో పడి ప్రపంచకం—శరీరం కూడా మరిచిపోయాను. అగ్రహారం — గజారోహణం — జాంబూనదాంబరాభరణాలు — ఛిక్! పూర్తిగా స్వార్థం......విశ్వశ్రేయస్కరమైన కవిత్వాన్ని సరస్వతిలో వినియోగించడమే కాకుండా, నాప్రభువు పెట్టిన పని మరిచిపోయి—(స్ఫురణ అభినయించి) నాపూర్వపుణ్యావశంవల్ల శృంగారకవిత్వం కూడా యిప్పుడు కార్యసాధకమే అయేలా వుంది. అయేలా గుండడమేమిటి అయితీరుతుంది... మళ్లీ రేపు సాయంత్రం కదా సభలో గ్రంథపఠనం? (ఆలోచించి) ఈరాత్రి కథ ఇలా తిప్పేద్దాం. సత్యభామాదేవిని, తిరుమలదేవికి మేలుచేసేటట్టు చిత్రిద్దాం ... ... సెబాస్! మహాబాగా కుదిరింది పథకం! ప్రణయకలహంలో శృంగారకవిత్వానికే చెల్లుబడి. మన శక్తి అంతా ఇక్కడ ధారపోద్దాం. దీంతో, ప్రభువు, దారికి రాకపోతారా?.........ఎలా రాకపోతారో చూద్దాం. రాకపోతే మనది కవిత్వమే కాదూ. మనం ఇక బతికివున్నా వొకటే, లేకపోయినా వొకటే.........మనం ఇక్కడే వుండగా అమ్మాయికి తిరస్కారమా? హుఁహుఁ. చూద్దాం. (పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోతాడు).

3

భువనవిజయంలో కృష్ణరాయడు కొలువుతీరి వున్నాడు. వెనక శ్వేతచ్ఛత్రం పట్టుకొని వొక యువతీ, వింజామరలు వీస్తూ రెండు వేపులా యిద్దరు యువతులూ నుంచుని వున్నారు. వెనక, పట్టుతెరలో తిరుమలదేవి తప్ప తక్కిన రాణులూ, వారి పరిచారికలూ, తిరుమలదేవిదాది మంగా, సామంతుల భార్యలూ వున్నారు.సింహాసనానికి కుడివేపున మహామంత్రి తిమ్మరుసూ, అల్లసాని పెద్దన్నా, ధూర్జటికవీ, తక్కిన కవులూ, పండితులూ వరసగా కూచునివున్నారు. ఎడమవేపున సామంతులూ, సేనాధిపతులూ, యోధులూ వరసగా కూచుని వున్నారు. ఎదటా, పక్కలా, గోడలకు చేరికగా పౌరులనేకతరగతులవారు చేతులు కట్టుకుని, తలలు వంచుకుని నుంచునివున్నారు. సింహాసనానికి ఎదట నాలుగైదు గజాలదూరంలో వొకయెత్తయిన పీటమీద కూచుని తిమ్మకవి పారిజాతాపహరణం చదువుతున్నాడు.

తిమ్మకవి—

క. ఈ పగిదిఁ సాత్రాజితి [సం

కోపోద్యోగమున వగల బాగులుచు ఘన

తాపంబుపేర్మి నితర
వ్యాపారము మానియుండె హరియును
[నచటన్॥

మ. ముని నాకిచ్చిన పూవుచందమును, నే
మున్నాడి యీభోజనం
దన కర్పించిన జాడయుం దెలియ జెం
తం బొంచి వీక్షించి పో
యిన సాత్రాజితి కోటి నావలన దా
నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మాని దండ నిడి చిం
తాయత్తచిత్తంబునన్॥

చ. అరదము నెక్కి కేతన ప
టాంచల చంచలమైన తాల్మితో
దురగజవంబు మున్నడవ
ద్రోచి కడంగెడు తత్తరంబుతో
దిరిగెడు బండికండ్ల పగి
దిన్ భ్రమియించు మనంబుతోడ నా
హరి సనుదెంచె, సత్యనము
దంచిత కాంచనసౌధవీథికిన్॥

రాయడు—అది మళ్లీ వొకమాటు సెల విప్పించండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ! (అరదము నెక్కి— చదువుతాడు).

రాయడు—పెద్దయ్యంగారు సావధానంగా చిత్తగించారా ఆపద్యం?

పెద్దన్న—చిత్తం మహాప్రభూ! కల్పన చాలా చక్కగా వున్నది.

రాయడు—ధూర్జటికవిగారేమి సెల విస్తారో?

ధూర్జటి—చిత్తం జగత్ప్రభూ! నిన్న సాయంత్రం నాకు తిమ్మకవిగారిమీద చాలా కోపం వచ్చింది; కాని యిప్పుడు చాలా మెప్పు కలిగింది.

రాయడు—ఏమో?

ధూర్జటి—నిన్న సాయంత్రం చివరి పద్యంలో తిమ్మకవిగారు సత్యాదేవిని మదహస్తిహస్తగతపద్మంగా చిత్రించారు. ఇప్పుడు బంతిభేదం లేకుండా శ్రీకృష్ణులవారిని కూడా అలాగే తయారుచేశారు. కనక అంచేత కోపమూ, ఇంచేత మెప్పూ కలిగాయి అభినవభోజరాజేంద్రా!

రాయడు—తమరు చక్కగా చమత్కరించారు. (తిమ్మకవిని చూసి) తమరు కానివ్వండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ!

గీ. వచ్చి, యరదంబు డిగ్గి, తద్ద్వారసీమ
దారుకునినుండ నియమించి, తాన యొకడు
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలములేని నగ రెల్ల నరసి చూచి.

సీ. కనకపంజర శారికలకు జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు
క్రొవ్వాడిగోళ్ల దంత్రులు మీటి వీణియ
ల్వాలికింప రేలొకో భామ లిపుడు

కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడతు లిపుడు
గీ. ఇన్ని దినములవలె నుండ దేమి నేడు?
చిన్నబోయిన దీమేడ చెన్ను దరిగి;
పద్మముఖతోడ నెవ్వరే పారిజాత
పుష్పవృత్తాంత మెరిగింప బోలునొక్కొ?
క. అని యనుమానించుచు నొ
య్యన గోపగృహంబు సేరి, యాసత్రాజి
త్తనయ ముసుంగిడి యుండగ
ననుపు మెరయ జొచ్చి మాయ యచ్చు
[పడంగన్.
ఉ. కొందర మంతనంబులను,
గొందర జంకెనవాడి చూపులన్
గొందర జేతిసన్నల ద
గుల్పడ జేయుచు జేరబోయి మ
ధ్యందినభానుమండలక
రావళి హావళి వాడియున్న తీ
గం దలపించు నమ్మగువ
గన్గొని యెంతయు విస్మితాత్ముడై.
ఉ. ఈలలితాంగి చంద మొక
యించుక చూచెద నంచు ధూర్తగో
పాలుడు, తాలవృంత మొక
భామిని సత్యపిరుంద నుండి మం
దాలస లీలమై విసర,
నాదట గైకొని వీచె, తద్వపుః
కీలిత పంచసాయకశి
ఖిన్ దరికొల్పుచు నున్న కైవడిన్.

రాయడు—బాగున్నది. అది మళ్లీ ఒక మాటు సెలవిప్పించండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ! (ఈ లలితాంగి—చదువుతాడు).

రాయడు—(శ్రీ) కృష్ణులవారి తత్వం చక్కగా ప్రదర్శించారు తిమ్మకవిగారు. ఏమి అప్పాజీ! తమ రేమి సెలవిస్తారూ?

తిమ్మరుసు—తిమ్మకవిగారు ప్రకృతిని సరిగా చిత్రించారు. అంతే మహాప్రభూ!

రాయడు—అంటే?

తిమ్మరుసు—దక్షిణ నాయకుల ప్రవృత్తి అలాంటిది. తిమ్మకవిగారు ఈసంగతి మరిచి పోలేదు. నేను విన్నవించుకుంటూ వున్న దిదీ జగత్ప్రభూ.

రాయడు—(ఉలిక్కిపడతాడు)

తిమ్మకవి—(రాయని స్థితి గ్రహించి, తనలో) మహామంత్రి నామార్గం పరిష్కృతం చేస్తున్నారు.

పెద్దన్న—నే నొక్కసంగతి విన్నవించు కుంటాను మహాప్రభూ!

రాయడు—సెల విప్పించండి.

పెద్దన్న—(శ్రీ)కృష్ణులవారు పరిచారిక చేతి వీవన పుచ్చుకొని సత్యాదేవిగారికి వీచడం దక్షిణనాయకుడికి అర్హంగానేవుంది. అయితే: తిమ్మకవిగారు, అంతమాత్రమే చెప్పి వూరుకోక "తద్వపుఃకీలిత పంచసాయకశిఖిన్ దరికొల్పుచునున్న కైవడిన్" అని దానికి హేతువు చూపించారు. అంచేత ఈపద్యంలో చాలా విశేషం వుంది. ఇది మహామంత్రుల వారికి తెలవనిదా రాజదేవేంద్రా?

రాయడు—(తిమ్మరుసు కేసి చూస్తాడు).

తిమ్మరుసు — పెద్దయ్యంగారు సెలవిచ్చింది యిప్పటిమట్టుకు చక్కగానే వున్నది. కాని తిమ్మకవిగారు దీనిని యెలా పర్యవసింపచేస్తారో చూస్తేగాని నే నిప్పు డింతకంటే యేమీ చెప్పలేను మహాప్రభూ!

రాయడు—(చిరునవ్వుతో) తమరు పెద్ద చర్చకు విఘ్నేశ్వరపూజ చేశా రన్నమాట.

తిమ్మరుసు—మహాకవులతో చర్చలు సాగించడానికి నేను తగను. నే నందుకు సిద్ధపడడం వారిని న్యూనతపరచడంకూడా కావచ్చు. అయినా, పుంభావసరస్వతు లైన యేలినవారి సమక్షంలో తటస్థించిన అవకాశం జారవిడుచుకోవడం మంచిదికాదు. అదిన్నీ కాక; నేను సాహిత్య వ్యవసాయిని కాదు కనక ఇందులో వోటమి సంభవించినా నాకు కలిగే ఇబ్బంది యేమీ లేదు రాజాధిరాజా!

పెద్దన్న—మహామంత్రులవా రేం సెలవిచ్చినా అది మా యెడల వుండే అనుగ్రహానికి గుర్తు. కాక: నిజం చెప్పుకోవలసి వస్తే మేము కవుల మని పేరేగాని సాహిత్యవిద్యలో కూడా వారికి శిష్యప్రాయులమే. అయితే, మ మ్మేలినవారికి వినోదప్రాయంగా వుంటుం దంటే యుక్తసమయంలో కొంచెమో గొప్పో చర్చ జరిగించనే వచ్చు మహాప్రభూ!

రాయడు—(చిరునవ్వుతో) చివరికి, చిలికి చిలికి గాలివాన అయేటట్టుంది. (తిమ్మకవి కేసి ప్రశ్నార్థకంగా చూస్తాడు).

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ! పెద్దవారితో వాగ్వాదం యెంతో అదృష్టంవుంటే గాని సంభవించదు. అందులోనూ, ఏలినవారి సమక్షంలో అది జరగడంలో చాలా విశేషం కూడా వుంది. సావధానంగానే వుంటాను సాహిత్యచక్రవర్తీ !

రాయడు—(చిరునవ్వుతో) ధూర్జటి కవిగారి కిందులో పెద్దభాగమే వుంటుం దని నమ్ముతున్నాము.

ధూర్జటి—చిత్తం జగత్ప్రభూ ! ఏలినవారి ఆజ్ఞకు బద్ధుణ్ణయి వున్నాను.

రాయడు—(కుడివేపుకి చూస్తూ) తక్కిన కవీంద్రులూ, పండితులూ, (ఎడమవేపుకి చూస్తూ) సేనాధిపతులూ, బంధుమిత్రులూ, (ఎదుటచూస్తూ) పౌరశ్రేష్ఠులూకూడా యథోచితంగా ఆవాదంలో పాల్గొంటా రని భావిస్తున్నాము.

(అందరూ ఉత్సాహభరితులవుతారు. శిరస్సులు వంచి తమ ఆమోదం కూడా సూచిస్తారు.)

రాయడు—(తిమ్మకవితో) ఇక తమరు కానివ్వండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ!

ఉ. అంతట పారిజాతకుసు
మాగతనూతనదివ్యవాసన

ల్వింతలు సేయ, దావి యది
విస్మయ మంచు ముసుంగు ద్రోచి య
క్కాంత గృహంబు నల్గడలు
నారసి సంభృత తాలవృంతు నిం
గాంతుని జూచి, బాష్పకణి
కాతరళీకృతలోచనాంతయై.

గీ. తల వాంచి మగుడ ముసుగిడె
గొలకులడిగజారి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళపతిత మరందబిందుకతి బురడింపన్.

ఉ. ఓ ర్పొక యింత లేని విక
చోత్పలలోచన చిత్తవీథి జ
ల్లార్పగ నీలనీరదను
భాంగుడు వేసను దెంచెనంచు గం
దర్పహుతాశను ల్వెలికి
దార్చు సఖుండును బోలె వేడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె
నున్నమితావరణాంశుకాంతమై.

చ. వనిత కుచద్వయంబు పయి
వ్రాసిన కుంకుమపత్రభంగముల్
జనితనితాంతఘర్మకణ
జాలముచేత గరంగి, మెల్ల మె
ల్లన వెలిపట్టుపయ్యెద కె
లంకులజారుట యొప్పె, మానసం
బున నెలకొన్న క్రోధరస
ముగ్ వడబెట్టుచునున్న కైవడిన్.

రాయడు—అది యింకోమాటు వినిపిం చండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ! (వనిత కుచద్వయంబు – చదువుతాడు).

రాయడు—మంచి కల్పన. చాలా బాగున్నది. (తిమ్మరుసుకేసి చూస్తాడు).

తిమ్మరుసు—చిత్తం మహాప్రభూ!

రాయడు — (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ!

క. మానవతి యిట్లు మానని
మానక్రోధములచే గుమారిలి చింతా
ధీనగతి నుండ, మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుడనియెన్.

ఉ. ఇందునిభాస్య! మైతొడవు
లేల ధరింపవు? నున్నగావు లీ
వెందును మానలేవు తెలు
పెందుకు గట్టితి? పీటికొరుచు
ల్కెందలిరాకు మోవి దల
కింపగ జేయక యున్కియేమి? నీ
చందము వింత యయ్యెడు ని
జంబుగ నాకెరుగంగ జెప్పవమా?

చ. మన మరయం దలంచి యొక
మార్గము వన్నితొనవ్వటాలకో?
నను వెరపించెదో? యకట
నాయెడ నిక్కముతప్పు గల్గెనో?
వనజదళాయతాక్షి! పగ
వాడనె? నన్నిటులేల చూడ? వొ
క్క నిమిష మైన నీవు దయ
గన్గొనకుండిన నిల్వనేర్తునే?

చ. పలుకుల దేనె లుట్టిపడ
బల్కవు నే డిది యేమి? వాలుగ
న్నుల నునుసిగ్గు నూల్కొన గ
నుంగొన వేల? యురస్థలంబు జ
న్నుల నెదురొత్తి మక్కువ స
నుం బిగికౌగిట జేర్ప వేటికే?
చిలుకలకొల్కి యెవ్వ రెడ
సేసిరి? నీ కిటు లేల చింతిలన్?

చ. మనముల మాటలం క్రియల
మన్నన లీ వొకనాడు నెట్టి కా
మినులకు, గారవంబు మెర
మెచ్చులకై పచరింతు గాని; పా
యని యనురక్తి నీయెడన
యగ్గలమై కనుపట్టు నాకు; నీ
పనిచిన పంపు సేయుటయ
ప్రాభవ మా టది నీ వెరుంగవే?

మ. పడతీ! నీమధురాధరామృతము నీ
బాహాపరీరంభముల్
బడయన్ ధన్యుడ గాక యుండిన నను
న్నాటించి, యొక్కింత నీ
నిడువాలుం గడగంట జూడు మనుచు
న్నిల్పోపమిం, జై చెరం
గొడియం, జేవిరిదమ్మి వ్రేయుటకు నై
యుంకించి జంకించినన్.

రాయడు — శ్రీకృష్ణులవారి ప్రసంగం చాలా బాగున్నది. ఆంధ్రకవితాపితామహు లేమి సెలవిస్తారో?

పెద్దన్న — ఔచిత్యం, రాధాదేవిగారు దిద్దిన రసికులు శృంగారా వారు, మహాప్రభూ!

రాయడు — తమకు ఉన్నది వున్నట్టుగా సెలవిచ్చారు. (తిమ్మరుసు కేసి చూస్తాడు).

తిమ్మరుసు — తిమ్మకవిగారు శ్రీకృష్ణుల వారి ఔచిత్యం చక్కగా పోషించారు మహాప్రభూ!

రాయడు — ఎలాగా?

తిమ్మరుసు — శ్రీకృష్ణులవారు తమ తప్పెరిగి మసులుకుంటున్నారు.

రాయడు — శ్రీకృష్ణులవారు నారద మహర్షి ప్రసాదించిన పారిజాత పుష్పాన్ని రుక్మిణీదేవిగారికి దయచెయ్యడం తప్పంటారా తమరు?

తిమ్మరుసు — నావుద్దేశం అది కాదు మహాప్రభూ! శ్రీకృష్ణులవారి యెనమండుగురు పట్టమహిషులలోనూ, కవు లందరూ, రుక్మిణీదేవిగారికీ, సత్యభామాదేవిగారికీ - ఈ యిద్దరికే ప్రాధాన్యం చూపిస్తున్నారు.

రాయడు — అవును.

తిమ్మరుసు — శ్రీకృష్ణులవారు పారిజాతాన్ని రుక్మిణీదేవిగారికి అనుగ్రహించడం బాగానే వుందని తతిమ్మా ఆర్గురు దేవులూ సమాధానపడ్డట్టుకూడా తిమ్మకవిగారు సెలవిచ్చారు.

రాయడు — సత్యమే.

తిమ్మకవి — ఇక మిగిలినవారు సత్యభామాదేవిగారు; కాని దీనికి వారు సమ్మతిపడలేదు.

రాయడు — కనబడుతూనే వుంది.

తిమ్మరుసు—అంచేత, వారు కోపగించుకోవడమూ, కోపగృహం ప్రవేశించడమూ ధర్మమే అని శ్రీ కృష్ణులవారికిన్నీ తెలుసు.

రాయడు—సరే.

తిమ్మరుసు—రుక్మిణీదేవిగారి నగరిలోవుండగా లభించిన పుష్పాన్ని వారికేదయచెయ్యడం యెలాంటి ధర్మమో, దానిమీద, అంచేత, అసంతృప్తి పొందివున్న సత్యభామాదేవిగారిని బతిమాలి - సాంత్వనపరచడమున్నూ అలాంటి ధర్మమే కాదా రాజదేవేంద్రా?

రాయడు—బాగానే వున్నది. అయితే; ఇక శ్రీకృష్ణులవారి తప్పేమిటి; వారు, దాన్నెలా సవరించుకుంటున్నారు?

తిమ్మరుసు—సత్యభామాదేవిగారిని సాంత్వనపరచకపోతే శ్రీ కృష్ణులవారిది తప్పే అయిపోతుంది కాదా మహాప్రభూ!

రాయడు—(ఆలోచనలో పడతాడు).

తిమ్మకవి—(తల పంకిస్తూ, తనలో) కీటకం ప్రవేశించింది.

పెద్దన్న—(అపవారించి ధూర్జటితో) మహామంత్రిప్రసంగంలో యేదో ధ్వనిస్తోంది.

ధూర్జటి—(అపవారించి) కనిపెట్టారా? .............. కాని అదేదో బ్రహ్మభేద్యంగా వుంది.

పెద్దన్న—(అపవారించి) బాగా గమనించాలి.

రాయడు—(తలపంకించి, నిట్టూర్పువిడిచి, తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి—చిత్తం. భోగదేవేంద్రా! (రాయనికేసి గంభీరంగా చూస్తూ, తాపీగా)

ఉ. పాటలగంధి చిత్తమున
బాటిలుకోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి-మృదు
పల్లవ-కోమల-తత్పదద్వయీ-
పాటలకాంతి-పాళీ-మణి
పంక్తికి-వన్నియ పెట్ట-నా-జగ
న్నాటకసూత్రధారి-యదు
నందనుడు-అర్మిలి - మ్రొక్కె - న
[| మొక్కినక.

(రాయని కనుబొమలు ముడిపడతాయి. తిమ్మరుసు మొగంమీద చిరునవ్వు మొలకలెత్తుతుంది. పెద్దన్న, ధూర్జటీ రాయణ్ణి విడిచి తిమ్మరుసునీ, తిమ్మరుసుని విడిచి రాయణ్ణీ అదేపనిగా చూస్తూ వుంటారు. తిమ్మకవి రాయని యింగితం కనిపెడుతూ వుంటాడు.)

రాయడు—(సింహాసనానికి జేరబడి) అప్పాజీ!

తిమ్మరుసు—చిత్తం మహాప్రభూ!

రాయడు—శ్రీకృష్ణులవారు, తమతప్పు పూర్తిగా సవరించుకున్నారా?

తిమ్మకవి—ఇంకా కొంచెం తరువాయి వున్నది మహాప్రభూ!

రాయడు—సత్యభామాదేవిగారి తోడి సాహచర్యం కత్తులతో సాములా గున్నదే. (తిమ్మకవిని చూసి) తమరు కానివ్వండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ!

మ. జలజాతాసన (అర్ధోక్తి)

రాయడు—వ్యవధానం బాగుండదు. కనక వెనకటి పద్యం మళ్లీ సెలవిచ్చి వెంటనే తరవాతి పద్యాలు అందుకోండి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ! (వెనకటిలాగే)

ఉ. పాటలగంధి చిత్తమున
బాటిలు కోపభరంబు దీర్ప- నె
వ్వాటను బాటు గామి-మృదు
పల్లవ కోమల తత్పదద్వ యీ
పాటలకాంతి - మౌళి - మణి -
పంక్తికి - వన్నియ వెట్ట నా-జగ
న్నాటకసూత్రధారి-యదు
నందనుడు అర్మిలి - మ్రొక్కె -
[మ్రొక్కెనన్.

(దీనికేం చెబుతావూ అన్నట్టు చూస్తూ)

మ. జలజాతాసన - వాసవాది - సుర పూజాభాజనంబై తనర్చు-లతాంతాయుధు-కన్నతండ్రి-శిరము-అవ్వో-వామపాదంబునన్ -దొలగన్-(మెడ సారిస్తూ) ద్రోచె-లతాంగి-యట్ల యగు:—నాథు ల్నేరముల్ సేయ పేరలుకం జెందిన యట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే? (రాగం విసురుతాడు).

రాయడు—(క్రిందికి చూస్తూ తనలో) అన్యాపదేశమా యిది?

(తిమ్మరుసు తల పంకిస్తూ రాయనికేసి చూస్తాడు. తిమ్మకవి "బాగుందా?" అన్నట్టు తిమ్మరసు కేసి చూస్తాడు.)

పెద్దన—(అపవారించి, ధూర్జటితో) ఈ కల్పన ప్రభువును ఉద్దేశించే. సందేహం లేదు.

ధూర్జటి—(అపవారించి) అలాగే వుంది. అయితే: ఇంత సాహసానికి కారణం?

పెద్దన—(అపవారించి) తలా తోకా యేమీ బోధపడడం లేదు.........ప్రభువు ఏమో అంటున్నారు.

రాయడు—ఏమి, మళ్లీ పద్యం అందుకోరేమీ?

తిమ్మకవి—అందుకుంటున్నాను మహాప్రభూ!

క. కోపన పదహతి గుహనా [ను
గోపాలుడు గాంచి మెరు గగుర్పొడువగ
దీపితమన్మథ రాజ్య
ప్రాపితుడై పలికె గూర్మిబయలుపడంగన్.

చ. నను-భవదీయదాసుని-మనమ్మున నెయ్యపుగిన్క- బూని-తా-చిన యది నా-కు మ-న్ననయ-చెల్వగు నీ పదపల్లవంబు మత్తను పులకాగ్రకంటకవితానము తాకున నొచ్చె నంచు నే ననియెద, నల్క- మానవుగదా యిక నైన నరాళకుంతలా?

రాయడు—(ఓరకంట చూస్తూ తనలో) సందేహంలేదు. ఈ కల్పన మనకోసమే......

యుక్తంగానేవుంది. మనదే తప్పు. (తిమ్మరుసుకేసి చూసి ప్రకాశంగా) ఇవాళకి ఈపాటికి సభ చాలిద్దాము. లేస్తాడు.

తిమ్మరుసు—(లేచి) చిత్తం మహాప్రభూ! (అంతాలేస్తారు. రాయడు సభ విడిచి వెళ్లిపోతాడు. ఎక్కడివా రక్కడే లేచి మెల్లిగా మాట్లాడుకుంటూ వుంటారు.)

తిమ్మరుసు—(తిమ్మకవిదగ్గిరికి వచ్చి మెల్లిగా) మహాకవీ! మంచి కల్పనచేశారు తమరు. శృంగారకవిత్వం చెరకాకుబల్లెంగా చెలామణీ అవుతుందని నే నెప్పుడూ అనుకోలేదు. తమ రాక సార్థకపరుచుకున్నారు తమరు. నాఆందోళనం తీరిపోయింది. చాలా సంతోషం (బుజాలమీద తట్టుతాడు).

తిమ్మకవి—ఇదంతా తమ అనుగ్రహం. అంతా సావకాశంగా మనవి చేసుకుంటాను.

(ఇలావుండగా, వొక పరిచారిక వచ్చి తిమ్మకవినిచూసి "మహాప్రభువు సెలవయిం" దంటుంది. తిమ్మరుసు "వెళ్లండి,వెళ్లండి"అంటాడు "నన్నే?నన్నే?" అంటూ తిమ్మకవి దాసితో వెళ్లిపోతాడు)

తిమ్మరుసు—(పెద్దన్నదగ్గిరికివెళ్లి)ప్రభువు హఠాత్తుగా సభ చాలించారు.

పెద్దన్న—కారణం తమకు తెలవాలి.

తిమ్మరుసు—అణుమాత్రమూ బోధపడడంలేదు. తిమ్మకవిగారు వస్తారు కాదూ? తెలుసుకుందాం... అయితే: ఇందాకా నా వుద్దేశం గ్రహించారా తమరు?

పెద్దన్న—అది యిప్పుడు బోధపడింది. శ్రీ కృష్ణులవారు పరిచారిక చేతి తాళవృంతం పుచ్చుకుని వీచినప్పుడు, తిమ్మకవిగారు "తద్వపుః కీలిత పంచసాయకశిఖిజ్వాల దరికొల్పుచు నున్న కైవడిన్" అని వుత్ప్రేక్షించారు. కాని, వారు, అలా చెయ్యడంవల్ల సత్యభామాదేవిగారు, ఈర్ష్య చెంది -అంటే వ్రదుకుమోతుతనం వచ్చి పాదప్రహారం చేశారు; గాని ముగ్ధలై ఆశ్లేషం చెయ్యలేదు. ఇలాగ ఆ మాటకీ యీ చేతకీ అతకలేదు... ఇంతే కాదూ?

తిమ్మరుసు — తమరు సరిగా గ్రహించారు......మరి లోపల పనివుంది సెలవు.

పెద్దన్న—చిత్తం, సెలవు.

(తిమ్మరుసు లోపలికి వెళ్లిపోతాడు. తక్కినవారు ఒక్కరొక్కరుగానూ, జతలు జతలుగానూ ఏమిటేమిటో చెప్పుకుంటూ బయటికి వెళ్లిపోతారు.)

౪

రాయడు, తిరుమలదేవినగరికి పోయే దారిలో నుంచుని వుంటాడు. పదిగజాలలో, చేతులు జోడించుకుని మంగ నిలిచివుంటుంది. తక్కిన రాణుల పరిచారికలు, కొంచెం దూరంలో, చెట్లచాటున నుంచుని తొంగితొంగి చూస్తూ గుసగుసలాడుకుంటూ

వుంటారు. తిమ్మకవికి రాయణ్ణి చూపించి పరిచారిక నిలిచిపోతుంది. తిమ్మకవి కొంచెం కంగారుపడుతూ రాయణ్ణి సమీపిస్తాడు.)

తిమ్మకవి—(వంగి చేతులు జోడించుకుని) చిత్తం మహాప్రభూ!

రాయడు—తమకుకూడా ఆయాసం కలిగించాము. (చేతులు జోడించుకుని) క్షమించ కోరుతున్నాము.

తిమ్మకవి — అదేమిటి జగత్ప్రభూ? ఏలినవారి నాశ్రయించుకునివున్నాము మేము. తప్పులు మావల్లనే వస్తాయి. వాటిని లెక్క చెయ్యకుండా యేలినవారే మమ్మల్ని క్షమిస్తూ వుండాలి. లేకపోతే మేము నలిగిపోతాము. ఇంతకీ: ఏలినవారిని నేను క్షమించడం యేమిటి రాజాధిరాజా?

రాయడు—అంతా తమకే తెలుసు; కాని గతం మరిచిపోండి. తమ అమ్మాయిగారి దర్శనం కోరుతున్నాము (మళ్లీ చేతులు జోడించుకుని) తమరు అనుగ్రహించాలి.

తిమ్మకవి—ఇవాళ మాకీ పరీక్ష యేమిటో బోధ కావడంలేదు. (మంగకేసిచూస్తూ) అలా వూరుకుంటావేమే మంగా?

మంగ—జగత్ప్రభువులకు ఒకరి సెలవేమిటి బాబయ్యా? కాకపోయినా, ప్రత్యుత్థానం చేసి తీసుకువెళ్లవలసిన అమ్మాయికి ఇవాళకి ఆరు లంఘనాలు—(అర్థోక్తి)

రాయడు — (ఆత్రంతో) ఏమన్నావు మంగా?

మంగ—(కళ్ల నీళ్లుపెట్టుకొని గద్గదికతో) మాతల్లి ఆరుదినాలనుంచి మంచం దిగడం లేదు మహాప్రభూ!

రాయడు—(చెవులు మూసుకుని) శ్రీహరీ......... శ్రీహరీ,.........ఎంత అపరాధమూ? (ముందుకి అడుగువేసి) తొరగా నడూ. (నాలుగడుగులువేసి వెనక్కి చూసి) మహాకవీ! తమరుకూడా దయచెయ్యాలి.

తిమ్మకవి—చిత్తం మహాప్రభూ!

(చాలా చురుగ్గా ముందు రాయడూ, అంతకంటే ముందు వెళ్లాలని కంగారుపడుతూ ముందు మంగా, వెనకవిజయానందంతో తిమ్మకవీ తిరుమలదేవి నగరికేసి వెళ్లిపోయారు. తియ్యమామిడి గున్నకొమ్మల్లో నక్కివుండి, గండుకోయిల కుహూకుహూ అంటూ పల్లవి అందుకుంది.)

---




### మదవిదళనము

గ్రంథకర్త: విద్వాన్ టి. ఆర్ముగంపిళ్లై, ప్రధానాంధ్రోపాధ్యాయుడు, ముత్యాలపేట హైస్కూలు, మద్రాసు.

క్రౌను సైజు, పుటలు ౬౩, వెల ౮ అణాలు.

క్షేమేంద్రమహాకవి సంస్కృతమున రచించిన దర్పదళనమున కిది ఆంధ్రానుసరణము; వచనము. కుల మదము, ధనమదము, విద్యామదము, బలగర్వము, రూప మదము, యౌవనమదము, అధికారమదము, ఆచారమదము అను ప్రకరణములతో నాయావిషయముల స్వరూపమును, వాని గుణదోషములును, వానిని విదళించుకొనవలసిన యావశ్యకతయు చక్కని కథలరూపమున వివరింపబడినవి. ఈ కులాదులు మనుజులలో నెన్నెని యనర్థములను గలుగజేసి వారిని అన్ని అందాలా క్రుంగదీయుచున్నవి. వీని విదళనము శ్రేయస్కాములకు అవశ్యాచరణీయము. చక్కని, లాక్షణికమైన భాష; తీగలువారుచు, లలిత లలితమైన శైలి. వర్ధిష్ణువులగు విద్యార్థులకు ఈకృతి మంచి శిక్షణము నీయజాలియున్నది. శీలపోషణకు, వారికి ఇది సహకారికాగలదు. స్కూలు ఫైనలు తరగతికి నాన్‌డిటెయిల్డుగా నుండదగియున్నది. బాలుర యభ్యుదయము నాకాంక్షించు పాఠ్యగ్రంథ నిర్ణాయక సభవారీ గ్రంథమునకు సముచితాదరణ నొసగ దగును.

---

### స్మృతికాలపుస్త్రీలు

స్త్రీలయభ్యున్నతికై అనేక ప్రయత్నములు జరుగుచున్న ఈకాలమున ప్రాచీన సంప్రదాయముల నెఱుంగుటవలన కొంతయుపయోగ ముండవచ్చును. ధర్మశాస్త్రవిషయమున స్మృతిప్రాధాన్యము కుండుటచే తగువిమర్శతో స్మృతులను పరీక్షింపవలెను. జటావల్లభుల పురుషోత్తముగారు రచించిన "స్మృతికాలపుస్త్రీలు" అను నీగ్రంథము స్మృతివాఙ్మయముతో మనకు పరిచయము గలిగించుట కుపయోగపడుచున్నది. పూర్వరచితమగు "వేదకాలపు స్త్రీలు" అను గ్రంథమున కిది అనుయాయి.

స్మృతికాల మన నిదియనిగాని, స్మృతులయొక్క కాలమును, ముందువెనుకలును గాని నిర్ణయించుట కష్టసాధ్యమగుటచే గ్రంథకర్త కాలనిరూపణతో నిమిత్తము లేకుండ గౌతమ బోధాయనాపస్తంబ వసిష్ఠ సూత్రములను, మను నారద యాజ్ఞవల్క్యాదిస్మృతులను నాధారముగా గొని యందు గోచరమగు స్త్రీలస్థితిని వర్ణించెను. ఉపోద్ఘాతమున గర్గ విష్ణు దేవల పులస్త్య కాశ్యప ప్రాచేతసస్మృతులు లభింపమిచే నవి వదలివేయబడినట్లు చెప్పబడినది. వీనిలో విష్ణుస్మృతి ప్రస్తుతము లభ్యమే యని తలంతును. అలభ్యములగు స్మృతులలోని వాక్యములు కొన్ని నిబంధగ్రంథములయందు గాంచనగును. పురాణములకును స్మృతులకును సంబంధమున్నది. ఈ రెంటినిగూడ కొంతపరిశీలించిన గ్రంథముయొక్క విలువ యతిశయించెడిది.

పైస్మృతులయం దాయాకాలములనాటి స్త్రీల పరిస్థితులును, ఆశయములునుగూడ క్రోడీకరింపబడియున్నవనియు, నవి చారిత్రకదృష్టిగలవారికిని స్మృతి ధర్మాచరణతత్పరులకును గూడ నుపయోగించున ట్లీగ్రంథమున వివరించినట్లును ఉపోద్ఘాతమునం దున్నది. చదువరుల చారిత్రకదృష్టి గ్రంథకర్తయూహయందున్నను గ్రంథ రచనయందు మాత్ర మది యుపయోగపడిన ట్లగపడదు. స్మృతులన్నిటియందును ఆశయాచరణములకుగల భేదము స్పష్టముగ గన్పట్టుచున్నది. చారిత్రకదృష్టితో జదువువారి కాయాస్మృతులయందు గలిగినమార్పులు చూపట్టక మానవు. ఒకింత శ్రమపడిన ఆశయాచరణములకు గల తారతమ్యమును, స్మృతికర్తలు వాని నెట్లు సమన్వయ మొనర్ప యత్నించినదియు విశదమగును. యాజ్ఞవల్క్య

నంతటిపైనను గూడ 'అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్యమ ప్యాచరేన్నతు' అని వ్రాయబడియున్నాడు. స్మృతుల యందలి ధర్మాచరణముయొక్క చారిత్రమును చిత్రించు పట్ల కొన్ని ప్రమాదములకు మనము లోనుగావచ్చును. అట్లని చారిత్రకదృష్టిని వదలివేసి స్మృతిధర్మముల కన్నిటికి సమానస్థానము నే యొసగుటగాని, ఆనిర్ణయమును పాఠకులకు వదలివేయుటగాని యుక్తముగాదు. సమావేశనవిషయమున గ్రంథకర్తపడిన శ్రమ చారిత్రకదృష్టితో జూచువారి కనవసరమని తోచకమానదు.

స్మృతికాలము నాటి స్త్రీలస్థితి మన కవగతము చేయుటకు గ్రంథకర్తపడిన శ్రమ ప్రశంసనీయము. చెప్పబడిన ప్రతివిషయమునకును స్మృత్యాధారము లుదాహరింపబడుటచే జదువరుల పరిశోధనాబుద్ధి పురికొల్పబడుచున్నది. పరిశిష్టమును వదలి ఈపుస్తకము పది యధ్యాయములుగా విభజింపబడినది. స్త్రీసంతతియను మొదటి యధ్యాయమున పుత్రికాకరణమును గూర్చియు స్త్రీపుంసంతతులపట్లగల దృక్పథభేదమునకు గారణములను గూర్చియు చెప్పబడియున్నది. వేదకాలము నాటి నుండియు స్త్రీసంతతి పురుషసంతతికంటె తక్కువగనే చూడబడుచుండెడిది. స్మృతికర్తలు పుత్రికాకరణమును కల్పన నాధారముగాగొని స్త్రీ సంతతిహక్కు లె ట్లభివృద్ధిపరచినదియు నెందు గాననగును.

రెండవయధ్యాయము మొదలు ఆరవయధ్యాయము వరకును, వివాహవయస్సు, వధూవరార్హతలు, వివాహవిధానము, దాంపత్యము, పునర్వివాహము ననునంశములను చర్చించి స్మృతికాలము నాటి దాంపత్యవిషయములన్నియును వరుసగా జెప్పబడినవి. స్మృతులన్నియును రజస్వలాపూర్వమే కన్నియకు వివాహము చేయవలెనని చెప్పుచున్నవి. తదుల్లంఘనమువలన గలుగు ఫలితమదృష్టార్థము. ఈలోకమున నేదండనయును లేదు. అంతేగాక అవివాహితగనే రజస్వలయైనకన్యను దోషయుక్తగ భావింపదు. ఆదోషమంతయు తల్లితండ్రులదే. వివాహముయొక్క లౌకికఫలితములయందును భేదమంతగా గానరాదు. వివాహవయోనిర్ణయముపట్ల వివిధస్మృతులయందలి వాక్యములను పరిశీలించిన ఏదోయొకకాలమున ప్రబలియుండిన రజస్వలానంతర వివాహాచారమును తొలగించుటకై స్మృతికారులు యత్నించిరని తోచును. ఈవిషయము ప్రజలదృష్టిని మార్చుటకు ఋషు లుపయోగించినపద్ధతులు ప్రస్తుత మతిబాల్యవివాహములను నిరోధించుటకైన శారదా చట్టమునందలి పద్ధతులను జ్ఞప్తికి దెచ్చుచున్నవి. ఇచ్చటగూడ తప్పు తల్లిదండ్రులదే. బాలికకుగాని, యామెసంతానమునకుగాని ఏవిధమైన దోషమును లేదు. ఈకాలమున దండనరూపమగు దృష్టార్థహేతువులచే (ఖైదు జరిమానాలు) నతి జాగరూకతతో ప్రజాభిప్రాయమును మనము మార్ప యత్నించుచున్నట్లే పాతిత్యనరకలోకవాసములను వదలి ఇష్టార్థహేతువులచే నాయాకాలములయందు స్మృతికర్తలు తమయాశయమును సాధింప యత్నించిరి. నగ్నికావివాహమును శాసించిన వసిష్ఠుడుగూడ భ్రూణహత్యాదోషమును సకామయు, పతినియుజ్యమానయునగు కన్యవిషయమున చెప్పుటచేతను, వివాహార్హయగు కన్నియను అస్పృష్టమైథునయని పేర్కొనుటచేతను మున్ముందు రజస్వలానంతరవివాహమే యాచారమైయుండినట్లును, రజస్వలాత్ప్రాగ్వివాహసూత్రమును గౌరవించనివారిని గూర్చియే ఈ వాక్యములు చెప్పబడినట్లును ఊహింపనగును.

ఈ సందర్భముననే వివాహవిధానమున నుదాహరింపబడిన ఆపస్తంబుని "త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనంచ" అనుసూత్రమును గాంచనగును. గ్రంథకర్త "వధువప్రాప్తవయస్కయైనను వరుడు ప్రాప్తవయస్కుడగుటచే బ్రహ్మచర్య భంగము కలుగుట కవకాశ ముండుటచే నది పాటింపబడవలెనని స్పష్టముగ చెప్పబడిన"దని వ్రాసియుండెను. రజస్వలాపూర్వవివాహముల కనువగునట్లీయబడిన ఈ సమాధానము సమంజసముకాదు. అరజస్వలయగువధువు విషయమున బ్రహ్మచర్యనియమము నాదేశించుటకవసరముగాని, యవకాశము గాని యున్నట్లు తోచదు. "ఉభయోః" అనుపదము నియమభారము నిరువురిపైనను సమముగ మోపుచున్నది. ఆశ్వలాయనగృహ్యసూత్రమున నీబ్రహ్మచర్యకాల మొకవత్సరమని యొకమతమైనట్లు చెప్పబడి

నదని నాకు స్ఫుర్తు. ఇందువలన వివాహవయస్సు తగ్గిన కొలదియు బ్రహ్మచర్యకాలము హెచ్చింపబడియుండ వచ్చునని తేలును. ఈ సందర్భమున గ్రంథకర్త సూత్ర ప్రక్రియ నతిబాల్యవివాహములతో సమన్వయ మొన ర్చుటకు జేసినయత్న మెంతవరకు సఫలమైనదను సంగతి ఆలోచనీయము. నారదుడు "కన్యర్తు ముపేక్షేత బాంధవేభ్యో నివేదయేత్, తే చేన్న దద్యుస్తాం భర్త్రే తేస్యుర్భ్రూణహభిస్సమాః" అనిచెప్పుటచేతను, మనువు రజస్వలానంతరము కన్యక మూడేండ్లు నిరీక్షించి పిమ్మట స్వయంవరము చేసుకొనదగుననియు, అనుకూలుడగు వరుడు లభింపనిచో యావజ్జీవము కన్యకగానే యుండ వచ్చుననియు చెప్పుటచేతను రజస్వలానంతరవివాహము లొకప్పుడు పాపభూయిష్ఠములుగా పరిగణింపబడక యుండెననియు, స్మృతికాలమున నేవో ప్రబలకారణ ములనుబట్టి ఋషు లీమార్పును గైకొనిరా యట్లించి రనియు తెల్లమగును.

దాంపత్యమను ప్రకరణమున పెండ్లిలో సన్ని కల్లు త్రొక్కుచునపుడు చెప్పబడుమంత్రమును, తదర్థమును వివరించి హిందూవివాహముయొక్క మహదాశయ మును గ్రంథకర్త వ్యక్తపరచియున్నాడు. ఇది అంద రును చదువదగినవిషయము. స్త్రీ పురుషుని యధికారమ నకు లొంగియుండవలెనని స్మృతికర్తల యభిప్రాయమే యైనను భార్యకు భర్తతో నర్థభాగిత్వ మొసంగబడ దగును. ఈసందర్భమున నుదాహరింపబడిన దని చెప్ప దగును. ఈ సందర్భమున నుదాహరింపబడిన ఆపస్తం బునివాక్యములు చిరస్మరణీయములు. ఆత డంగీకరించిన ద్రవ్యసామాన్యత్వము ప్రత్యక్షరూపమును దాల్చి భార్యకు భర్తఆస్తియందు దాయాధికారము లభించుట కెంతో కాలము పట్టినది.

స్త్రీపునర్వివాహవిషయమున ననేకములగు చర్చ లిదివరకు జరిగియున్నవి. ఈ గ్రంథమువలన స్మృతి వాఙ్మయమునం దీవిషయమున నభిప్రాయభేద మున్నట్లు తెలియనగును. పురుషుని బహుభార్యాత్వమును స్మృతికర్త లెట్లరికట్టినదియు నీయధ్యాయమున నుదాహ రింపబడిన "అధివిన్నస్త్రియై దద్యా దాధివేదనికం సమం" అను యాజ్ఞవల్క్య శ్లోకపాఠమువలన తెలియ గలదు.

కర్మకాండమందు స్త్రీకిగలస్థానము సప్తమా ధ్యాయమున సూచింపబడినది. ఈ విషయమున వేద కాలపునాటి స్థితినుండి పతనముగానగును. వేదములలో స్త్రీ లమంత్రలని చెప్పబడలేదు కాని స్మృతులయందు 'న స్త్రీ జుహుయాత్', 'అస్వతంత్రా ధర్మే స్త్రీ' యను వాక్యములు చాలగా గానవచ్చుచున్నవి. స్మృతులు స్త్రీశూద్రులను సమముగా జూచుచున్నవి. ఈ మార్పల కలిగిన దనునంశమున పరిశోధన యావశ్యకము.

అష్టమాధ్యాయమున ధనవిషయకములగు స్త్రీల హక్కులు సర్తింపబడినవి. ఈవిషయమును మార్పులను గూర్చి యొకపెద్దగ్రంథము వ్రాయవచ్చును. ఈయధ్యా యమును జదివిన, పూర్వము స్మృతికర్తలు స్త్రీలకొసం గిన హక్కులలో నెన్ని కాలక్రమమున మాయమయిన వో మన కవగతమగును. అవివాహితయగు కన్యయొక్క చతుర్థాంశభాగిత్వ మిందుల కుదాహరణము. ఈయధ్యా యమును శాస్త్రదృష్టితో గాక లౌకికదృష్టితో జూడ వలసినయావశ్యకము చాలగ నున్నది.

తుది రెండధ్యాయములును స్త్రీలయొక్క గౌరవ స్వాతంత్ర్యములకును, విద్యావృత్తులకును సంబంధించి నవి. స్మృతికాలపుమార్పులు చక్కగా మనకు తెలియు టకై వేదకాలముతో పోల్చిచూచిన బాగుండెడిది. స్త్రీ పురుషాధీనయైనను గృహమునం దామెకు గౌరవస్వాతం త్ర్యములు మెండని చెప్పదగును. పురుషునివలె స్త్రీ సులభముగ పతితురాలు కాజాలదు. పతితుడగు తండ్రి పరిత్యాజ్యుడుకాని, తల్లిని కుమారుడు త్యజింప వీలు లేదు. కాని వేదకాలమున స్త్రీలకున్న గౌరవము తగ్గి పోయినది. స్త్రీ స్వాతంత్ర్యానర్హ యనియు, పురుషు డామెకు స్వాతంత్ర్య మీయరాదనియు నొక్కి చెప్ప బడినది. ఇక వృత్తివిషయమున నన్ననో గృహమే యామెకుశరణ్యమని స్మృతులయభిప్రాయము. "ఉత్పా దన మపత్యస్య జాతస్య పరిపాలనమ్, ప్రత్యహం లోక యాత్రాయాః ప్రత్యక్షం స్త్రీ నిబంధనం" అని మనువు

చెప్పియున్నాడు. అయినను "అర్థస్య సంగ్రహే చైనాం వ్యయేచైవ నియోజయేత్" అని చెప్పియుండుటొకింత యనుకూలముగ నున్నది. వేదకాలమున గూడ స్త్రీలను గూర్చి నిందావాక్యములు కొన్నియున్నను స్మృతులలో నున్నంత గానరావు.

యాదృచ్ఛికముగ గ్రంథమునందలియంశములలో గొన్నిటి నుదాహరించితిని. మొత్తమున గ్రంథమునంతను చదివినమీదట స్మృతికాలపు స్త్రీలవిషయమున నూతనముగ కొన్నియవశ్యాంశములు తెలియుననుటకు సందేహములేదు. గ్రంథకర్త చారిత్రకదృష్టితో దీనిని వ్రాయుచున్నను ఈగ్రంథపఠనము చదువరుల చారిత్రకదృష్టిని, పరిశోధనబుద్ధిని మేల్కొల్పి, స్మృతివాఙ్మయము హైందవ ధర్మాభివృద్ధి కొకయడ్డంకి గాక సరిగా నుపయోగించుకొనినచో గొప్పసహకారి గాగలదను నంశము వ్యక్తపరచును.

ఈ పుస్తకముచివర తప్పొప్పులపట్టిక నొకదాని నిచ్చియున్నను, అందుచేరని యచ్చుపొరపాటులు చాలగా గన్పట్టుచున్నవి. ముందుముందు వానిని సవరించెదరని యనుకొందును. శాస్త్రగ్రంథములయం దచ్చు తప్పు లింతగా నుండుట గ్రంథగౌరవమునకు భంగకరము.

## భక్తిసారము

గ్రంథనామము సార్థకము. ప్రచారమునందుండు భక్తివిషయగ్రంథములందలి ముఖ్యవిషయము లన్నియు నిందుగలవు. పుస్తక మామూలాగ్రముగ తిలకించుట కొకగంట చాలినను గ్రంథస్థ విషయాచరణమునకు జీవితమంతయు నావశ్యకము. భక్తిపథము నధిగమింప గోరువారికందరికి నిది యవశ్యపఠనీయము. ప్రప్రథమమున జీవితలక్ష్యము మోక్షమని నిర్ణయింపబడి యిందుల కవలంబింపబడు మార్గములలో భక్తియే ముఖ్యమనియు భక్తిలక్షణములును, తదనుకూల విరోధములును చక్కగా వర్ణితములు. విషయము లింకను కొంతవిపులముగనుండిన బాగుగనుండును. పలుమారు పఠించి మననము చేయదగినపద్యములు, ఆంగ్లవాక్యము లనేకము లిందు చక్కగా సమకూర్చబడుట ముదావహము.

వ్యయప్రయాసల కోర్చి గ్రంథమును చక్కని కాగితములపై నచ్చొత్తించి యుదారత్యాగంబున నుచితముగ గ్రంథాలయములకును, భజనసమాజములకునొసగుచున్నందులకు గ్రంథకర్తయెంతయు నభినందనీయుడు. భక్తిపరములగు గ్రంథము లనేకము లుండినను మూల్యాధిక్యముచే జనసామాన్యమున కవి యందుబాటులో లేకున్నవి. అట్టికొరతను తీర్చి మూల్యరహితముగ నీగ్రంథము నొసగి భక్తిప్రచారమును, తన్మూలమున 'మానవసేవయు' కావించు నీగ్రంథకర్త ధన్యుడు!

'జగన్నాథ'

## నవ్యభారతోదయము

వచనము. రచయిత; ప్రకాశకుడు: కామరాజు, హనుమంతరావు, ప్రాక్ప్రతీచీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము. క్రౌను ౧/౮ సైజు ౨౩౦ పుటలు. అట్టబైండు వెల రు ౧-౮-౦. కేపరు బైండు రు ౧-౦-౦.

'ఆదికాలమునుండి నేటివరకునుగల హైందవధర్మజీవనముతో సంబంధించిన మహద్విషయము' లీ చిన్ని పుస్తకమందు వ్యక్తీకరింపబడినవి. గ్రంథకర్త బహుగ్రంథపరిశోధన మొనరించి తత్ఫలితములగు సిద్ధాంతములను ఇందు బాగుగ వివరించెను.

హైందవులకు తొలుతనుండియు ఆధ్యాత్మికవిజ్ఞానార్జనముననే యభిలాష మెండనియు, నశ్వరములగు భౌతికపదార్థముల తత్త్వమును పరిశీలించి వానిని మానవోపయుక్తములుగ చేయు కోరిక లేదనియు, ఆదికాలమునుండి నేటివరకును ఆ యాధ్యాత్మికవిజ్ఞానము పెంపొందుచునేయున్నదనియు, పాశ్చాత్యులదృష్టిలో ప్రధాన మయినది భౌతికవిజ్ఞానమనియు, భౌతికవిజ్ఞానముకంటె ఆధ్యాత్మికవిజ్ఞానమే ఉత్కృష్ట మని పాశ్చాత్యవిద్వాంసులుకూడ ప్రశంసించుచున్నారనియు నిందు వివరింపబడినది.

పాశ్చాత్యనాగరకతకు భౌతికవిజ్ఞానము, ధనము, యంత్రాలయములు, ప్రభుత్వములు, ఔషధసేవ, పర

పీడనము, జీవాతువు లనియు, 'పాశ్చాత్యనాగరకత విషయబద్ధమై, స్వార్థప్రేరితమై, విశ్వమానవ కోటికి వినాశహేతువుగ నున్న దని'యు పాశ్చాత్య విద్వాంసులే నుడివినట్లు ఇందు వ్యక్తపరుపబడినది.

భారతీయులు నాటినుండి నేటివఱకును సత్యమే దైవమని, అహింసయే పరమసాధనమని, స్వధర్మమే సర్వోత్తమ మని, దీనజనోద్ధరణ మవశ్యాచరణీయమని, మాతృదేవతాసంసేవనము ముక్తిసాధనమని నమ్ముచున్నారనియు, అవియే వారియుత్తమధర్మము లనియు నిందు వర్ణింపబడినది.

ఇందు భౌతికవిజ్ఞానము నిరసింపబడలేదు. ఆధ్యాత్మికవిజ్ఞానమును ప్రధానముగాగొని, భౌతికవిజ్ఞానముతో దానిని మేళవించి మానవు లుత్తమమార్గముల ననుసరించుచుండవలయుననుటయే యిందలి ఆశయము. భౌతిక విజ్ఞానావశ్యకతయు నిందు కొంత చెప్పబడినది.

వైదికాది ప్రాచీన భారతీయవాఙ్మయ ముద్ఘోషించు నుత్తమధర్మములనే (నవయుగ వాతావరణమున నష్టప్రాయము లయినవానిని) రామమోహనుడు, దయానందుడు, రామకృష్ణుడు, ఆనిబిసెంటు పునరుద్ధరించి ప్రపంచమున హైందవధర్మతత్త్వమును ప్రకటించిరనియు, ప్రస్తుతకాలమున యుగపురుషు లనదగు రవీంద్రుడు, రాధాకృష్ణుడు, అరవిందుడు, గాంధీమహాత్ముడు హైందవధర్మప్రబోధమున యావత్ప్రపంచమునకును, ఉత్తమాదర్శములను చూపుచున్నారనియు గ్రంథకర్త చక్కగ నిరూపించెను.

మతములు వేరయినను లక్ష్య మొక్కటే యని యిందు సయుక్తికముగ చెప్పబడినను, అందు భారతీయుల విజ్ఞానమునకే ప్రాముఖ్య మీయబడినది. అందులకు కారణములును వివరింపబడినవి.

'రవీంద్రుని భావనాశక్తిలోను, రాధాకృష్ణుని తత్త్వజ్ఞానములోను, అరవిందుని యోగసాధనలోను, గాంధీమహాత్ముని యాదర్శజీవనములోను నవ్యభారత భామిని నవీనకాంతులు ప్రస్ఫుటమగుచున్న' రీతిని గ్రంథకర్త యొనరించిన పరిశోధన ప్రశంసనీయము.

గ్రంథప్రతిపాదితాంశములను గూర్చి గ్రంథకర్త చాల కాలమునుండి కృషిచేసెను. 'ఇందలి కొన్ని యంశములగురించి' తెలుగుదేశమున కొన్ని 'ప్రాంతములలో' గ్రంథకర్త 'అచ్చటచ్చట' 'ఉపన్యాసముల నొసంగియున్నా'డు. కొందరుశ్రోతల కోరికపైనే వానిని ఇపుడు 'పుస్తకరూపముగ' ప్రకటించినారు.

భారతీయ సంప్రదాయములను, హైందవుల ఉదారాశయములను, పాశ్చాత్యుల ఆశయములను తెలిసికొనగోరు ఆంధ్రులెల్లరును ఈ గ్రంథమును పఠింపవలసి యున్నది.

ఇయ్యది ప్రాక్ప్రతీచీ గ్రంథాలయమున కొక అమూల్యాలంకార మని చెప్పవలెను. సంపాదకు లిట్టి యుత్కృష్టగ్రంథములను ప్రకటించి ఆంధ్రవాఙ్మయ లక్ష్మికి క్రొత్తతొడవులను కూర్చుచుందురుగాక!

---

## శ్రీ దీక్షితుల చరిత్రము

సంగీత గ్రంథమాల: చతుర్థ పుష్పము. వచనము.

గ్రంథకర్త, ప్రకాశకుడు: సంగీతవిద్వాన్ విజయమూరి వరాహనరసింహాచార్యులు, కాకినాడ. క్రౌను ౧/౮ సైజు ౮౦ పుటలు. వెల రు ౦-౬-౦.

శ్రీ ముద్దుస్వామిదీక్షితులు సుప్రసిద్ధ గాయక సార్వభౌములు. 'కాలానుసరణంబుగ సంగీతము భౌతికానందదాయిని యని తలచువారిని దిద్ది యాధ్యాత్మిక విద్యయే యది' యని చెప్పిన సంగీతత్రిమూర్తులలో వీ రొకరు. సంగీతత్రిమూర్తులలోని తక్కిన యిరువురికిని (శ్రీ త్యాగరాజు, శ్రీ శ్యామశాస్త్రి) వీ రేమాత్రమును తీసిపోరు.

ఈ గ్రంథమున శ్రీ దీక్షితుల సమగ్రచరిత్రము సంగ్రహింపబడినది. శ్రీ దీక్షితులకు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు ప్రసన్నుడగుట, ఎట్టియాపుర పరిసరముల వర్షము కురిపించుట, 'తివలూరు'. దేవాలయమున తలుపులు తమంతటఁ పీడున ట్లొనరించుట మొదలగు నీతని

మహిమలును, అందందు సందర్భోచితముగ దీక్షితుల వారి కీర్తనములును ఇందు వివరింపబడినవి.

'గొప్పవారు, మనీషులు, కవులు, భక్తులు, సంగీతతత్త్వవేత్తలు మున్నగువారి చరిత్రము లాదర్శక ప్రాయములును, ననుసరణీయములు నగు.' ఈ గాయక సార్వభౌముని చరిత్రము గానకళాభిజ్ఞులకు, అనభిజ్ఞులకు గూడ ఉపకారకము. కావున ఆంధ్రులీ చిన్నిపొత్తమును ఆదరించి శ్రీ ఆచార్యులవారి ఉత్సాహమును పెంపొందించి వారి సదుద్యమమునకు తోడుపడుట ఉచితము.

బు. వేంకటరమణయ్య.

# స్వీ కా ర ము

## స్థానిక కూటములు

(వచనము : ద్వితీయ ముద్రణము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౫౦. వెల రు.౧-౦-౦

గ్రంథకర్త: టి. శివశంకరం, పెనుగొండ.

## వ్యయ విచారము

(వ చ న ము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౩౮. వెల రు. ౦-౮-౦

గ్రంథకర్త: ఎల్లమరాజు నారాయణభట్టు, సాధన ఆఫీసు, అనంతపురము.

## శ్రీ వేంకటరమణ కృతులు

(ద్వితీయభాగము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౪౦. రెండణాల తపాల బిళ్లలు పంపిన ౧, ౨ భాగములు పంపబడును.

గ్రంథకర్త: పలుకూరి వేంకటరమణయ్య, విజయనగరము సిటీ.

## ఆళ్వందారుల స్తోత్రరత్నము

(ఆంధ్ర పద్యానువాద సహితము)

క్రౌను ౧/౮, పు. ౩౨.

అనువాదకుడు : యామర్తి వెంకటసుబ్బదాసు.

## శ్రీ వరాహనరసింహశతకము

(ద్వితీయ ముద్రణము)

గ్రంథకర్త: పలుకూరి వేంకటరమణయ్య, విజయనగరము సిటీ.

## కావ్యమాల

(పద్యములు) సాహిత్యలత 7-వ కుసుమము

క్రౌను ౧/౮ సైజు. పు. ౯౪. చందా పద్ధతిని లభించును.

గ్రంథకర్త: కారుమంచి కొండలరావు, బి. ఏ. బి. ఇ డి.

ప్రకాశకులు: కర్లపాలెం కృష్ణరావు, చీరాల.

## ఆముక్తమాల్యదవైభవము అను ఆండాళ్ చరిత్రము

(ద్విపదపద్యగద్యరూపము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౪౫. వెల రు. ౦-౪-౦

గ్రంథకర్త : సామినేని రాజారావునాయడు, నెం ౧౧, సీనుమొదలివీధి, మదరాసు.

## ఉపయుక్తవాచకము

(పద్యము + గద్యము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౨౦. వెల ౧-౦-౦.

గ్రంథకర్త : పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, పిఠాపురము.

### ఉపన్యాసములు - మొదటిభాగము
(వచనము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౦౧ వెల రు. ౦-౧౨-౦

గ్రంథకర్త : కృత్తివెంటి వెంకటసుబ్బారావు, ఎం. ఏ., భీమవరం, ప. గోదావరిజిల్లా.

---

### చిత్రోద్ఘాతనము
(సమవాకారము)

క్రౌను ౧/౮ సైజు పు. ౧౨౨ వెల రు. ౦-౧౨-౦

గ్రంథకర్త : కోటమర్తి చినరఘుపతి.

ప్రకాశకులు : సరస్వతీ గ్రంథమాలవారు, కాకరపఱ్ఱు, ప. గోదావరిజిల్లా.

---

### హిబ్బర్టుమహోపన్యాసము
(వచనము)

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౬౪, వెల రు. ౦-౬-౦

ఆంగ్లమూలకర్త : సర్వేపల్లి రాధాకృష్ణపండితులు.

అనువాదకుడు : బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ., పి. ఆర్. కాలేజి, కాకినాడ.

---

### దస్తావేజుల మతలబు

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౮౪. వెల రు. ౦-౧౨-౦

గ్రంథకర్త : కర్లపాలెం కృష్ణరావు, చీరాల.

ప్రకాశకుడు : పులిపాటి రంగయ్య, బుక్ సెల్లర్, చీరాల, గుంటూరుజిల్లా.

---

### సిద్ధాంతరహస్యం
(జ్యోతిషము : ప్రథమభాగము)

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౨౧౮.

గ్రంథకర్త : దేవరహంలి మంగలం గ్రామవాస్తవ్యులు పట్టాభిరామయ్య.

---

### కాంగ్రెస్ సువర్ణమహోత్సవ సంచిక
(కన్నడము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౬౦.

'విశ్వకర్ణాటక' పత్రికవారు తమ పత్రికకనుబంధముగా ప్రకటించిరి. ఇందు కాంగ్రెసు అధ్యక్షుల చిత్రములు, ఆయా సంవత్సరముల కాంగ్రెసు సంగ్రహ చరిత్రము కలదు.

సంపాదకుడు : తిరుమల తాతాచార్య శర్మ, బెంగుళూరు.

---

### Federalism in Government
(ఇంగ్లీషు - ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పండ్రెండవ ప్రచురణము)

రాయల్ ౧/౮ సైజు. పు. ౨౧౦. వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త : యం. వెంకటరంగయ్య, యం. ఏ., ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రధాన చరిత్రోపన్యాసకుడు, వాల్తేరు.

---

### Life of Sri Krishna
(ఇంగ్లీషు)

క్రౌను ౧/౮ సైజు. పు. ౬౪. రు. ౧-౦-౦.

గ్రంథకర్త : కే. గోపాలరావు, తణుకు.

---

### The Philosophy of the Village Movement

క్రౌను ౧/౮ సైజు. పు. ౮౪. వెల రు. ౦-౮-౦.

గ్రంథకర్త : జె. సి. కుమరప్ప, యం. ఏ., B. Sc. (Bus).

ప్రకాశకులు : శనివారపు సుబ్బారావు, కొవ్వూరు. ప. గోదావరి.

---

### In Touch with Ujjain

క్రౌను ౧/౮ సైజు పు. ౧౫౮. వెల ౧-౮-౦

గ్రంథకర్త: కేశవరావు బల్వంతడాంగ్రే, బి. ఏ. (గ్వాలియరు) లష్కరు.

---

### The Dharmic Hindu
(ఇంగ్లీషు మాసపత్రిక)

సంవత్సరముచందా రు. ౧-౦-౦, విడి ప్రతి

సంపాదకుడు : టి. కే. జగన్నాథాచార్య, ధార్మిక ప్రింటింగ్ వర్క్సు, జి. టి., మద్రాసు.

---

# కీ. శే. కాళ్లకూరి గోపాలరావుగారు




ఆంధ్రభాషయందు బహుగ్రంథములను రచించుచు, విద్యాసంస్థలం దనేకముల బోధనాదికార్యముల నెరపుచు, విశ్వవిద్యాలయ వివిధపరీక్షాపరీక్షక బృందమున నిరతము భాగస్వామియగుచు, పెక్కేండ్లు పేరున కెక్కిన జీవితమును గడపుచుండిన కాళ్లకూరి గోపాలరావుగా రిటీవల ఉన్నటులుండి కీర్తిశేషులయినారు.

గోపాలరావుగారు లౌక్యమును దెలిసిన నిత్యసారస్వతజీవనులు. 'చచ్చినవానికన్నులు చేరెడేసి' అనకుండ చెప్పవలెనన్న 'ఆయన పాండిత్యమునందుకంటె గండ్రతనమున మించినవారు; అనన్యసాధ్యమయిన ఆశ్రయణ శక్తిగలవారు; పాకులాడిఅయిన పలుకుబడిని సంపాదించ గలవారు; కార్యసాధనమున భల్లూకపుపట్టువారు; 'యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్' అను వాక్యమునర్థము నాదర్శముగా నుంచుకొని ప్రవర్తించువారు' అనవలెను.

ఆయనకు కొండంతకోరిక యొకటి యుండెడిది. ఆయన తాను రచియించిన 'సౌందర్యమంజరి'ని కృతిపొందిన శ్రీ జయపురాధీశ్వరులచే నిండుకొలువున సన్మానితుడయి ప్రాచీన కవిపుంగవ గౌరవమునకు పాత్రుడు కావలెనని యెంతయో ఉవ్విళ్లూరుచుండెను. తత్సిద్ధికయి యింకను ముద్రణముననున్న 'స్నానఘట్టము' అను తననూతనరచనమునుకూడ శ్రీవారికే కృతియీయ సంకల్పించియుండెను. ఆకోరిక తీరకుండగనే, పాపము, ఆయనకు శరీరపాతము సంప్రాప్తమయినది; ఆయన కుటుంబమున నేకమాత్రముగ శేషించిన ఆయనయర్థాంగి నిరాధారగా నిలిచిపోయినది! అంతయేకాదు. ఆయను దైన్యమునకును పాలయినది! ఇది వింతకాదు. సారస్వతజీవనుల సంపద యట్టిది. దానిజీవితమునకు, వారిజీవితమునకు సామాన్యముగ నొక్కమారే యంతము.

గోపాలరావుగారులేని కొరంత తీరునదికాదు.

---



కుమారి జి. వి. రాజ్యము — 'భోజ' లో లీలావతి పాత్రధారిణి

# సాభిప్రాయ విశేషములు

కాంగ్రెసు స్వర్ణోత్సవము మానవస్వాతంత్ర్య ధర్మసంరంభ సంస్థాపనములందు నవయుగ దివ్యపర్వము. భారతీయసంస్కారము హింసాదౌర్జన్యపరాయణమైన ప్రపంచ వ్యవహారములందు సనాతనములైన అహింసా శాంతిసాధనముల పరిణామమును పొందినది. పరాక్రమణపరాయణమైన ఆత్మోద్ధరణము త్యాగపరిణామమును పొందినది. అనేకత్వావలంబనాశ్రయమైన తత్త్వసందర్శనము ఆత్మావలంబనాశ్రయపరిణామమును పొందినది. వైదికకర్మపరాయణమైన మతాచారములు వేదాంతపరిణామమును పొందినవి. "హరిః ఓమ్"తో నారంభమైన వేదాధ్యయనము "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" పరిణామమును పొందినది అనంతములైన కర్మకాండలు, ధర్మకాండలు, జ్ఞానకాండలును అనన్యమైన భక్తిపరిణామమును పొందినవి. ఖండములైన కర్మలు, ధర్మములు, మతాచారములును అఖండమైన బ్రహ్మమునందు పరిణామమును పొందినవి. హిందూ జైన బౌద్ధ పార్శి మహమ్మదీయ క్రైస్తవ సిక్కు చార్వాకాది మతధర్మము లన్నియును అద్వైతపరిణామమును పొందినవి. సనాతనమైన భారతీయసంస్కారము కాంగ్రెసు చరిత్రయందును సార్థకమగుచు భారతీయ సంస్కారప్రాబల్యమును ప్రపంచమునందు మానవస్వాతంత్ర్యధర్మపరిణామమునకు వినియోగపడుచున్నది. భారతదాస్య విమోచనమునకై ఏర్పడిన కాంగ్రెసుచరిత్ర భారతీయేతిహాసములం దపూర్వమైన నవయుగ ధర్మోదయచరిత్రము. డిసంబరుమాసాంతమునందు కాంగ్రెసుస్వర్ణోత్సవమును జరుపుటయందు ప్రజలు, జాతి మత పక్ష కులాదిభేదములను విడిచి, చూపిన భక్త్యుత్సాహములు ప్రజావిశ్వాసమునకును, సాతంత్ర్యసిద్ధికిని ప్రబల నిదర్శనములు.

* * *

**కాంగ్రెసు స్వర్ణోత్సవములు**

బొంబయియందు 1885 సం. డిశంబరు 28-వ తేదిని గూడిన మొదటికాంగ్రెసునకు ఉమేశచంద్రబోనర్జిగా రాధిపత్యమును వహించిరి. 1885 సం. నుండి 1935 సం. వరకును కాంగ్రెసుద్వారా దేశదాస్యవిమోచనమునకై పాటుపడిన మహానుభావులందు స్త్రీలు పురుషులు యువకులు వృద్ధులు హిందువులు మహమ్మదీయులు క్రైస్తవులు పార్సీలు జాతి మత కుల లింగభేదములు లేకను, సభాధ్యక్షత్వమును వహించి అఖండమైన దేశసేవను జేసిన యుదంతము మానవస్వాతంత్ర్య సమరమునందు గంభీరపర్వము. కాంగ్రెసు ప్రారంభదశయం దభ్యర్థనలతో నారంభమైనను స్వపరిపాలనాదర్శమును ప్రారంభమునుండి

యును సమర్థించినది. దాదాభాయి నౌరోజి లోకమాన్య తిలకుగారులు సర్వసామాన్యమైన స్వరాజ్యహక్కు సిద్ధాంతమును సమర్థించుట కనుభవించిన దైన్యనిర్బంధములు హేయము లైనను విధివిహితము లైనవి. గాంధిమహాత్ముని నాయకత్వముక్రిందను స్వరాజ్యసంరంభమునందు ప్రజానాయకులకు గలిగిన ఆత్మశక్తివిశ్వాసములు భరతవర్షమునందును, ప్రపంచవ్యవహారములందును మహత్తరమైన సంచలనమును గలుగజేసినవి. కాంగ్రెసు హింసాసాధ్యమైన స్వాతంత్ర్యసమరమునందు శాంతిసాధనమును సాక్ష్యము చేసినది. కాంగ్రెసు హింసాదౌర్జన్య పరాయణమైన ప్రపంచమునకు సత్యాహింసధర్మములను సమకూర్చినది. గాంధి స్వరాజ్య కాంగ్రెసు విజయధ్వనులు దేశమునం దంతటను ప్రతిధ్వనిల్లినవి. కాంగ్రెసు పూర్ణస్వరాజ్యము భారతీయుల జన్మహక్కని సుస్థిరము చేసినది. స్వరాజ్యసంపాదనమునకు త్యాగమువలెను దౌర్జన్యము ప్రయోజనకరముగాదను సనాతనధర్మమును కాంగ్రెసు పూరించి ప్రపంచగౌరవమునకు పాత్రతను బడసినది. కరాచి కాంగ్రెసు నిర్ణయించిన ప్రజల జన్మహక్కుల తీర్మానము కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను ప్రజాహృదయమునందు విస్తరింపజేసినది. దేశావృతములైన సత్యాగ్రహప్రస్థానములు ప్రజలయం దపూర్వమైన స్వాతంత్ర్య సంచలనమును గలుగజేసినవి. గాంధిఇర్విను సంధి సత్యాగ్రహ విజయమునకు ప్రమాణముగనున్నది. అపరిచితమైన సత్యాగ్రహప్రయోగమునందు సత్యాగ్రహులు ప్రభుత్వాధికారులును తదితరులును దుష్కార్యములను చేసినను నిత్యమైన సత్యాగ్రహము నిందాపాత్రము కాదు. ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము సత్యాగ్రహప్రయోగమును దుర్లభము చేసినను సత్యధర్మమైన సత్యాగ్రహమును నిర్మూలము చేయజాలదు. ప్రపంచమునకు సత్యాగ్రహమును గాంధిమహాత్ముని సత్యాహింసాధర్మములను సమకూర్చిన కాంగ్రెసు స్వర్ణోత్సవమును, శ్రీయుత బాబు రాజేంద్ర ప్రసాదు గారి యాజ్ఞానుసారముగను ప్రజానాయకుల భక్తిశ్రద్ధలతో జరిపిన విశేషాంశములు స్వరాజ్య విజయమునకు శుభచిహ్నములు. వివిధమతములవారును, పక్షములవారును, జాతులవారును, కులములవారును స్వాభిమానమును విసర్జించి స్వర్ణోత్సవములందువలెను స్వరాజ్యసమరమునందును భాగధేయులై విజయమును బడయుట సకలభారతీయులకును విధ్యుక్తధర్మము. సర్వజనాదరణీయమైన సత్యాగ్రహపరాయణమైన స్వాతంత్ర్యదీక్షాపరమైన కాంగ్రెసునం దితరపక్షములవారు చేరుట ప్రయోజనకరమని తెలిసియును నితరపక్షముల నాయకులు కాంగ్రెసుప్రతిష్ఠను సంకుచితము చేయగోరుట దేశావృతమైన దురదృష్టము. కాంగ్రెసు గతకాలమునందువలెను భావికాలమునందును సత్యాగ్రహదీక్షనుబూని, పూర్ణస్వరాజ్యమును ప్రపంచ

శాంతిని సాధించుటకు పరమేశ్వరానుగ్రహమునకు పాత్రమగుగాత !

* * *

## సత్యాగ్రహము

సత్యాగ్రహము దౌర్జన్యాక్రాంతమైన ప్రపంచమునందు శాంతిస్థాపనమునకు పరమార్థసాధనమని. నానాజాతిసమితి నిర్ణయించిన ఆంక్షలధర్మము రుజువుచేయుచున్నది. ఇటలీరాజ్యము ముస్సోలినిగారి నాయకత్వము క్రింద నవలంబించిన సంగ్రామప్రస్థానమును నిరోధించుటకు నానాజాతిసమితి చేయుచున్న నిర్ణయములు సత్యాగ్రహమునకు ఛాయలు. నానాజాతిసమితి సంయుక్తధర్మబలమూలమునను ఇటలీదౌర్జన్యమును నిరోధించుటకు జేయుటకు నిర్ణయించిన ఆంక్షలు ప్రపంచామోదమును బడసినవి. సర్ సామ్యుయలు హోరు లావలుగార లవలంబింపదలచిన చాణక్యనీతి పరిహాసపాత్రమై హోరుగారి నిర్గమనకు వినియోగపడినది. బ్రిటీషు మంత్రాంగము స్వదేశమునందే నిందాపాత్రమై పరాభవమును పొందినది. ప్రధానమంత్రి బాల్డువినుగారు పార్లమెంటునకును, ప్రజలకును పశ్చాత్తాపమును వెల్లడిచేసిరి. ఇటలీ రాజ్యాధికారులకు రహస్యముగ నభయము నొసంగిన బ్రిటీషు ఫ్రాన్సు మంత్రివర్గమునకు తలవంపులు, భయకంపములు గలిగినవి. యూరపురాజ్యముల రాజ్యాంగ తంత్రములు ప్రపంచమునకు బహిరంగ రహస్యములైనవి. యూరపురాజ్యములు ధర్మవ్యాజమునను పన్నుచున్న కుతంత్రములు భయంకరాకారమును దాల్చినవి. యూరపు రాజ్యతంత్రములు మానవస్వాతంత్ర్య ధర్మాభ్యుదయమునకు ప్రతిబంధకము లగుచున్న విధమునకు మంత్రాంగములు డిక్టేటరుల నిరంకుశాచరణములు, పరాక్రమణములు, సంగ్రామములు, సంగ్రామసన్నాహములు మహావ్యాఖ్యానములు. యూరపు రాజ్యాంగము లారాధించుచున్న ప్రళయమార్గము సమరమునకువలెను శాంతిస్థాపనమునకు సాధనముగా నున్నది. నిస్సహాయులైన ఎథియోపియనులకు ఇటలీచూపుచున్న దౌర్జన్యమునె యూరపురాజ్యము లాసియా ఆఫ్రికావాసులకు చూపుట పరమార్థములకును మూలము. ప్రపంచావృతమైన ప్రళయావస్థయందు శాంతిస్థాపనమునకు సత్యాగ్రహము శరణ్యముగ నున్నది. భారతీయ సంస్కారఫలమైన సత్యాగ్రహము అబిసీనియా సంగ్రామము నుపసంహరించుటకు వలెను. ప్రపంచశాంతిస్థాపనమునకును మానవ స్వాతంత్ర్య ధర్మాభ్యుదయమునకును వినియోగపడుటకు సకలరాజ్యములును దీక్షను బూనుట పరమార్థము. గాంధిమహాత్ముని మూలమునను కాంగ్రెసు ప్రతిష్ఠించిన సత్యాగ్రహధర్మమును కాంగ్రెసునాయకానుచరుల త్రికరణశుద్ధిగను ననుష్ఠించి ప్రపంచసంస్కారపరిణామమునకు మార్గదర్శకు లగుట సకలవిధములను శ్రేయోదాయకము.

* * *

## కాంగ్రెసు ప్రతిష్ఠ

కాంగ్రెసు గతించిన ౧౫ ఏండ్ల యందును గాంధిమహాత్ముని నాయకత్వము మూలమున నపూర్వమైన ప్రతిష్ఠ గణించినది. కాంగ్రెసుప్రతిష్ఠకు నాయకానుచరులు చేసిన మహాత్యాగము ప్రమాణమైనది. ప్రజాహృదయమునందు కాంగ్రెసు ప్రతిష్ఠించిన త్యాగధర్మము ప్రజావిశ్వాసమునకు పాత్రమై ఎన్నికలందు కాంగ్రెసు అభ్యర్థులకు విజయము గలుగుట సహజము. ప్రవృత్తియందు కర్మసన్యాసము వలెను కర్మయోగము సుకరము గాదు. కామ్యకర్మల విసర్జనము సులభమైనటులు కర్మఫలత్యాగము సులభముగాదు. కాంగ్రెసు సత్యాగ్రహమును విరమించి శాసనసభా ప్రవేశమును శాసించినది. కాంగ్రెసు శాసనమును పాలించవలసిన యవసరమును స్థానికసంస్థలు, శాసనసభలు, కాంగ్రెసు సంఘములు, సంస్థలందలిపదవులు సువ్యక్తము చేయుచున్నవి. కాంగ్రెసునాయకానుచరులు సత్యాగ్రహసమరమునందు జూపిన నిగ్రహత్యాగములను కర్మయోగమునందును జూపి కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడి సత్యాగ్రహసాధనమును సకలార్థసిద్ధికిని సార్థకము చేయుదురుగాత! గాంధిమహాత్ముడు కాంగ్రెసు స్వర్ణోత్సవసమయమునందు పంపిన సందేశమె ప్రపంచశాంతికిని, మానవస్వాతంత్ర్య ధర్మసంస్థాపనమునకును శరణ్యమగుచున్నది. సత్యాగ్రహాచార్యుడు గాంధిమహాత్ముడనారోగ్యస్థితియందుండుట దురదృష్టము. భగవంతుడు గాంధిమహాత్మునకు స్వస్థత ననుగ్రహించి, సంగ్రామోపశమనమును, శాంతిస్థాపనమును, మానవస్వాతంత్ర్యాభ్యుదయమును సార్థకము చేయుగాత!

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

